# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS

IN THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY MADRAS

BY

MAHĀMAHŌPĀDHYĀYA S. KUPPUSWAMI SASTRI, M.A.
PROFESSOR OF SANSKRIT AND COMPARATIVE PHILOLOGY, PRESIDENCY COLLEGE,
AND CURATOR, GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS

*Prepared under the orders of the Government of Madras*

VOL. II—Prabandhas—Śṛngāraprabandhas
(PART II)

MADRAS
PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS

1927

# CONTENTS.

CLASS I—PRABANDHAS—*cont*

(3) *Śrngāraprabandhas*

# A DESCRIPTIVE CATALOGUE
## OF THE
# TELUGU MANUSCRIPTS
## VOLUME II, PART 2.

## CLASS I. PRABANDHAS—*(continued)*

### 3 SRNGĀRAPRABANDHAS—(*cont*)

### No 617 మదనమోహినీవిలాసము.
### MADANAMOHINĪVILĀSAMU

Pages, 5 Lines, 21 on a page Mode of writing, good but containing mistakes

Begins on fol 146*a* of the MS described under No 601

Fragmentary

This Prabandha apparently describes the love of Nalakūbara to Madanamōhini who were made to meet by the mediation of a parrot. The name of the author is not given

**Beginning**

క. ఒనరించి భృంగుల్ లంతటఁ
జనుపిస్తుటఁ దమ్మిగొలనిచల్లసి గాడ్పుఁ(లే)
దనమది విరహానలముగా
కనకన(మని) గవలు తిన్నఁగాఁ బైనొలయగా.

**End**

సీ. పిమ్మటిగొని మిన్ను బెదరిచూచి చరించు
నెఱక లార్చుచుఁ గేళి కెకెరు యెకెరు
తల్లడింపుచు భామ తాపంబుఁ దలపోసి
యలమినకౌఁగిట నాఁచి యాఁచి
క నుండి నిట్టూర్పు లడరంగ నూరార్చ
మొన(ముకురు)ముకురున మోపి మోపి

తెగువమైఁ జన లేక తిరిగి సాకేతుఁ గాంచి
నిలుచున్నఁ గన్నీరు నించి నించి
తవిలి నెఱసంజ మెఱమెఱి యనఁగ ద్రోయ
జూణకఁ గూడక చనునట్టిజోడుఁ బాసి
కరఁగి విరహాగ్ని . .

(వి-వి)—

తుదమొదళ్లు లేనిస్వల్పభాగముమాత్రము వ్రాఁత చొక్కముగ నున్నది. తప్పులు కలవు శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందలికథ నలకూబరుఁడు, మదనమోహిని వీరలను గుఱించి నదిగాఁ గాన్పించుచున్నది నలకూబరుఁ డాపడఁతికొఱకుఁ జింతింపు చుండ నొకచిలుక వచ్చి వాని నోదార్చి యానాతిం గూర్చెద ననుటయు నస్తమయవర్ణనమును నీభాగమునవర్ణింపఁబడినవి దీని నెవ్వరు రచియించిరో తెలియరాదు.

## No 618 మధురవాణీవిలాసము

## MADHURAVANĪVILĀSAMU

Pages, 122 Lines, 22 on a page Mode of writing, fair but containing plenty of mistakes

Begins on the fol. 26*a* of the MS described under No 372

Incomplete Contains the first five Āśvāsas

This is the same work as that described under R No 41*d* of the Triennial Catalogue of MSS., Part 3, Vol I

(వి-వి.)—

తొలిమైదాశ్వాసము లున్నవి కాని గ్రంథము పూర్తియైనట్టు తోఁపదు. వ్రాఁత యొకతరబడిగా నున్నది కాని తప్పులు పెక్కులు గలవు.

ఇది ట్రై. క్యా. నె 41 రున వర్ణితమైన గ్రంథమువంటిదే.

---

## No. 619 మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 17½ × 1⅜ inches Pages, 136 Lines, 6 on a page Mode of writing, good but not quite correct Condition, good Appearance, not old.

Complete in six Āśvāsas

The date of transcription and the name of the scribe given in the MS. are extracted in the Telugu remarks below

This celebrated Prabandha describes mainly the events and incidents that led to the birth of Svārōcisa Manu and his father, as given in the Mārkandēya Purāna (Sanskrit) The work is therefore called also Svārōcisamanusambhavamu. The author is the well known Allasāni Peddanārya, son of Cokkanāmatya of Nandavara sect, and disciple of Śathakōpayati The author bore the title Āndhrakavitāpitāmaha, and dedicated the work to Krsnadēvarāya of the Tuluva line of kings This king is said to have borne the titles of Vīrapratāpa, Mūrurāyaraganda Rājaparamēśa, etc, and his genealogy and some of his victories are referred to in the introduction of the work which is given as extracts below

**Beginning:**

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమున బ్రీతి న్నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్.

* * * *

క. కొలుతున్ మద్గురు విద్యా
నిలయుం గరుణాకటాక్షనిధి, జ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠగోపయతిన్.

* * *

క. అని యిష్టదేవతావం
దనసుకవిస్తుతులుఁ గుకవితతినికృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు
ననుకూలకథల్ దలంచునాసమయమునన్.

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వనికుమా
రతకుఁ గ్రౌంచాచలరాజ మన్యో
నావాజిపతిశికంధరసింధురాధ్యక్షు
లరి గాపు లెవ్వానిఘన(ఖర)తరాస
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని
కళ(సి) వారగా నేఁగునట్టిబయలు

సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖ
ప్రబలరాజాధిరాజవీరప్రతాప
రాజపరమేశబిరుదవిభ్రాజి యవ్వఁ
డక్షీశ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ
డాకర్ణనాథు కృతు వాఁ బుట్టితిల్ల

*

క. భువనవిజయాఖ్యసంస
ద్భువనస్థితసింహపీఠి బ్రాజ్ఞులగోష్ఠిం
గవితామధురిమ సందము
దవులం గొలువు డి సదయత న్నను బలెరాఁ.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచి
ఖిలము గాకుండునది ధాత్రి కృతియె కాన
గృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య

క. హితుఁడవు చతుర్వచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకుఁ.

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసపసమంచితకథలఁ
వినుపింపు కలిధ్వంసన
మనఘ భవచ్చతురరచన కనుకూలంబుఁ.

కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పు మని కర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసాదం బని మోదంబున నమ్మహాప్రబంధనిబంధంబునకుం బ్రారంభించితి నేతత్కథానాయకరత్నం బగునమ్మహీనాధువంశావతారం బెట్టిదనిన.

* * * *

తే. వానివంశంబు తు(ళువా)న్వవాయ మయ్యె
నందుఁ దిక్కరేంద్రునృపు లుదయంబునొంది

నిఖిలభువనప్రపూర్ణనిర్ణిద్రకీర్తి
నధికు లైరి తదీయాన్వయమున బుట్టి

మహాస్రగ్ధర. ఘనుఁ డై తిమ్మక్షితీశాగ్రణి శరకలిర... వసంఘాతవాతా
శనరాడాశాంతదంతిస్థవిరకిరులజంఝాటలు ల్మాన్పి యి [మ్మే
దని దోర్దండైకపీఠిన్ దరముపటిచి కీర్తిద్యుతుల్ రోద [సిం బ
ర్వ నగాతుల్ నమ్ము లై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్ర [తాపంబుఁ జూపెన్.

క. వితరణఖని యాతిమ్మ
క్షితిపాగ్రణిమణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ
డా పుణ్యుఁడు పుట్టె సజ్జనావనపరుఁ డై

క. ఆయీశ్వరనృపతికిఁ బు
ణ్యాయతమతి యైనబుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి
ధీయుతు లగునారసింహ తిమ్మనరేంద్రుల్

* * * *

తే. ఆనృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు.

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుషధారాహతవై
రాగి యగుచు నేకాతప
వారణముగ నేలె ధరణ నవారణమహిమన్

క ఆవిభుననంతరంబ ధ
రావలయము దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా

దేవియు శుభమతి తిరుమల
దేవియుఁ దనుఁగూర్పనట్టిదేవేరులుగాన్.

* * * *

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చనై జనించె
మరి కొండవీడెక్కి మారెక్కి నలిసైన
యలకసవాపాత్రు నంటి రాఁజె
నటసాగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ
గోన బిట్టేర్చెఁ గోట్టానఁ దగిలెఁ
గనకగిరి స్ఫూర్తిగరఁచె గౌతమిఁ గాఁచె
నవల నాపొట్నూర రవులుకొనియె
మాడెములఁ బ్రచ్చె (బ్రేల్చె) నొడ్డాది మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పడఁ
దోఁచిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని.

మ. ధరఁ గొంధాళులు కృష్ణరాయఁచమూధాటీగతి న్వంధ్యగ
హ్వరము ల్దూరఁగఁ జూచి తారచటఁ గాఁపైయుండుటల్ జాల న
చ్చెరువై యొఱ్ఱనివింత గిఁకటులు వచ్చెం జూడరే యంచు వే
సొరిదిం జూతురు వీరరుద్రగజరాట్సుద్ధాంతముద్ధాంగనల్.

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్నూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకున్ దిగుసురప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తికజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్.

సీ. గీ . . . . . . .
మూరురాయరగండాంకవీరకృష్ణ
రాయభూభృద్భయంకర ప్రబలధాటి.

క. ఏవంవిధగుణవంతున
కావల్లత్తురగబహువిధారోహకళా
రేవంతున కతిశాంతున
కావిష్కృతకీర్తిధవళితాశాంతునకున్.

అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మనుసంభవ చరిత్రంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన జైమినిస్వాయంభువకథాశ్రవణా నంతరంబున మీఁద నెవ్వండు మనువయ్యె నే(జే?)గింపు మనవుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పినప్రకారంబున నిట్లని చెప్పం దొడంగె.

మ. వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళితప్రాలేయరుఙ్మండలీ
హరిణం బై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునన్
బుర మొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తి న్విడంబింపుచున్.

**End:**

శా. వ్యాయామస్థిరసంధిబంధ కటకాధ్యక్షౌను గక్షోణిభృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోఃఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయఃకీర్తిభరప్రపంచ వరపంచారామరామామణీ
గేయామేయజయాంక పంకజదృగంగీకారధీరాకృతీ.

క. కాంతాలతాంతశర యే
కాంతికభక్తిప్రతోషితాంభోధిసుతా
కాంతా ప్రతాపదరవి(రవిశశి)
కాంతాయితవిమతనృపతికాంతాహృదయా.

వనమయూరము రాజవరమేశ ఫణిరాజముఖపుల్లాం
భోజముఖ భోజముఖభూపవిపులాంసో
త్తేజితమహీభరణదీక్షితభుజా ని
ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షుపాదాంబుజాధీనమానసేందిందిర నందవరవంశోత్తంస శఠగోపతాపసప్రసాదాసాదితకవితామతల్లి కాల్లసాని చొక్కనామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతం బైనస్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. నిర్దోష మన వీలు లేదు శైథిల్య గ్రంథపాతగహితము.

గ్రంథాంతమున నిట్లున్నది :—

"విజయనామసంవ్వత్సర మాఘ బ ౧౪. ఆ వరుకు మనుచెరిత్ర ప్రతిలో వున్న క్రమంగాను తటవర్తి వెంకన్న వ్రాశెను."

మార్కండేయపురాణోక్తస్వారోచిషమనుసంభవ ప్రకారమిందు విస్తరించి క్రొత్తసేత యగు ప్రబంధరూపమున వ్రాయఁబడినది దీనికి స్వారోచిషమనుసంభవ మనునామాంతరముఁగలదు. దీని నల్లసాని పెద్దనార్యుఁడు రచించెను ఈతనితండ్రి చొక్కనామాత్యుఁడు. ఇతఁడు విశతగోపయతిశిష్యుఁడు. నందవరవంశీయుఁడు. ఈతని "ఆంధ్రకవితాపితామహుఁ" డను బిరుదము గలదు. ఏతత్కృతిభర్త శ్రీకృష్ణదేవరాయలు తుళువవంశపురాజు. ప్రబలరాజాధిరాజ, వీరప్రతాప, రాజపరమేశ, మూరురాయరగండాద్యనేకబిరుదాంకితుఁడు. ఈతనివంశవిజయాదికము లుదాహృతపద్యములవలనఁ దెలిసికొనఁదగు.

## No 620 మనుచరిత్రము
## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 17 × 1⅝ inches Pages, 154. Lines, 6 on a page Mode of writing, indifferent and not free from mistakes Condition, injured Appearance, very old

Complete, but some leaves are torn in the beginning and some are missing

Same work as the above

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్ననిది కాదు తప్పులును గలవు. శైథిల్య గ్రంథపాతములు మెండు.

ఇది పూర్వవర్ణితముంబలె.

---

## No 621 మనుచరిత్రము.
## MANUCARITRAMU

Substance, paper Size, 12 × 8 inches Pages, 310 Lines, 24 on a page Mode of writing, good but not quite free from mistakes. Condition, good Appearance, old

Complete.

Transcribed only on one side Different readings are interlined and those selected are written on the opposite side

Same work as the above

(తె-వి.)—

సమగ్రము. వ్రాత బాగుగ నున్నది అంతనిర్దుష్టము కాదు శిథిలము కాదు గ్రంథము ప్రతమున కొకవైపుననే వ్రాయబడినది పాఠాంతరములు పంక్తులనడుమ వ్రాయబడి యున్నవి అంగీకృతపాఠము లెదుటివైపున గలవు

పూర్వమువలెనే [illegible]గునది

## No. 622. మనుచరిత్రము
## MANUCARITRAMU

Pages, 1[illegible] Lines, 6 on a page Mode of writing, good but containing plenty of mistakes

Begins on fol 24*a* of the MS described under No 234

Complete

Same work as the above

(తె-వి)—

సమగ్రము. వ్రాత లెస్సగా నున్నది తప్పులు మిక్కిలి కలవు. శిథిలము కాదు.

ఇది మున్ను పేర్కొనబడినదానివంటిదే

---

## No 623. మనుచరిత్రము.
## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 16½ × 1¾ inches Pages, 221 Lines, 5 on a page Mode of writing, fair but not quite correct Appearance, old. A few leaves in the end are worm-eaten

Complete

Same work as the above

(తె-వి.)—

సమగ్రము. వ్రా లందముగ నున్నవి. తప్పు లంతగా లేవు. గ్రంథపాతము లేదు కాని శైథిల్య మించించుక గలదు.

పూర్వవర్ణితముంబోలినది.

## No 624. మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, $16\frac{5}{8} \times 1\frac{1}{8}$ inches Pages, 177 Lines, 5 and 6 on a page Mode of writing, indifferent and incorrect. Condition, good Appearance, old

Complete

Same work as the above

The date of transcription and the name of the scribe found at the end of the work are given below —

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుగ లేదు. తప్పులు గలవు శైథిల్య గ్రంథపాతరహితము గ్రంథాంతమున నిట్లున్నది:—

"శ్రీపెనుమర్లసోమేశ్వరా నీ వేగతిసుమ్మీ. విజయనామ సంవత్సర మాగ(ఘ)శు 3 గు వరకు శ్రీరామలింగస్వామికృపను నండూరి భీమప్పగారికామరాజు వసుచెరిత్ర మనుచెరిత్ర సంపూర్ణంగా వ్రాశియిచ్చెను" అని.

మున్నటిదానికిదియునవే యొఱుఁగునది.

## No 625 మనుచరిత్రము

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, $17\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 185 Lines, 6 or 7 on a page. Mode of writing, fair but not quite correct Condition, injured. Appearance, old

Complete.

Same work as the above

The scribe's name and the date of transcription noted at the end of the MS are extracted below —

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకతీరుగానున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

గ్రంథాంతమున—

"కాళయుక్తినామసం॥ నిజశ్రావణశు ౧౪ శె సరికి ఆలమూరి అచ్చన్నకొమాళ్లు గంగ్గరాజు ఆత్మార్థమై మనుచరిత్ర ఆరుఆశ్వాసములును సంపూర్ణంగాను ప్రతినున్నక్రమాన వ్రాశెను." అనియున్నది.

తక్కినంగలవిశేషములు పూర్వమువలెఁ గాననగు.

## No 626. మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 11½ × 1⅞ inches Pages, 64 Lines, 5 on a page Mode of writing, bad but fairly correct Condition, injured Appearance, old

Incomplete

Contains the third Aśvāsa

Same work as the above

(ఏ-ఏ.)—

మూఁడవయాశ్వాసముమాత్రము గలదు. వ్రాలు లెస్సలు కావు. తప్పులు మిక్కిలి లేవు. పాతము గాదు కాని మిక్కిలి శిథిలము.

మున్నుఁబోలె.

## No 627 మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 16 × 1¼ inches Pages, 74 Lines, 5 on a page Mode of writing, very bad and full of mistakes Condition, injured Appearance, very old

Incomplete, contains the Āsvāsās 2 and 3

Same work as the above

(ఏ-ఏ.)—

రెండుమూఁడాశ్వాసములుమాత్రము కలవు వ్రాఁత తిన్ననిది కాదు. తప్పులు కుప్పలు గ్రంథ మతిప్రాచీనము తునుకలుతునుకలు. పుర్వులపాలును.

పూర్వమువలె.

---

## No 628 మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 12½ × 1¾ inches Pages, 48 Lines, 7 on a page Mode of writing, fair but not correct Condition, injured. Appearance, rather old

Contains the Āsvāsās 1 to 3 complete except the introductory portion in the 1st Āśvāsa.

Same work as the above.

The name of the scribe and the date of transcription given at the end of the MS are extracted below —

(వి-వి.)—

కృత్యవతరణికతకరుం దొలిమూండాశ్వాసములు నిండుగం గలవు వ్రాంత యొకవిధముగ నున్నది కాని నిర్దుష్టము గాదు గ్రంథపాతరహితము అతిప్రాచీనము ప్రుప్పులకు బుప్పయైనది. నుకరులుముకరులు

పూర్వవర్ణితము వంటిదే.

గ్రంథముతుదపత్రమున "పింగళిసంవత్సర భాద్రపదశు ౧౦ బు॥ వరకు రేవప్రోలు వెంకటరామయ్య ప్రదయాఖ్యచరిత్ర గొందాలగురువప్పకు వ్రాసియిచ్చెను" అని కాన్పించుచున్నద

## No 629. మనుచరిత్రము.

## MANUCARITRAMU

Substance, palm leaf Size, 17½ × 1⅜ inches Pages, 122 Lines, 7 on a page Mode of writing, good but incorrect Condition, injured Appearance, old

Complete but a few leaves are missing here and there

Same work as the above

The scribe gives his name at the end of the 1st Āsvāsa which is extracted below —

(వి-వి.)—

సమగ్రము కాని కొన్నిపత్రములుమాత్ర మచ్చటచ్చట చూపట్టకున్నవి. వ్రాంత చొకరమైనదే. నిర్దుష్టము కాదు. శైథిల్యము గలదు. ప్రతి ప్రాంతదే.

పూర్వము వలెనే

ప్రథమాశ్వాసము చివర వ్రాయసకానిపే రీతీరున నున్నది "శంకరరభట్ల పాపంన్న వ్రాసినది మొదటి ఆశ్వాసము" అని.

## No 630. మనుచరిత్రము.

## MANUCARITRAMU.

Substance, palm-leaf. Size, 13¾ × 1¼ inches Pages, 99. Lines, 5 or 6 on a page Mode of writing, bad and incorrect Condition, injured Appearance, old

Contains the first 3 Âśvāsās.

Same work as the above

Below are extracted the name of the scribe and the date of transcription —

(ఓ-ఓ)—

తొలి మూఁడాశ్వాసములు మాత్రము. వ్రాఁత యందముగ లేదు. తప్పులు కలవు శైథిల్యము లేదు

పూర్వ పర్ణిత గ్రంధమువలెనే యొప్పుచున్నది

పుస్తకము తుదను —

"ప్లవంగనామసంవత్సర కార్తిక శుద్ధ ... శుక్రవారం పెద్యేటి బాపిరాజు కొమారుడు గంగరాజు మనుచెరిత్ర మూఁడు ఆశ్వాసాలు సంపూర్ణంగాను సింగ్గిలి . కుమారుఁడు సుబ్బారాజు బడిలోను స పూర్ణముగాను చదివెనూ." అని కలదు

## No. 631 మనుచరిత్రము

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 16¼ × 1⅜ inches Pages, 46 Lines, 6 on a page Mode of writing, not good and not quite correct Condition, good Appearance, old

Breaks off in the 3rd Âśvāsa

Same work as the above

The name of the owner written on the face of the MS. is given below —

(ఓ-ఓ.)—

మొదటినుండి మూఁడవయాశ్వాసములోఁ గొంతవఱ కున్నది. వ్రాఁత చక్కఁగ లేదు. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతము లేదు.

పూర్వమువలె.

గ్రంథాదిపత్రముమీఁద.

"తెయ్యేటిరంగయ్యకొమారుఁడు రామబ్రహ్మం మనుచెరిత్ర పుస్తకము . . . ." అనియున్నది.

No 632. మనుచరిత్రము.

MANUCARITRAMU

Substance, palm leaf Size, $11\frac{1}{4} \times 1\frac{7}{8}$ inches. Pages, 20 Lines, 5 or 6 on a page Mode of writing, fair but full of mistakes Condition, not injured Appearance, old

Contains a portion in the 1st Āśvāsa

Same work as the above

(వి-వి.)—

ప్రథమాశ్వాసమునఁ గొంతభాగమే కలదు వ్రాఁత యొకరీతిగ నున్నది. తప్పులు మెండు. అశిథిలము. గ్రంథపాతము లేదు.

పూర్వమువలెనే.

No. 633. మనుచరిత్రము.

MANUCARITRAMU

Substance, palm-leaf Size, $16\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 54 Lines, 5 on a page Mode of writing, bad and full of mistakes Condition, much injured Appearance, old

Contains portions in 1 to 3 Āśvasās arranged irregularly

Same work as the above

(వి-వి.)—

1, 2, 3 ఆశ్వాసములలోనికొన్నిపద్యములుమాత్రము తాఱుమాఱుగ నున్నవి. వ్రాఁత బాగుగ నుండలేదు. తప్పులు కుప్పలు మిక్కిలి శిథిలము. పాతములును గలవు.

పూర్వమువలెనే తెలిసికొనునది.

No 634 మనుచరిత్రము.

MANUCARITRAMU

Substance, palm-leaf Size, $18 \times 1\frac{5}{8}$ inches Pages, 38 Lines, 5 or 6 on a page Mode of writing, fair but not quite correct Condition, injured. Appearance, old.

Contains Āśvāsās 1 and 2 without the introductory portion.

Same work as the above. A few stanzas occurring in the beginning of the 3rd Āśvāsa are written on the front leaf by a different scribe

(వి-వి.)—

అవతారికతప్ప 1—2 ఆశ్వాసములు నిండుగాఁ గలవు. వ్రాఁత యొకవైఖరిగా నున్నది నిర్దుష్టము కాదు. ప్రాచీనము. శైథిల్యము మెండు పురుగులపాలైనది.

మున్ను వర్ణింపఁబడినదానితీరునఁ గనునది.

తొలియాకుమీఁద మూఁడవయాశ్వాసపు మొదలిపద్యములు పెరయతని వ్రాఁతఁ గొన్ని గలవు

## No 635 మనుచరిత్రము
## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 16¼ × 1⅛ inches Pages, 196 Lines, 5 on a page Mode of writing, not good and not free from mistakes Condition, badly injured Appearance, old

Breaks off in the 6th Āśvāsa Leaves are in disorder

Same work as the above

(వి-వి.)—

ఆఱవయాశ్వాసమునఁ గొంతదాఁకా గ్రంథమంతయు నున్నది. వ్రాఁతలందములు గావు. తప్పులు లేకపోలేదు. అతిశిథిలము మిక్కిలి ప్రాచీనము. పత్రములు తాఱుమాఱుగా నున్నవి

పూర్వమువోలె.

## No 636. మనుచరిత్రము.
## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 14¼ × 1⅛ inches Pages, 116 Lines, 5 on a page Mode of writing, indifferent and incorrect Condition, bad Appearance, old

Contains Āśvāsās 1 to 3 complete and the 4th incomplete.

Same work as the above

(వి-వి.)—

తొలిమూఁడాశ్వాసములు, నాలవయాశ్వాసమునఁ గొంత వఱకుఁ గలదు. వ్రాఁత యింపైనది కాదు. నిర్దుష్టమును గాదు. ప్రాచీనము. పత్రములు పెక్కులు చిరిఁగిపోయినవి.

పూర్వము వోలె.

---

## No 637 మనుచరిత్రము

## MANUCARITRAMU

Substance, palm-leaf Size, 17⅜ × 1½ inches Pages, 14 Lines, 7 on a page Mode of writing, ordinary and not free from mistakes Condition, much injured Appearance, old

Begins on fol 12*a*. The other work herein is Āndhrabhāṣābhūṣana 1*a*

Contains a portion of the 3rd Āsvāsa with neither the beginning nor the end

Same work as the above.

(వి-వి.)—

మూఁడవయాశ్వాసమునఁ గొంతభాగము తుదమొదళ్లు లేక యున్నది. వ్రాఁత సామాన్యము. నిర్దుష్ట మనఁదగదు. అతి శిథిలము ప్రాచీనమును.

మున్నుఁబోలె.

---

## No 638. మనుచరిత్రము.

## MANUCARITRAMU

Pages, 16 Lines, 5 on a page Mode of writing neither good nor free from mistakes

Begins on fol 124*a* of the MS described under No 127.

Contains the 1st Āsvāsa without introduction and a small portion of the 2nd Āsvāsa

Same work as the above

(వి-వి)—

తొలియాశ్వాసము, మలియాశ్వాసమునఁ గొంతవఱకు నున్నది. అవతారిక లేదు. వ్రాలు బాగుగ లేవు. తప్పులతడక. మిక్కిలి ప్రాచీనము. అతిశిథిలము.

పూర్వపుగ్రంథమువలెనే యెఱిఁగికొనునది

## No 639. మనుచరిత్రము.

## MANUCARITRAMU.

Substance, palm-leaf Size, 17¼ × 1⅝ inches Pages, 9. Lines, 7 on a page. Mode of writing, fair but containing mistakes. Condition, bad Appearance, old

Begins on fol. 16*a* The other work herein is Āndhranāmasaṅgrahamu

Contains a few stanzas towards the end of the 3rd Āśvāsa.

Same work as the above.

(వి-వి.)—

తృతీయాశ్వాసమునందలి కొన్నిపద్యములు. ఆశ్వాసాంతమువఱకున్నవి. వ్రాలు మంచివే కాని తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No 640 మనుచరిత్రము.

## MANUCARITRAUM.

Substance, palm-leaf Size, 17⅝ × 1¼ inches Pages, 144 Lines, 6 on a page Mode of writing, fair but not free from mistakes. Condition, worm-eaten Appearance, old.

Complete

Same work as the above.

(వి-వి)—

సమగ్రము. వ్రాంత యొకతీరున నున్నది కాని నిర్దుష్టము కాదు. గ్రంథపాతము లేదు. శైథిల్యము కలదు. పుర్వులపాలు.

పూర్వవర్ణితగ్రంధమువలెనే.

---

## No. 641. మనుచరిత్రము. (సటీకము)

## MANUCARITRAMU. (With commentary.)

Substance, paper. Size, 11⅝ × 7 inches. Pages, 419 Lines, 24 or 25 on a page Mode of writing, good and correct Condition, fair. Appearance, old. Written on one side of paper

Complete in two volumes, each containing 3 Āśvāsās.

Same work as the above but with a commentary which was prepared by Zulūri Appayya Śastry in the year 1831 under the orders of

Mr. C P Brown and was written by the former in his own hand as stated in the English and Telugu notes below

Note of Mr C. P Brown appearing on the fly-leaves of the two volumes is as follows —

"The Manucaritra volume I. With a commentary in the autograph of the learned author Zūlūri Appayya Śāstri who composed it at the desire and at the expense of Mr C P. Brown"

"The Manucaritra; volume IInd and last With a commentary explaining every word, in the original handwriting of Zūlūri Appayya, a Brahmin of extraordinary learning, who understood and accomplished this arduous and important work at the desire and in the pay of C. P. Brown"

The date of completion of the commentary and the name of the scribe (commentator) found at the end of the 2nd volume are extracted in the Telugu remarks below

**Beginning:**

శా. శ్రీ వక్షోజ కురంగనాభ మెదపై జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమున ప్రీతి న్నిల్పినాఁడో యనం
గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్.

టీ లక్ష్మీదేవియొక్క స్తనసంబంధమైన కస్తూరి వక్షస్స్థలముమీఁదను ఒప్పుచుండగాను భూదేవినికూడా ఆ లక్ష్మీదేవియొక్క సరసను ప్రేమచేతను ఉంచినాఁడా అనేటట్టుగా స్తోత్రముసేయుచున్న సనందనుఁడు మొదలుగా గల భక్తసమూహామునకు కనుపడుతున్నటువంటి తామర రేకులవంటికన్నులుగలవిష్ణుమూర్తి మంగళకరమైనవీక్షణముచేతను యీ కృతినాయకుఁడైనకృష్ణదేవరాయప్రభువును ధన్యునిగా చేయుగాక.

అనగా విష్ణుమూర్తివక్షస్థ్సలమందు లక్ష్మీస్తనకస్తూరి అంటితే నల్లని దేహకాంతి గలభూదేవిని గూడా లక్ష్మీదేవిసరసను నిల్పినాఁడా యేమి అనేటట్టుగా సనందనాదులకు తోఁచబడె నని తాత్పర్యము.

* * * *

**End:**

వనమయూరము. రాజపరమేశ ఫణిరాజబల ఫుల్లాం
భోజముఖ భోజముఖభూప విపులాంసో
త్తేజిత ధరా భరణ దీక్షిత భుజా ని
ర్వ్యాజ భయదాజి విజితారినృపరాజీ.

టీ. రాజపరమేశ్వరబిరుదుగలవాఁడా శేషాహివంటిబలముకలవాఁడా వికసించినకమలమువంటిముఖముకలవాఁడా భోజుఁడుమొదలైనరాజుల యొక్క విస్తారమైన భుజబలముచేతను మిక్కిలి మెరుఁగుపెట్టబడినటువంటి భూమియొక్క భరించడమందు సంజాతదీక్షగల బాహువులుగలవాఁడా నిర్నిమిత్తమానట్టుగాను భయమునిస్తూవుండే యుద్ధములయందు జయింపబడిన శత్రురాజసమూహముగలవాఁడా.

**Colophon:**

ఇది శ్రీమదంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస శఠగోపతాపస ప్రసాదా సాదిత చతుర్విధ కవితామతల్లికా ల్లసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

టీ. ఇందుకుటీకప్రథమాశ్వాసప్రకారమే అని విచారించవలసినది.

ప్రథమాశ్వాస గద్య టీక.

ఇది సంపదతో గూడిన ఆంధ్రకవిత్వమునకుబ్రహ్మఅనేటట్టుగా అంతటావ్యాపించినటువంటి బిరుదుగలిగినటువంటిన్నీ విష్ణుమూర్తియొక్కపాదములనే కమలములకు వశమైనటువంటి మనస్సనేతుమ్మెదగలిగినటువంటిన్నీ నందవరసంజ్ఞగల వంశమునకు అనఁగా నందవరీకవంశమునకు శిరోభూషణమైనటువంటిన్నీ శఠగోపయతియొక్క అనుగ్రహముచేతన పొందబడినటువంటి నాలుగువిధములనగాబంధకవిత్వచిత్రకవిత్వగర్భకవిత్వఆశుకవిత్వములనేభేదములుగలిగినటువంటి కవిత్వమందు శ్రేష్ఠుడైనటువంటిన్నీ అల్లసానిచొక్కయఅనేప్రధానియొక్కకొమారుడైనటువంటి పెద్దనఅనేపూజ్యునిచేతను చెప్పఁబడినటువంటి స్వారోచిషమనుసంభవమనే మహాప్రబంధమందు . . . . .

(వి-వి.)—

సమగ్రము. (రెండుసంపుటములు) వ్రాలుపత్రమునకొకవైపునమాత్రమె వ్రాయఁబడి యందముగా నున్నవి. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు కాని పుర్వులచేమాత్రము కొంచెము మెసవఁబడి యున్నది.

ఇందలిమూలము పూర్వవర్ణితగ్రంథమువంటిదే. వ్యాఖ్యాత మూలమునందలిపదముల నన్వయానుక్రమముగ లెక్కించి క్రమముగ నాలెక్క

గల పదముల యర్థమును మాత్రమే వ్రాసియున్నాఁడు. దీనిని జూలూరిఅప్పయ్యశాస్త్రిగారు మె॥ సి. పి. బ్రౌనుదొరవారియనుమతిచొప్పున రచియించి స్వహస్తమున వ్రాసినట్లు గ్రంథాంతమున వారు వ్రాసికొనిరి. ఇందుఁ బ్రతిసంపుటము మొదలి పత్రమునఁ బై విషయమునే మే॥ దొరవారింగ్లీషున వ్రాసియున్నారు.

తుదను (రెండవసంపుటముచివరను);

"ఖరనామసంవత్సర మార్గశిరబ౧౧ గురువారం అ౧౮౩౧సం॥ డిశంబరునెల ది౨౯ తేది వరకు మహారాజశ్రీ చార్లిసుఫిలిఫ్బ్రౌనుదొరగారిసెలవు ప్రకారము జూలూరిఅప్పయ్య యీస్వారోచిసమనుసంభవమునకు అనగా మనుచరిత్రకు టీక చెయ్యడ మయినది" అని యున్నది.

## No. 642 మనుచరిత్రశబ్దసూచి.

## MANUCARITRAŚABDASŪCI

Substance, paper Size, 12¼ × 8 inches. Pages, 726 Lines, 19 on a page Mode of writing, good but not quite free from mistakes Condition, good. Appearance, old

Complete

The following note of Mr. C. P Brown appearing on the fly-leaf of the MS. explains the nature of the work

"This verbal index to the Manucaritra, a celebrated Telugu poem, was compiled at Masulipatam in the year 1832 under the directions of C. P. Brown."

**Beginning**:

అంక—అవతారిక - ౫౧ - ప్ర - ౪౩ - ౪౬ - ష - ౧౩౧.

అంకపాళి - అవ - ౧౫-ష౧౦౦.

అంకము - తృ - ౨౮.

అంకముచేరి - అవ - ౪.

అంకమునను - ప్ర - ౩.

అంకముల్ |- అవ - ౨౯ - ద్వి - ౪. G.P.M

అంకముల |- అవ.

అంకస్థాయిగా - చ - ౧౧౩.

అంకస్థిత - ప్ర - ౨౩.

అంకించి - చ - ౩౪.

అంకితము - పం - ౫౯.

అంకుర - అవ - ౪ - చ - ౪ - ష - ౩౧.

అంకురం - ష ౧౭.

అంకురంబుల - చ - ౨౮.

అంకురత్ - తృ - ౧౫౧.

అంకురము - ద్వి - ౭౮.

**End :**

హాహామధూమము - వం - ౧౧౪.
హాహారా హారిగా - తృ - ౧౨౯.
హాహామాది - తృ - ౧౩౯.
క్షాదంబు - పం - ౮౯.
హాహామాడలు - వ - ౫౧.
క్షాదాంసభః - చ - ౭౪.

The end.

(ఖి-ఖి.)—

సమగ్రము. 'అ' మొదలు 'హ' వఱకు. వ్రాఁత చక్కఁగా నున్నది కాని నిర్దోష మన వలను కాకున్నది. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది మనుచరిత్రయందుఁ బ్రయోగింపఁబడిన పదములయొక్క యకారాదిశబ్దసూచి. అన్నిపదములు నున్నటులఁ దోఁపదు. (ఇందలిపద్య సంఖ్య యిప్పటిముద్రితగ్రంథములపద్యసంఖ్యకు సరిపడదు.) ఇది మచిలీ పట్టణమునందుఁ దమయాజ్ఞానుసారముగ 1832 వ సంవత్సరమున వ్రాయఁబడినట్లు మే॥ సి. పి. బ్రౌనుదొరవారు ముఖపత్రముమీఁద నింగ్లీషున వ్రాసియున్నారు.

## No. 643. మాధవాభ్యుదయము.

## MĀDHAVĀBHYUDAYAMU.

Substance, palm-leaf. Size, 18 × 1½ inches Pages, 144 Lines, 6 or 7 on a page. Mode of writing, fair but containing mistakes Condition, many leaves are left blank and many torn Appearance, old.

Contains the first five Āśvāsas

This Prabandha narrates the chief incidents that are associated with the ten incarnations of God Viṣṇu and the portion contained in this MS breaks off in the story of Śrī-Kṛṣṇa The author is Audūri Kiccaya, son of Tippamāmba and (Cina Guravaya of Hāritagōtra and of Nandavara family The author was a disciple of Rūpāvatāra Cenna Kṛṣṇa Śāstri, son of Nārāyanārya, and had two brothers, one elder named Sūraya and one younger Pina Sūraya The work was composed at the instance of Nālvīti Nāgayāmatya and dedicated to God Vēṅkaṭācalapati of Tirupati. The author's daughter was married to the patron's brother; and the patron's grandfather is said to have

composed Krsnaśataka and Ulūcīparınaya (Yaksagāna). The author's other works are Hamsavimśati and a Telugu rendering of Kālidās's Raghuvamśa.

**Beginning:**

శా. శ్రీరామామణి నీవుదాధనద-స్సీమాత్మవక్షోజకా ?
శ్రీరాంకం బితరార్పితం బనఁగ శామ్మిన్ భర్త కాదంచుఁ బ
ల్కా రాడన్ సరి చూతు విందు కిటు లేలా వాదు లంచు న్వయి
స్యారత్నం బన మందహాస మిడుశ్రీశౌరిం బ్రశంసించెదన్.

సీ. సశిరశ్చతుర్వేదసంహితానిర్ణీత
సర్వస్తుతచతుర్దశమతరసుఁడు
షట్శాస్త్రసూత్రైకసందర్భకృతిజాత
సాధ్వీద్వ్యసప్తమశాస్త్రైకకర్త
యుహాత్మ్యాదిమాత్రకావ్యార్థసాలంకార
కవితాభినిర్మాణకౌశలుండు
కల్పనాచాతుర్యకల్పితబహుకథా
కృతసదేకోనవింశతిపురాణు

ఇందిరాధీశపాదారవిందయుగళ
మందిరానందతరుకంగమానసాబ్జుఁ
డైనరూపావతారనారాయణార్య
చెన్నకృష్ణేంద్రు మద్గురు సన్నుతింతు.

* + *

వ. అని . . . యే నొకకావ్యంబు శబ్దార్థవైభవభవ్యంబుగాఁ జేయం బూనియున్నయవసరంబున.

* * * *

ఉ. నందనచక్రవర్తి తననందవరంబున నుండి కాశి కిం
పొందఁగ యోగవాగమహిమోన్నతి నిచ్చలు నేఁగి గాంగవా
రిం దగునిత్యకృత్య మొనరించి శివుఁ బ్రణుతించి వచ్చున
చ్చంద మెఱింగి యానృపతిజవ్వని తాఁ జనుదేరఁ గోరినన్.

సీ. సతితోడఁ జని కాశి కతఁడు గంగావారిఁ
గృతకృత్యుఁ డై యా త్తఋతుమతి యగు

లలనతో మరలి పోఁ దలఁచి తద్దోషాన
సోమయాగాలు రాకునికి వగచి
అచటివిప్రుల వేఁడ నప్పుడె నూటెండ్లు
పదమూఁడు గోత్రముల్ పరఁగుబ్రాహ్మ
ణోత్తముల్ నిజశక్తి సోమయాగాలు గ్ర
మ్మఱఁ బంపుగాఁ జేయుమహిమ కలరి
రాజు తనయేలునందవరంబు వారి
కగ్రహారంబుగా నిచ్చి యరిగె వార
లటుల నందవరం బగ్రహారముగఁ బ
రిగ్రహించుట నందవరీకు లైరి.

క. ధాత్రిఁ దగునాశ్వలాయన
సూత్రపవిత్రు లగుతద్ద్విజులయందును జా
రిత్రాఢ్యుఁడు శ్రీవత్సస
గోత్రుం డగుపెద్దిభట్లకుంతితయశుఁ డై.

సీ. వసుధ ని ట్లెసఁగు శ్రీవత్ససగోత్రప
విత్రు లౌనూటెండ్లవిప్రులందు
ధీరుఁ డైవెలసెఁ గోడూరిశంకరయోగి
వీరభద్రుఁడు తత్కుమారులందుఁ
జినసుం డెమున వసించెను కీర్తివిజితగం
గాధరుం డైనగంగాధరుండు
పోతరా జనువాఁడు బుధసన్నుతౌదార్య
ధూర్వహుం డై గోపిదానను జేర
వీరభద్రుండు పూజితవీరభద్రుఁ
డగుచు నూర్వీట నిల్చెఁ దదన్వయమున
మల్లధీమణి నాగయామాత్యదేవ
రమ్మసుతు లార్గు రలరి రారసికులందు.

సీ. బోడెల్లయామాత్యచూడావతంసంబు
రామరాజునుబస్వరాజులింగ
రాజును గనియె నగ్రజుఁడు రామనమంత్రి
గాంచిన సత్పుత్రకత్రయమునఁ

బెద్దవాఁ డెల్లప్ప పెద్దరామన్నను
చిన్నరామన్నను బేర్మిఁ గాంచె
నా పెద్దరామన్న యకలమ్మను వరించి
కనిననందనపంచకంబునందుఁ
దనరు బోడన్న రాఘవమ్మను వరించి
మల్లయామాత్యుఁ గాంచి వర్ధిల్లె నతని
యనుజుఁ డగుచిన్నమంత్రి యకలమ్మయందుఁ
దనయు నెల్లయమంత్రి(ని) గని చెలంగె.

క. ఆ పెదరామనసోదరుఁ
డౌ పినరామన దివాకరమ్మనుసతియం
దేపుగఁ గనినసుతత్రయి
భూపతినుతుఁ డెల్లయప్రభుఁడు వహిఁ కెక్కెన్.

గీ. అమితసద్గుణసహితుఁడై నట్టియెల్ల
యప్రభుఁడు (బు)చ్చిమాబింకయందు రామ
యార్య వేంకటరామ నారాయణార్య
నమితసమ్మోదమునఁ గాంచి యవని వెలయు.

శా. ఆరామన్నకు దమ్ముఁడైనబసవప్పామాత్యచంద్రుండు పొ
ల్పారం గాంచినపుత్రకద్వయమునం దగ్రోద్భవుం డంగలీ
లారమ్యుం డగునెల్లమంత్రి గనె మల్లప్పప్రభుం దత్సుతుల్
ధీరుల్ ముువ్వురు వారిలోన విలసిల్లెన్ మల్లనార్యుం డిలన్.

క. తనరు శుభాకృతినిర్జిత
మనసిజుఁ డౌబస్వరాజు మల్లప్రభుమ
ల్లనమంత్రి వెంగమాంబా
వనితను వరియించి పుత్రపౌత్రోదయుఁడై.

ఉ. అంగజరూపుఁ డాబసువయాగ్రణిసోదరుఁడై చెలంగునా
లింగన . . . . . . . . .
. . . . . . . . . . .
. . . . . . వహిఁ కెక్కు దిక్కులన్.

సీ. ఆలింగరాజుపుత్రాగ్రణి యగుతిప్ప
యార్యుండు తిప్పమ్మయందుఁ గనియె

మల్లప్ప చిన్నయ్య మంత్రిహేమాద్రి తి
మప్ప యన్ సుతుల నం దగ్రజుండు
మల్లప్ప కొండమాంబాసాధ్వియందు స
న్మతి సాంద్రు నెల్లయామాత్యచంద్రు
రసిక శేఖరుఁ డైనముసలప్రధానునిఁ
బాపన్న నుమ్మయప్రభువరేణ్యు
బుద్ధినిర్జితఫణిరాజు బుచ్చిరాజు
సల్లలిత మేరుధైర్యుఁ జినెల్లయార్యుఁ
గాంచె శ్రీవిష్ణుపదపద్మకలితభక్తి
నలరునమ్మంత్రివరులలో నగ్రభవుఁడు.

* * * *

గీ. ప్రస్తుతు లొనర్పఁ గొండమాంబాప్రియుండు
పాటితారాతిధాటి నాళ్వటిలింగ
రాజు(మల్ల)ప్ప . . . . .

* * * *

క. ఆమంత్రికి సోదరుఁ డై
. . . . . . . .
. . . ముసలయప్రధానుం డలరున్.

* * * *

గీ. అని జనులు మెచ్చఁ దగుముసలన్న గరిడి
మిట(ట్ట)కులవార్ధిరత్న మై మెలఁగుచిన్న
మాంబ నసమానసుగుణకదంబ నలరఁ
బరిణ(యం) బయి యెల్లయప్రభునిఁ గనియె.

* * * *

క. ఏవంవిధసద్గుణఖని
యై వెలసినయెల్లయార్యుఁ డతులితకీర్తి
శ్రీ విలసిల్లెన్ లక్ష్మాం
బావనిత వరించి పుత్రపౌత్రోదయుఁడై.

గీ. ఆముసలయార్యునకుఁ దమ్ముఁ డై తనర్పు
మంత్రిపాపన్న యోబళమ్మను వరించి

తిప్పయామాత్యశేఖరు నప్పకొండ
యప్రభు సుచర్యుఁడ నుపమాదార్యుఁ డాశ్రి
తావనసుకార్యుఁ డగుపాపయార్యుఁ గనియె.

క. ఆమల్లప్పకు సోదరుఁ
డైమహి వహి కెక్కు చిన్నయాగ్రణి . . .
తీమణి నందమయం దభి
రాముఁడు గనెఁ దాతయార్య రమణయమంత్రిన్.

క. అందగ్రజుండు తాతన
. . . . . . .
. . . . . బుచ్చమాంబికను వరియించెన్.

వ. తత్సహోదరుండు.

గీ. రసిక్షుఁ డారమణయమంత్రి బసినికొండ
దుర్గరాజకులాబ్ధికిఁ దోయజారి
కళ యు(నప) హించు నెల్లాంబికను వరించి
పుత్రపౌత్రాభివృద్ధి విస్ఫూర్తి వెలయు

గీ. అట్టిచిన్నయమంత్రికి ననుజుఁ డగుచుఁ
దనరు హేమాద్రికట్టకేసనతనూజ
వేంకటమ్మను వరియించి వేడ్కఁ గాంచె
నాత్మజత్రితయంబు నం దగ్రజుండు.

గీ. . . . . . . . .
. . . నూర్వీటిలింగ
రాజు హేమాద్రి రామయప్రభుఁడు వెలయు

గీ. అతని తమ్ముఁడు తిప్పరాజార్యమౌళి
వనము ముంగరముసలన్న వరకుమారి
శేషమాంబను . . . . . మించి
యెల్లయను గాంచె మది వేడ్క యుల్లసిల్ల.

శా. ఆహేమాద్రికిఁ (బిన్నత)మ్ముఁ డగుతిమ్మప్పప్రధానుండు
. . . . . . . వెంకటాంబావరా
రోహారత్నమునందుఁ గాంచె సుకుమారున్ దిప్పరాజాగ్రణిన్.

క ఆబోడెల్లన కనుజుం
డై బధుడునియోగి యనఁగ నతులితకీర్తిన్
శ్రీబంధురుఁ డతికృపఁ బ
ద్మాబంధుఁడు పాపయెల్లమంత్రి రహించెన్.

చ అతఁడు సుత త్రయింగనెఁ దద్రజుఁడెల్లన గన్నపుత్రులం
దతులసుకీర్తి తిప్పసచివాగ్రణి గాఁచెఁ బెదెల్లనార్యుఁ స
న్మతిఁ జినయెల్లయప్రభుని మల్లనమంత్రిని నందుఁ బెద్దవాఁ
డతులితలీలఁ గన్నతనయత్రయి నెల్లన గాంచె నెల్లయన్.

గీ. ఆచినెల్లయ యలయెల్లయార్యుఁ గనియె
నతఁడు బుచ్చమ్మయందు నారాయణార్యు
సూరయను గాంచె నామల్లధీరవరుఁడు
తిమ్మమాంబికయం దెల్లధీరుఁగనియె.

శా . . . . . . . . .
నారా నూల్విటి పాప . . కులమల్లామాత్యునెల్లార్యమూ
డారత్నం బి . . . ఒకుఁ బ్రియుండై మించె నంచున్
[మతిన్.

శా. ఆపాపెల్లయపుత్రుఁ డైతనరు నెల్లామాత్యుఁడజ్ఞాస్త్రి జి
ద్రూపశ్రీనిధి (రామయా)హ్వయకుమారున్ గాంచెహర్యమ్మయం
దా పుణ్యాంబుధి . (ప్రభుని . . గోపామాత్యునిన్ గాం
[చెనా)
గోపామాత్యుఁ డనూనదానకలనాకుంఠీకృతాంభోధి యై.

క. చీనేపలిరఘుపతిసుతే
యైనెగడినయకరామాంబయం దనువందన్.
(నూనుల నల్వురఁ గ)నెఁ ద
త్సూనులలో నెల్లయార్యసోముఁడు వెలయున్.

గీ. . . . . . . యెల్ల
యార్యమణి మంగమను సుబ్బమాంబను దిరు
వేంగళమ్మను వరియించి వేడ్కఁ గాంచె.

క. ఆమంత్రి వెనుక సు(బ్బ)య
ధీమణి వహి కెక్కె.

* * * *

గీ. అనుచు భటు లెంచఁ దగుసుబ్బయార్యమౌళి
యలరు ముస్తూరివేంకటాచల(ము)పుత్రి
వెంకటమ్మను వరియించి వేడ్కఁ నెల్ల
యార్యుఁ గేశవయామాత్యవర్యుఁ గనియె.

వ. అం దగ్రజుండు.

సీ. . . . . సుబ్బన్నయెల్లయామాత్యుఁ డలరు.

గీ. . . . . . ఎల్లయప్రభుఁడు ముద్ద
రాజవేంకటరామయాగ్రణి తనూజ
యైనలక్ష్మాంబను వరించి యవని వెలయు.

శా. ఆలీలం దగుసుబ్బరాజు కనుజుం డై వేంకటార్యుండుత
ద్బాలాంబాసతి చెన్నయార్య గిరియప్పల్ గాంచి రాపుత్రులన్
. . . చెన్నయార్యుఁడు వరించెన్ వేడ్కనక్కాంబికన్.

సీ. అపాపయెల్లయ కాత్మజుఁ డగుబోడ
రాజు తిప్పాంబికారమణియందుఁ
గన్నయెల్లయమంత్రి గనియెఁ దిప్పనమంత్రి
నతఁ డగ్రమహిషి పేరమ్మయందు
బెదయెల్లయామాత్యుఁ బినయెల్లయార్యునిఁ
గాంచె నందుఁ బెదెల్లఘనుఁడు రంగ
మాంబికయందుఁ బేరన్నను బుచ్చన్న
ననఘు సుబ్బయ నెల్లయార్యుఁ గనియె
నందుఁ బేరన్న వరియించె నక్కమాంబ
నట్టితిప్పమ్మ మఱియు లచ్చమ్మయందుఁ
గన్నతనయత్రయంబున వన్నెకెక్కె
నలఘుఘృణిహేళి యగునెల్లయార్యమౌళి.

చ. సముచితభావణాహిపతి సన్మతిగీష్పతి తిప్పరాజు ల
చ్చమసుతుఁ డెల్లయప్రభుఁడు సాధుజనుల్ తను సన్నుతింప నిం
పుమిగులుసొంపునన్ వనమముంగరచిన్నయమంత్రిపుత్రిఁ జె
న్నమను వరించి కాంచె సచివాగ్రణి నెల్లయమంత్రిధీమణిన్.

క ఆపాపెల్లయసోదరుఁ
డేపున జటియెల్లయార్యుఁ డిల నహికీర్తిన్.

* * * *

సీ. ఆచిటెల్లయకు నాగాంబ కుద్భవమైన
యాత్మజత్రయమునం దమ్మిరాజు
గనియె నెల్లప్పనుఘను సుతత్రయి మంత్రి
వర్యుఁ డెల్లయ రాఘవమ్మయందు
. . . . . . . .
. . . . నెల్లసచివమణిని
వినయనయోన్నతి వేంకటపతిఁ గాంచెఁ
దదమాత్యులకుఁ బినతమ్ముఁ డగుచుఁ
బ్రబలుపాపన్నకు దివాకరమ్మ కుదయ
మైరి బుచ్చనమంత్రి నుల్లప్ప పెద్ద
బోడయామాత్యమణి పిన్నబోడయార్యుఁ
డలఘుగుణయుక్తులైనయీయనఘులందు.

గీ. . . . . . . . . .
అమ్మిరాజాన్వయాబ్ధిసుధాంశుఁ డెల్ల
యప్రభునియొ ఘను వేంకటార్యమాళి.

క. ఆవెంకటపతి కిచ్చాం
బావనరుహాముఖిని వేడ్కఁ బరిణయమై ధా
త్రీవరసభ మెచ్చఁగఁ దగఁ
బావనమతిఁ బుత్రపౌత్రభాగ్యోదయుఁడై.

గీ. మహిని నాయమ్మిరాజుకు సహజుఁ డగుచు
వెలయు నాగార్యుఁ డౌడూరికులపయోధి
చంద్రుఁ డగుచిన్నయప్రధానేంద్రపుత్రి
క లగులక్ష్మమ్మ జానకమ్మల వరించె.

క. అందగ్రమహిషి కతనికి
నందనుఁ డగు నెల్లమంత్రి.

గీ. అగ్రసతి యైనలక్ష్మాంబయం దతండు
పెద్దయను నాగయను గాంచెఁ బెద్దిరా జ
నంతమను బెండ్లియై యెల్లయార్యుఁ డిమ్మ
ఘనుని ముసలప్రధాను నందనులఁ గనియె.

క. అసచివులలో నెల్లన
భాసురమతి రామమాంబఁ బరిణయ మయ్యెన్
భాసిలు తిమ్మన లచ్చ
మ్మా సతిని వరించి సుబ్బమంత్రిం గనియెన్.

క. ఆముసలన తిమ్మాంబా
భామిని వేడుక వరించి బహువైభవసు
త్రాముఁడు శుభధాముఁడు
గుణధాముఁ డగుచినెల్లమప్రధానునిఁ గనియెన్.

క. ఆముసలప్రభుచినయె
ల్లామాత్యుఁడు . . . . . శ్రీ
నూవ(మ)రును రామయార్య
గ్రామణిసుత లక్ష్మమాంబికను వరియించెన్.

క. ఆయెల్లనరెండవసతి
యై యలరినగురువమాంబయందు వధూటీ
రాయజుఁ డగుమల్లప్పన్
ధీయుతు నాగప్రధానతిలకుం గనియెన్.

క. అం దగ్రజుండు మల్లన
యిందుముఖీరత్న మనినుతించఁగ జను లు
ర్విం దగుబాలాంబాసతి
యందుఁ గనియెఁ బాపయార్య నసదృశచర్యున్.

క. సల్లలితకీర్తి నూల్వ్యటి
మల్లనవిభుపాపయార్యమణి శుభలీలన్
నెల్లూరివెంగయప్రభు
తల్లజుసుతఁ దిమ్మమాంబఁ దగ వరియించెన్.

వ. తత్క్రమంబున.

సీ. సరసుఁ డానాగరాజు నిజద్వితీయ
భార్య యగుజానకమ్మయం దార్యనుతుల
నతులసత్కీర్తివైభవాన్వితులఁ గలిగెఁ
దిప్పరాజును హరియప్ప ధీరమణిని.

క. ఆతిప్పయమంత్రికిఁ దను
జాతుం డగురామమంత్రిచంద్రుండు తనూ
జాతునిఁ గనియెన్ గుణవి
ఖ్యాతుని వేంకటపతీంద్రుఁ గరుణాసాంద్రున్.

క. వరమతి తిప్పయతమ్ముఁడు
సరసకవుల్ మెచ్చఁ గృష్ణశతక ములాదీ
పరిణయము యక్షగాన
స్ఫురణన్ హరియప్ప సరసముగ రచియించెన్.

గీ. అనఘగుణశాలి యాహరియప్పమంత్రి
వనముముంగరయెల్లప్పవరతనూజ
యైనసేనమ్మయందు నాగార్య సూర
మంత్రి నుతసత్యుఁ బాపయామాత్యుఁ గనియె.

క. అందగ్రజుండు విభవపు
రందరుఁ డగునాగరాజు రతినిభ లగుగో
విందమ యక్కమ యనుసతు
లందముగ వరించి శేషయార్యునిఁ గనియెన్.

క. . . . . నాగయార్యుని
శేషుం డని . . వినుతి సేయఁగఁ దగదే.

వ. ఆనాగయామాత్య సహోదరుఁడు.

క. సదయుఁ డగుసూరయార్యుఁడు
. . . లచ్చమను వరియించెన్.

ఉ. ఆసచివేంద్రుసోదరుఁ . . . . .
. . . . . . మించెను పాపరాజిలన్.

సీ. . . . . . వారియప్పపాపరాజు.

సీ. రావలూరప్పకొండ్రాజుకూరిమిపత్ని
యగునెల్లమాంబికయందు శేష
యార్యుని బాలమ్మయనుపుత్త్రిఁ దిమ్మయ
ప్రభుమౌళిఁ బెద్దనారాయణార్యు
నయశాలి యగుచిన్ననారాయణామాత్యుఁ
గనియెఁ దత్సుతులలో . . .
. . . తిమ్మయప్రభుఁడు వెలయు.

గీ. అట్టి . . . . పావ
యార్యమణి వరించె నటులవెలయు
రావులూరితిమ్మరాజు కగ్రజ యైన
బాలమాంబ యనఁగఁ బరఁగుసతిని.

* * * *

సీ. . . . . . . . .
ఆపాపయామాత్యుఁ డాబాలమాంబికా
సాధ్వీశిరోమణియందు సరసహృదయుఁ
డైగణింపఁగ మించునాగరాజామాత్య
విశ్రుతాచలధైర్యు వేంకటార్యు
సారయశస్సాంద్రు నారాయణప్రధా
నేంద్రు సాద్గుణ్యనిస్తంద్రు లగుచు
వినుతిఁ గాంచి రహించిన వేంకటమ్మ
దేవరమ్మనఁ దనరుపుత్త్రికలఁ గనియె
మఱియుఁ దగునయ్యవారనుమంత్రివరుని
బేరమాంబిక యనుసత్కుమారిఁ గాంచె.

క. అందు . . . .

క. మెచ్చఁ దగు సుగుణముల ధీ
మచ్చతురుఁడు వేంకటార్యమణి యాఁడూరి
కిచ్చయసత్కవిసుత యగు
నచ్చమ్మనుసతి వరించి యవనిన్ వెలయున్,

క. ఆయనసోదరుఁ డగునా
రాయణమంత్రీంద్రుఁడు.

* * * *

క. . . . . . . . .
. . . . రావులూరి శేషా
గ్రణిసుత యగు పేరమాంబికను వరియించెన్.

సీ. ఆమంత్రిమౌళికి ననుజాత యగు వేంక
టమ్మను వరియించి సమ్మదమునఁ
బుత్రపౌత్రావాప్తిఁ బొల్పొందె నూర్వీటి
నాగార్యవారియప్ప నందనయగు
గిరియమ్మకుఁ బవిత్రహరితసగోత్ర నె
ల్లూరి వెంగనసత్కుమారుఁ డైన
యకలంకయప్రభుమణి కాత్మజుఁ డగుగుర్వ
యామాత్యు నెంచ బ్రమ్మకుఁ దరంబె.

* * * *

గీ అతనిసోదరుఁ డగు వెంగయార్యమౌళి
సల్లలితకీర్తి చిల్మకూ రెల్లమరును(సు)
మంత్రి సుత యైనజానకమ్మను వరించి
పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బుడమి వెలయు.

గీ. అట్టి వెంకటమ్మకుఁ జెల్లె లైనదేవ
రమ్మయనుసాధ్వి యయ్యలురాజు గణప
విభుతనూభవుఁ డై మించువేంకటాచ
లప్రధానున కర్ధాంగలక్ష్మి యయ్యె.

క. ఆనారీమణి తమ్ముఁడు
ధీనిధి యగునయ్యవారు.

* * * *

గీ. శౌరిజాకారుఁ నాయయ్యవారు మంత్రి
చంద్రుఁ డం . . . . .
పెద్దసుబ్బయమంత్రికిఁ బ్రియతనూజ
యైన శేషమ్మను వరించి యవని వెలయు.

క. అరసికాగ్రణిసో దరి
యై రహి వహి కెక్కు పేరమాంబాసాధ్విఁ
గోరంట్లతిరుపతికి సుకు
మారుం డగుముసలయార్యమణి వరియించెఁ.

గీ. అనుచు సుజనులు వినుతింప నవనిఁ దనరు
నట్టిసహజన్మలు మఱందు లలర మెలఁగ
సేతుశీతాచలాంతరక్ష్మాతలమున
బావయార్యునినాగయ ప్రభుఁడు వెలయు.

* * * *

గీ. భోగవిజితబిడౌజుఁ డానాగరాజు
పంకజాతస్థితివహించుపద్మఁ దెగడి
యుచితగుణశీల యగురావులూరిబుచ్చి
రాజుసుత చెంచమాంబను రహి వరించె.

వ. . . . కోడూరిశంకరయోగివంశపయఃపారావారహరి
ణాంకుండును . . . నూల్వీటినాగరాజహరియప్రభుపాపయా
మాత్యుపుత్రుండును శ్రీవత్సగోత్రశుభాశ్వలాయనసూత్రపవిత్రుండును
సమస్తసద్గుణసాంద్రుండును నగునాగయామాత్యచంద్రుండు . . .
నిజాస్థానమధ్యంబున . . . సుఖాసీనుం డైయుండి సారసాహిత్యప్ర
సంగసమయంబున.

సీ. శ్రీనందవరవంశసింధుసుధాభాను
భూరివిక్రమపరాభూతభానుఁ
దిప్పమాంబాగర్భదివ్యాబ్ధిసంతాను
నాడూరిచినగుర్వయార్యసూను
సంగీతసాహిత్యచతురత నసమాను
లనుచు బుధు లెచ్చ నవనిలోను
దనరుసూరయమంత్రి పినసూరయామాత్యు
లన్నదమ్ములుగఁ బొల్పగుసుధీనుఁ
జెన్నకృష్ణార్య పాదరాజీవభక్తి
లబ్ధకవితాభినిర్మాణలలితబుద్ధి

వైభవనిధాను శ్రీకిచ్చయాభిధాను
నన్నుఁ బిలిపించి యిట్లని సన్నుతించె.

చ. చతురత హంసవింశతియు సత్కవినాయక కాళిదాసక
ల్పితరఘువంశమున్ మఱియుఁ బెక్కులు సత్కృతు లంధ్రభాష శ్రీ
పతికి సమర్పణంబుగ శుభం బొదవన్ రచియించి సద్యశ
స్ఫురి నుతి గన్నధన్యుఁడవు ధారుణి నాదురికిచ్చయాగ్రణీ.

క. మీ రిపుడు చేయఁబూనిన
సారతరసుధాసమానశబ్దార్థాలం
కారవిలసత్ప్రబంధము
శౌరికి నంకిత మొనర్పు చతురత మెఱయన్.

* * * *

వ. కావున శ్రీమద్రమేశ్వరుం డగుశ్రీవేంకటాచలేశ్వరుని భవ
త్కృతికిఁ బతిగాఁ జేయు మని కర్పూరతాంబూలాభరణాది సత్కారం
బుగా బహూకరించుటయు నేనును నత్యంతసంతోషితాంతఃకరణుండ
నై యద్దేవదేవు నిట్లని కైవారంబు చేసెద.

* * * *

క. ఏతాదృశబహుమ (హిమా) ?
ఖ్యాతగుణాయతికి వేంకటాచలపతికిన్
భూతరుణీతుల్యాత్మజ
మాతృకళాజాలమేలుమంగాపతికిన్.

* * * *

వ. అంకితంబుగా రచియింపంబూనినమాధవాభ్యుదయంబనుమహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

**End:**

వ. అంత నయ్యింతులు సీమంతినీమణి యగురుక్మిణీకాంత క్రమ్మ
ఱఁ గంతుసంతాపసంతప్త యగుటకుఁ జింతించి వసంతశశికాంతమల
యనిశాంతపవనాదిసామంతులతో నిరంతరమదాక్రాంతశుకాదిశకుంతబ
లసంతాడి (?) గొల్వఁ గాంత వెడలఁ బంతగించులతాంతకుంతధరుని
దంతియాన కాంతావియోగచింతాంతరదురంతసంతాపంబుకొంత.(?)

గద్య. ఇది శ్రీమదవుడూరిగురవయామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర చెన్నకృష్ణశాస్త్రిసద్గురువరపాదారవిందవందనసమాసాదితకవిత్వనిర్మాణచాతుర్యధౌరేయ కిచ్చయనామధేయప్రణీతం బైనమాధవాభ్యుదయంబనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

(వి-వి.)—

ఐదాశ్వాసములు గలవు. వ్రాఁత యొక తరబడిగా నున్నను నిర్దుష్టము కాదు. గ్రంథపాతములు మెండు. శైథిల్యమును గలదు.

ఇందు దశావతారకథలు విస్తరించి వర్ణింపఁబడినవి. ఈ గ్రంథము కృష్ణావతారపుఁగథయందె ముగియుచున్నది. ఏతత్కర్త యాడూరి కిచ్చయ. తండ్రి చినగురవయ; తల్లి తిప్పమాంబ; అన్న సూరయ; తమ్ముఁడు పినసూరయ; నందవర వంశీయుఁడు. రూపావతార చెన్నకృష్ణశాస్త్రిశిష్యుఁడు. ఈతఁడు 'హంసవింశతిని', కాళిదాసకృత 'రఘువంశమును' తెలిఁగించెనఁట. ఈ గ్రంథము నీతఁడు నూల్వేటి నాగయామాత్యునిప్రోత్సాహమున వేంకటాచలపతి కంకిత మొసఁగెను. ఈ కవికూఁతు రీనాగయామాత్యునితమ్ముఁ డగువేంకటార్యునిభార్య. ఈ నాగయ, వేంకటార్యులతాత యగుహరియప్పామాత్యుఁడు కృష్ణశతకమును, ఉలూచీపరిణయము (యక్షగానము)ను రచియించెను. ఈ నూల్వేటివారు తొలుతఁ గోడూరివా రనఁబడిరి. ఉదాహృతపద్యముల వలన వీరివంశాదికము లగువిశేషములు తెలియనగు.

## No 644. మాధవాభ్యుదయము.
## MĀDHAVĀBHYUDAYAMU.

Substance, paper Size, $12\frac{3}{8} \times 8\frac{1}{4}$ inches Pages, 34. Lines, 21 on a page Mode of writing, good but containing plenty of errors. Condition good Appearance, old

Breaks off in the first Āśvāsa

Same work as the above

(వి-వి.)—

ప్రథమాశ్వాస మించుకకొఱంతగాఁ గలదు. వ్రాఁత యందముగా నున్నది. తప్పులు కుప్పలు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

పూర్వవర్ణితగ్రంథమువంటిదే.

## No. 645. మిత్రవిందాపరిణయము.

## MITRAVINDĀPARINAYAMU.

Substance, palm-leaf Size, 17¼ × 1¼ inches Pages, 137 Lines, 8 or 9 on a page Mode of writing, bad and containing plenty of mistakes. Condition, injured Appearance, old

Complete in six Āśvāsās

A Prabandha describing the story of the marriage of Śrī-Kṛṣna with Mitravindā, one of his eight chief consorts. The author is Kandurti Vēnkatācalakavi, son of Prasannāmba and Rāmaya of Śāndilyagotra and Āpastambasūtrā The author belongs to the Āruvēla Niyōgi sect of Brahmans, and his grandfather Gōvindaya is stated to have composed Bhāratīparinaya which was dedicated to Vīravēnkaṭapatirāya who gave him many presents The author was the disciple of Rēvūri Kālahastidēśika and received the title of Kathāśukavi from the Pāndya King Vijayarangacokkabhūpāla for his skill in poetical composition The author states that he had written the Rāmāyana, the Bhārata and the Bhagavata in Telugu prose, besides many Nātakās, and Cātu and Citra Padyams The work was dedicated to God Ranganātha of Śrīrangam

**Beginning**:

శా. శ్రీకంఠోజ్జ్వలవామపార్శ్వమున గౌరీకాంత రంజిల్ల నీ
వేళాలంబుఁ దదున్నతస్థితుల న న్నేలింపు మంచుం బద
వ్యాకోచాంబుజ మాశ్రయించుతటిన్ భర్గోత్తమాంగంబునం
దాకల్పంబు నటింపఁజేయువారి నిత్యశ్రీలు మా కీవుతన్.

* * * *

సీ. అష్టభాషామహితాశుప్రబంధని
ర్మితచాతురీధుర్య శతసహస్ర
లేఖినీలేఖ్యకళితకవిత్వాపాం
నాహృతవ్యస్తాక్షరాదిచతురుఁ
జలజిహ్వా ? కాచ(లాచలజిహ్వాకాచల)
జిహ్వాకారచనావిశేషనిపుణు
నోష్ఠ్యనిరోష్ఠ్యవర్ణోదీర్ణకల్పనుఁ
గఠినత్రిపాదసంఘటనకుశలు
నఖిలలక్షణలక్ష్యసిద్ధాంతపాణి
నీయకాణాదకాపిలానేకతంత్ర

కోవిదుని రేపురికులాబ్ధికుముదబంధుఁ
జెలఁగిమదిఁగాళహస్తిదేశికుభజింతు.

*        *        *        *

క. అని యిష్టదేవతావం
దనము న్సకపీంద్రనందనము దుపర్తివినిం
దనమొనరించి యొకప్రబం
ధనిబంధన మాచరింపఁ దలఁచుచు నుండన్.

సీ. . . . . . .

హీరకటకకిరీటకేయూరతార
హారమంజీరచాకచక్యములవాఁడు
కల నొకానొకపురుషుఁ డుత్కలిక దోలఁకఁ
ప్రేమ నాప్రోల వేకువజామువేళ

*        *        *        *

ఉ. నీ వొనరింపబూనినయనిందిత కావ్యమణీసురాంగవా
గ్భావుకపుష్పగుచ్ఛరసవైఖరికిం గడుఁ జిక్కి పొక్కి (కెక్కి) మ
ద్భావమిళింద మట్లగుట భక్తిసమర్పణ మాచరింపు మెం
తే విభవంబు లబ్బునని నిత్యదయాపరిపూర్ణదృష్టితోన్.

తే. అంత మేల్కాంచి యద్భుతాయత్తచిత్త
వృత్తితోఁ గాల్యకరణీయవిధు లొనర్చి
హితపురోహితవిద్వత్కవీంద్రబంధు
మిత్రగురువక్త్రములఁ జూడ్కి మెలఁగఁ జేసి.

చ. కలఁగనురీతు లన్నియు నొకానొకమైనను దప్పనీక నే
నలరుచుఁ జెంగట న్నిలిచినట్టలుగా వివరింప నన్ను వా
రలు కరుణించి యోసుకవిరాజ నెరా జగదద్భుతంబు నీ
తలఁపు ఫలించె నీవె కద ధన్యుఁడ వన్యులు నీకు సాటియే.

క. కలఁ దోఁచుదివ్యపురుషుం
డలరంగనివాసుఁ డతని కర్హము నీకా
వ్యలలామ మియ్యఁ దగు మీ
కులజులు తద్భక్తులౌట గుణరత్ననిధీ.

సీ. వినవయ్య సర్గాదిఁ దనరుపరబ్రహ్మ
మామాయతోఁ గూడి హరిహరాబ్జ
భవుల నిర్మించె నప్పద్మయోనికిఁ గల్గి
రలకశ్యపాదిసంయములు వారి
లోనశాండిల్యుం డనూనప్రభావుఁ డై
వెలసె నతండు నుర్వీతలమున
నతనిగోత్రమున సదాచారసంపన్ను
లంకురించిరి తదీయాన్వవాయ
కలశజలరాశికల్పక కామధేను
కౌస్తుభకళానిధులు కార్యఖడ్గనిపుణు
లందుఁ బ్రఖ్యాతిఁ (జెంది) విద్యలనుబుధు ల
హోబళ యనంగ జగతి నహోబళకృతి.

శా. మెప్పించెం గటకాధిపాశ్వపతిభూమీపండితశ్రేణిఁ దా
నిప్పించెన్ శిబికర్ణఖేచరులయ ట్లిష్టార్థమర్థ్యాళికిన్
గప్పించె న్నిజకీర్తిచంద్రికల దిక్కాండంబు యజ్ఞంబులన్
రప్పించెన్ హవిరంశభుక్తికి హరిబ్రహ్మాదుల న్నిచ్చలున్.

క. ఆవిద్వత్కేసరియం
దావిర్భవమందె భూభృదాయతకటక
త్స్నావాసవిభవధుర్యుఁడు
గోవిందయ విమతవాదికుంజరహరి యై.

సీ. . . . . . . . .

అతఁడు సామాన్యుఁడా షట్సహస్రకులప
రీతకుం(కం)దర్తిధవళాంతరీపదీపుఁ
డాగమాంచలపద్యా(ధ్యా)విహారహారి
విశ్వపరితోపకారి గోవిందశౌరి.

చ. పటుతరగోస్తనీమధురపాకసమంచిత మై రసోర్మిప
ర్యట మనుభారతీపరిణయం బను కావ్య మొసంగి వీరవేం
కటపతిరాయలం దనిపి కాంచె మణీకనకాభిషేక మ
త్కటగతి నమ్మహామతి సుఖస్థితిశోభియశోభిరాముఁ డై.

తే. అతని కుదయించిరి తనూజులు . .

సీ. షడ్దర్శనీమనీషాసమున్మేషవా
చస్పతి మంథాద్రిసమసమగ్ర
ధృతి యైనవేంకటపతి శౌర్యజితవైరి
సన్మర్థుఁ డై పొల్చు తిమ్మయార్యుఁ
డమితగాంధర్వవిద్యానిషద్వ్యాయమా
నుఁడు నారణప్ప సన్నుతకకుప్ప
టలికానిరంతరోజ్జ్వలకీర్తి గోపాల
మంత్రి బాహాటశాస్త్రమహితపాండి
తీనిరాకృతనాసత్యధీవిశేషుఁ
డై చెలఁగురంగయామాత్యుఁ డలయుగంధ
రాదిమంత్రివతంస మేధాభిరాముఁ
డతులగుణధాముఁ డగురాముఁ డనఁగజగతి.

క. వారార్గురలో సురగిరి
ధీరుఁడు రామయ్య . . . . .
. . . . . . . .

మ. అనవద్యాయతకీర్తి పాండ్యవసుధాధ్యక్షుండు దక్షుండు స
జ్జనపర్యాయసురద్రుమం బహితరాజన్యచ్ఛిదాకేళిసం
జనితోల్లాసుఁడు మంత్రిహేళి యని తన్ సర్వోన్నతశ్రీవిలా
సునిఁ గాంచెఁ దదున్నమద్భుజ మనా సొంపొందు నెల్లప్పుడున్.

సీ. అఖిలశ్రుతులు నేర్చె ననుమాత్రమే గాదు
స్థిరశతక్రతువులు చేసె నెవఁడు .
గాయమంత్రీంద్రు డన్ బ్రౌఢి మాత్రంబె కా
దొకనాఁటఁ గోట లేఁ గొడిచె నెవఁడు
దానకర్ణుఁ డను వార్తామాత్రమె కాద
భీష్టార్థ మర్థుల కిచ్చె నెవ్వఁ
డైశ్వర్యవంతుఁడౌ ననుమాత్రమే గాదు
కరిఘటల్ భాగసాలఁ గట్టె నెవ్వఁ

డట్టి చెన్నమరాజశతాధ్వరికుల
కలశవారాశిచంద్రుఁ డాగంద్రకోట
వేంకటపతయ్య తనకూఁతుఁ బెండ్లిసేయ
నతఁడు సేకొనె నలప్రసన్నాంబ నెలమి.

* * * *

క. వాఁరుపురు లక్ష్మీరం
భోరువుగౌర్యబ్జముఖులఁ బోలినగురువాం
ఖారత్నము మూర్తమ్మను
ధీరం డగునిన్నుఁ గని రుదీర్ణప్రౌఢిన్.

క భువి రామఘనునినందనుఁ
. . . కథాశువేంకటాచలసుకవీ !

సీ చదివినా వేమేమి చదువ యోగ్యంబులో
యవియెల్ల నిస్సంశయంబు గాఁగ
వచనకావ్యములుగా రచియించినావు భా
రతభాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహు
నాటకములు సమున్నతిఁ జెలంగఁ
జాటించినావు దిక్కోటటరంబుల బుధ
కోటిమెచ్చ నపారచాటుకృతుల
నర్థగుంభసముజ్జృంభితాశుమధుర
చిత్రవిస్తరకవితాప్రసిద్ధి నీకు
సహజమేకద పాండ్యభూజాని సభక(ఁగ)
ధాశుకవి యనఁ గీర్తిఁ జెన్నలరినావు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్యభూ
ధవుఁడు మహానుభావుఁ డతిధార్మికుఁ డర్యగవజ్రధార యై
నవిజయరంగచొక్కనరనాథుఁడు నీకవితాసమగ్రవై
భవములు మెచ్చి నీకొసఁగె భర్మమణీశిబికాదిసంపదల్.

* * * *

ఆ. అనిన స్వప్నగతుని నస్వప్నదుర్లభు
రంగనాథుఁ డని యెఱుంగఁ బలికె—

రింతకంటె భాగ్య మేమి మత్కృతికన్య
ధన్య యయ్యె ననుచుఁ దలఁచి మదిని.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మిత్రవిం దాపరిణయం బనుమహాప్రబంధరత్నంబునకుం గథాక్రమం బెట్టి దనిన.

**End:**

క. ఈకత వ్రాసినఁ జదివిన
నాకొనిన న్వారి కాయురున్నతవిభవం
బాకల్పకీర్తు లొసఁగున్
శ్రీకృష్ణుం డనియె మునిపరిక్షిత్తునకున్.

* * * *

మత్త. వైరిశిక్షణ దీనరక్షణ భవ్యవీక్షణ బంధురా
హీరచందనహారకుందన వేందు నిందనకృద్యశా
భూరికంద(ధ)రహారిమందరభూధ్రసంద(ధ)రకచ్ఛపా
నీరదాంజనసారఖంజననీలభంజనవిగ్రహా

**Colophon.**

గద్య. ఇది శ్రీమదలమేలుమంగాసనాథ వేంకటనాథదయాసమేధ మానచతుర్విధకవితాధురంధర మంత్రియుగంధరకుం(కం)దుర్తిరామయ మనీషిపుత్ర ఆపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్ర నిరసూయాపర కవివరవిధేయ కథాశు వేంకటాచలకవినామధేయ ప్రణీతం బైన మిత్రవిందాపరిణయం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము ఆరాశ్వాసములు. వ్రాలు బాగుగా లేవు. తప్పుల తడక. శైథిల్యగ్రంథపాతములు విశేషముగాఁ గలవు. ప్రాచీనము.

ఇందు వర్ణితమైనకథాంశము మిత్రవిందాకృష్ణుల వివాహము. గ్రంథకర్త కం(కుం)దుర్తి వేంకటాచలకవి. ఆఱువేలనియోగి. రేవురి కాశీహస్తిదేశికుని శిష్యుఁడు. ప్రసన్నాంబారామవిభులకుమారుఁడు. పాండ్యరాజ్యాధిపతి యైనవిజయరంగచొక్కభూపాలునిఁ దనకవితా వైఖరిమెప్పించి 'కథాశుకవి' యనుఁ బ్రసిద్ధిఁ గాంచి యాతనిచేత ననేకబహుమానములంబడసినాఁడు. ఇతనివిశే షింతకుఁ బూర్వము

భారత భాగవత రామాయణములు వచనకావ్యములుగాఁ జేయఁబడుట యేకాక పెక్కునాటకములు చాటువులు సైతము రచియింప బడినవి. ఈ కవి చిత్రకవితాధురంధరుఁడునట. ఈతని తండ్రి యగురామయ పాండ్యరాజువద్ద మంత్రిగా నుండెనఁట. తాత యగుగోవిందయ 'భారతీపరిణయ' మనునొక కావ్యమును రచించి వీరవేంకటపతిరాయల కంకిత మొసంగి యతనివలనఁ బెక్కు పారితోషికముల నందె నఁట. ఏతత్కృతి రంగనాథాంకితము. ఈ రంగనాథస్వామి కవికి స్వప్నమున దర్శన మిచ్చి యేతద్గ్రంథమున్ దనకుం గృతి యొసంగం గోరె నఁట. తక్కుంగలయవి యుదాహృతపద్యములవలనఁ గనుంగొన నగు.

## No 646. మిత్రవిందాపరిణయము

## MITRAVINDĀPARINAYAMU.

Substance, paper Size, 12 × 7½ inches Pages, 231 Lines, 20 on a page Mode of writing, good but not free from mistakes and omissions Condition, good Appearance, old

Begins on fol 217*a* The other works herein are—Dīkṣābōdhamu 1*a*, Mrtyuñjayavilāsamu 132*a* and Śrīmadana-Kāmēśvarīvilāsa.

Complete in six Āsvāsās

Same work as the above.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత బాగుగా నున్నను, తప్పులు, గ్రంథపాతములు మిక్కిలికలవు. శైథిల్యము లేదు.

పూర్వమువలె.

## No 647. ముకుందవిలాసము.

## MUKUNDAVILĀSAMU.

**Pages, 132. Lines, 22 on a page.**

**Variations in reading are noted between the lines in a few places.**

**Begins on fol. 84*a* of the MS described under No. 357.**

**Complete in three Āśvāsas.**

This is the same work as the one described under R No 46 of the Triennial Catalogue of Telugu MSS, Vol I, Part 3.

The stanza containing the name of the scribe and the date of transcription is given below as found at the end of the MS.

(వి-వి.)—

సంపూర్ణము (మూడాశ్వాసములు). వ్రాఁత యందమైనది. తప్పులు లేవన వీలు లేదు. శైథిల్యగ్రంథపాతములు లేవు పాఠాంతరములు బంతులనడుమ నక్కడక్కడఁ గాన్పించుచున్నవి.

త్రై. క్యా. నె 46 రున వర్ణితమైనగ్రంథమును బోలినదియే.

గ్రంథాంతమున నొక చంపకమాలికావృత్తమునఁ బ్రతివిలేఖకుని పేరును, వి లేఖనము ముగిసినకాలమును నిట్లున్నవి :—

" సుకృతవిశిష్టముష్టిపలిసోమనృపాలమహేంద్రునానతిన్
ప్రకటమనీషధర్మవర రామకవీంద్రుఁడు వ్రాసె రామమూ
ర్తికిని సమర్పణంబుగ నుతించగ సర్వజిదాఖ్యవర్షకా
ర్తికసితపక్షపూర్ణిమకుఁ బ్రీతి ముకుందవిలాసకృతిన్."

## No 648. ముకుందవిలాసము.

## MUKUNDAVILÂSAMU

Substance, paper Size, $9\frac{1}{4} \times 7\frac{7}{8}$ inches Pages, 118 Lines, 22 on a page. Mode of writing, indifferent and containing mistakes Condition, bad Appearance, old

Complete.

Same work as the above

The date of transcription and the name of the scribe are extracted below as given at the end of the MS

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చొక్కమైనది కాదు. తప్పులు కలవు. శైథిల్యము మిక్కిలి కలదు. ప్రతి యత్యంతప్రాచీనము. గ్రంథపాతములు లేవు.

పూర్వవర్ణితగ్రంథమువంటిదే.

గ్రంథాంతమున—

"స్వస్తిశ్రీ జయాభ్యుదయశాలివాహనశకవర్షంబులు అగునేటి ప్రజోత్పత్తినామసంవత్సర శ్రావణ శు ౧౫ భానువారం ప్రొద్దుటూరురామేశ్వరంకరుణాలురావులూరులింగ్గరాజు వ్రాశినదస్తరు" అని యున్నది.

## No 649 మూర్ఖచరిత్రము.

## MŪRKHACARITRAMU

Substance, palm-leaf Size, $12\frac{3}{8} \times 1\frac{1}{8}$ inches Pages, 15 Lines, 5 on a page Mode of writing, indifferent and incorrect Condition, good. Appearance, old

Wants the beginning and the end

The work is intended to hurl abuses and insults on some person inimical to Mājēṭi Sarvesalingam who, it may be noted here, appears as the scribe of many MSS in the Library prepared at the time of Mr. C. P Brown.

**Beginning:**

అనినమూర్ఖచరిత్రంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

క. ధర మూర్ఖచరిత్రము ని
ష్ఠురగతి నై సంతతంబు శోభిల్లును ద
న్నర చేతోమోదం బై
పరిపరివిధములను జనులు పకపక నగఁగా.

వ. అది యెట్లనిన.

క. విద్వచ్ఛ్రేష్ఠుం డై తగు
సద్విజునిం జూచి సకలజనములు కడిమిగా
హృద్వీధి నిగుడుకుతుకం
బుద్వేలంబుగను బలిరి రున్నతమతితోఁగా.

**End:**

క. అప్పిస్తా నని పత్రం
బొప్పుగ వ్రాయించి పుచ్చు కొనరఁగ వెనుఁ దా
నప్పియ్యక గడపుచు మా
య ప్పియ్యమటంచు నడుగు నందఱు వినఁగా.

గీ. పొంగి మాజేటిసర్వేశలింగవర్యు
తోడను విరోధ మిటుసేయఁ గూడనట్టి
కార్యమునఁ బరువు పోవుట గాని యిందు
వచ్చులాభంబు లేదు భావమునఁ దెలియ.

ఆద్యంతములు లేవు. వ్రాఁత బాగున్నది. తప్పులు గలవు. శైథిల్యముగాని గ్రంథపాతములుగాని లేవు.

ఇది మాజేటిసర్వేశలింగము (కుంతడే బ్రౌఁడొారవారికిఁ దాళపత్త్రగ్రంథములఁ బెక్కిటిని వ్రాసియిచ్చెను) అనువానితో విరోధముఁ బెట్టికొనినవాని నెవనినో దూషించుచు రచింపఁబడినది.

## No 650 మైరావణచరిత్రము.

## MAIRĀVANACARITRAMU.

Pages, 84. Lines, 28 on a page Mode of writing, fair but incorrect Condition, good

Begins on fol 162*a* of the MS described under No. 340

Complete in three Āśvāsas but without the prefatory portion

A Prabandha describing how Rāma and Lakṣmana sleeping in the batlte-field in Lankā were carried away by Mairāvana of Pātalalankā and how they were brought back by the valour of Hanumanta. The work was composed by Mādaya or Mādaya, son of Sarvayāmātya It was dedicated to Veñjalla Gōpāmātya, son of Abbamāmba and Abbayāmātya of Kāndava family and Śrīvatsagōtra The patron was a follower of the Rāmānuja sect of Vaiṣnavism In a MS of the Tānjore Palace Library there is an introduction in which further particulars about the author are given

**Beginning:**

వ. అనవరతాభ్యుదయపరంపరాభివృద్ధిగా నాశీర్వదించి యేరచియింపంబూనిన మైరావణచరిత్రం బనువిచిత్రప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

(ప్రథమాశ్వాసాంతపద్యములు)

చ. యవనకళింగవంగమగధాంధ్రపుళిందదశార్ణచోళభూ
ద్రవిణ(ళ)విదేహకుంతలవిదర్భయుగంధరసింధుమేదినీ

ధవవరమంత్రివర్గసతత స్తవనూతనచాటుకావ్యస
త్ప్రవిమలవాగ్విలాస ఘనబంధురగ కాండవవంశవర్ధనా.

క. రామాంబికామనోహర
రామాజననికరనూత్న రతిరాజ లస
ద్గ్రామానుజమతసువ్రత
రామార్జునకీర్తిలసిత రసికవదాన్యా.

* * * *

ద్వితీయాశ్వాసము (మొదలు).

క. శ్రీపతివరసంతతకరు
ణాపూర్ణవిశేషలబ్ధతాగుణమూర్తీ (?)
రూపవతీవికచత్సుమ
చాపా వెంజళ్లయబ్బసచివునిగోపా.

* * * *

ద్వితీయాశ్వాసము (అంతము).

చ . . . . . . .
. . . . . . . కాం
డవకులకంజభాస్కర . . .

క. శ్రీవత్సగోత్రజలనిధి
జైవాతృక విపులసకలశాస్త్రాగమవి
ద్యావాణీప్రియ విశ్రుత
దేవేంద్రసమానభోగ ధీవరచంద్రా.

మాలిని అతులితగుణహారా యబ్బమాంబాకుమారా.
రతిపతిజితరూపా రమ్యసంపద్దిలీపా
ధృతిసుమనతగోత్రా[?] దిక్తటస్తోత్రపాత్రా
వితతసుమతిశేషా విష్ణుభక్త్యంబరీషా.

**End:**

ఉ. ఈకథ నెవ్వరేని లిఖియించిన విన్నఁ బఠించి రేనియున్
బ్రాకటరాజ్యవైభవము బంధుసమృద్ధి(ద్ధ)త పుత్రలాభమున్
భీకరచోరశత్రుజనబృందనివారణ మీప్సితార్థమున్
జేకురు నెల్లసౌఖ్యములు శ్రీహనుమంతుకృపారసంబునన్.

మా. అలఘుతిరచరిత్రా యబ్బయామాత్యపుత్రా
కలుషజనవిదూరా కామినీచిత్తచోరా
విలసితగుణలీలా వేదశాస్త్రాను పాలా
జలజహితసమానా సర్వవిద్యానిధానా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమన్మల్లేశ్వరవరప్రసాదలబ్ధకవితాధురీణ సకలశాస్త్ర ప్రవీణ సుకవిజనమిత్ర సర్వయామాత్యపుత్ర మాడ(ద)నామధేయప్రణీతం బైనమైరావణచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ బ్రబంధపరిపూర్తి విలాసంబగు తృతీయాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. కృత్యవతరణిక తక్క మూఁడాశ్వాసములు. వ్రాఁత యొక్క వైఖరి నున్నను తప్పులు కలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు రావణుప పునఁ బాతాళలంకావాసి యగుమైరావణుఁడు లంకయం దాహవభూమి నలసి నిద్రించుచున్న రామలక్ష్మణులం గొంపోయి చెఱఁబెట్ట వానిం జంపి యాసోదరద్వయమును విడిపించుట మున్నగుహనుమత్పరాక్రమము వర్ణింపఁబడినది. ఈ గ్రంథకర్త యగుమాదన సర్వయామాత్యునిపుత్రుఁడు ఈగ్రంథము వెంజల్లగోపామాత్యునకంకిత మీఁబడినది. ఈతఁ డబ్బమాంబాబ్బయామాత్యులపుత్రుఁడు కాండవవంశీయుఁడు. ఏరాజునొద్దనో మంత్రిగా నుండెను. తంజాపుర పుస్తకభాండాగారమునందుగ్రంథమునఁ గృత్యవతరణిక కలదని తెలియవచ్చుచున్నది విశేషముల నుదాహృతభాగమువలనఁ గనుఁగొనునది.

## No 651. మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU

Substance, paper. Size, $7\frac{3}{8} \times 6\frac{1}{8}$ inches Pages, 304 Lines, 13 on a page Mode of writing, good but containing many mistakes, and written on one side of paper Condition, good Appearance, good Variations in reading are noted between the lines and on the blank page

Complete in six Kāndas, the last being split up into three Āśvāsās.

A Telugu rendering of the Sanskrit Rāmāyana of Vālmīki, by Molla, daughter of Ātukūrī Kēsana Setti, a Vīraśaiva She is said to have composed this work by the grace of god Śrīkanṭha Mallēśvara worshipped at Gōpavara.

The following note in Mr. C. P Brown's hand appears on the first page of the MS " Mem. The యుద్ధకాండ in two MSS is written in two different ways—one, probably, is borrowed from another translation—not that by Bhaskara however ".

**Beginning :**

ఉ. శ్రీమహిమాభిరాముఁడు వసిష్ఠమునీశ్వరపూజితుండు సు
త్రామవధూకళాభరణరక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామలసన్నిభాంగుఁడు మహాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు భక్తలోకముల రమ్యతరంబుగఁ బ్రోచుఁ గావుతన్.

* * * *

సీ. . . . . . . . .
స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁ డినట్టిశ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజు భోజు నుతించిమించి.

క. గురులింగజంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
ధర నాతుకూరికేసయ
వరపుత్రిని మొల్ల నాఁగ వర్ధిలుదానన్.

సీ. . . . . . . .
కావ్యసంపత్తిక్రియలు నిఘంట్లు క్రియలు[?]
క్రమము లేమియు నెఱుఁగ విఖ్యాతిఁ గోవ
వరపుశ్రీకంఠమల్లేశువరముచేత
నెఱిఁ గవిత్వంబు చెప్పంగ నేర్చుదాన.

క. చెప్పు మనె రామభద్రుఁడు
చెప్పించినపలుకుమీఁదఁ జెప్పెద నైనన్
ఎప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర తప్పు లెన్నకుఁ డెందున్.

క. మును సంస్కృతంబు తేటఁగ
దెలిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగుసంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే.

ఆ. తెన్గు సోఁక నోరు తియ్యన యగురీతిఁ
దోఁన యర్థ మెల్లఁ దోఁపకున్న
గూఢశబ్దవితతి కొట్లాట పనియెల్లఁ
మూఁగ చెవుడు నాడుముచ్చ టగును.

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్
బొం దై రుచి యై వీనుల
విం దై మఱి కానిపించు విబుధుల కెల్లన్.

ఉ. రాజితకీర్తి మున్నె రఘురాముచరిత్రము సత్కవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పు టది తెల్పియుఁ గ్రమ్మరఁ జెప్పనే లనన్
భూజనకల్పకం బనుచు భుక్తికి ముక్తికి మూలమంచు నా
రాజును నెవ్వ రైన రఘురాము నుతించినఁ దప్పుగల్గునే.

క. వారాంగన శ్రీరాముని
పేరిడి రాఁజిలుకఁ బెంచి పెంపు వహించెన్
నేరుపుగలచందంబున
నారాముని వినుతిసేయ నర్హముగాదే.

క. నేరిచి పొగడినవారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపన్
గారణ మగుటకు భక్తియె
కారణ మగుఁ గాక చదువు కారణ మగునే.

ఉ. సల్లలితప్రతాపగుణసాగరుఁ డై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁ డైనరామనరపాలకు సన్నుతిసేయఁజిహ్వకున్
జిల్లరరాజలోకములఁ జేకొని యాడఁగ నిచ్చ పుట్టునే
యల్లము బెల్లముం దినుచు నప్పటినిప్పటి కాస సేతురే.

వ. అని వితర్కించి ముదంబున నిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రస్తుతియు నొనర్చి నాయొనర్పంబూనిన మొల్లరామాయణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

*    *    *    *

క. ఈరామచరిత మెవ్వరు (?)
వారక విన్నట్టివారు వ్రాసినవారుఁ
గోరి పఠించినవారును
శ్రీరామునికరుణ మేలుఁ జెందెద రెందుఁ.

క. జలజాక్ష భక్తవత్సల
జలజాసనవినుత పాద జలజాత సుధా
జలరాశికన్యకోజ్జ్వల
జలజాకరచారుహంస జానకినాథా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమద్గౌరీశ్వరవరప్రసాదకవిత్వచమత్కారా[(ర)నారీజనోత్తమవిచక్షణనిత్యశైవాచారసంపన్న గురులింగజంగమార్చనవినోద సూరిజనవినుతా] తుకూరికేసనసెట్టి తనయ మొల్లవిరచితంబైనరామాయణకావ్యంబునందు . . పరశురామగర్వాపహరణంబు సేయుటయు యుద్ధకాండ సర్వమును దృతీయాశ్వాసము సంపూర్ణము.

గద్యమునందలి కుండలీకృతభాగము యుద్ధకాండ ద్వితీయాశ్వాసాంతమునఁ జూపట్టుచున్నది.

(వి-వి.)—

సంపూర్ణము. (ఆఱుకాండములు ; యుద్ధకాండము మాత్ర మాశ్వాసత్రయసంబద్ధము). వ్రాఁత తిన్ననిది కాని తప్పులు మెండు. పత్రమున కొకవైపుననే వ్రాయఁబడినది శైథిల్యము లేదు. గ్రంథపాఠము లించించుక గలవేమో, పాఠాంతరములు, బంతులనడుమను ఎదుటి పత్రముల మీఁదను వ్రాయఁబడియున్నవి.

ఇందు రామాయణకథ సంక్షేపముగా వర్ణింపఁబడినది. వాల్మీకి రామాయణము ననుసరించి వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది. దీని నాతుకూరి కేసనసెట్టికూఁతురు మొల్లయనునామె కూర్చినది. ఈవిడ గోప

వరపు శ్రీకంఠమల్లేశ్వరుని వరప్రసాదమునఁ గవిత్వము చెప్పఁ గలిగినది. తండ్రి వీరశైవుఁడు.

యుద్ధకాండమునఁ దృతీయాశ్వాసము మొదటినుండి రమారమి యేఁబదిపద్యములవఱ కుండెడు పాఠభేద మీప్రతికడపట (25 పత్రములు మీఁద) వ్రాయఁబడియున్నది.

యుద్ధకాండ ప్రారంభపత్రమున కెదుర (174 వ పేజీ) నీతీరున నున్నది:—

కరా.—యీ యుద్ధాకాండఆరంభంనుంచిని మరివక ప్రతిప్రకారం మికిలిప్రతి భేదములుగావున్నందున వనచరవీరులు అనేపద్యమువరకుంన్ను —కి స్కెన్నులో వ్రాయడం ఆరంభించడమయినది" అని.

ఈ పాఠభేదవిషయమును గురించి వినయొకకొంత మే॥ బ్రౌనుదొర వారిచే గ్రంథము తొలిపత్రముపై నింగ్లీషున వ్రాయఁబడియున్నది.

## No 652. మొల్లరామాయణము.

## MOLLARÂMÂYANAMU.

Substance, palm leaf. Size, 16½ × 1½ inches Pages, 181 Lines, 5 on a Page. Mode of writing, indifferent and incorrect Condition, injured. Appearance, old

Incomplete; the third Âśvāsa alone in the Yuddhakānda is wanting

Same work as the above

(వి-వి.)—

యుద్ధకాండములోనితృతీయాశ్వాసముతప్ప తక్కినగ్రంథము పూర్తిగాఁ గలదు. వ్రాలు బాగుగా లేవు; తప్పులు కలవు; శైథిల్యము కలదు. గ్రంథపాతములు కానరావు.

పైనిచేరొకనఁబడినగ్రంథమువంటిదే ?

## No 653. మొల్లరామాయణము.

## MOLLARÂMÂYANAMU.

Substance, palm-leaf Size, 15⅜ × 1⅜ inches Pages, 144. Lines, 7 or 8 on a page. Mode of writing, fair but containing mistakes. Condition, injured. Appearance, old.

Complete, but many leaves are missing throughout the MS. and some are broken

Same work as the above.

(వి-వి.)—

సంపూర్ణమే కాని కొన్నితొలిపత్రములు, అచ్చటచ్చట కొన్నిపత్రములు లేవు. కొన్నివిఱిగిపోయినవి. వ్రాఁత యొకమోస్తరుగా నున్నది. తప్పులు లేక పోలేదు. శైథిల్య గ్రంథపాతములు మెండు.

పూర్వము వోలె.

## No 654. మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU.

Substance, palm-leaf Size, 16¾ × 1⅝ inches Pages, 124 Lines, 7 on a page. Mode of writing, fair but not quite free from mistakes Condition, fair Appearance, old.

Complete

Same work as the above

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకవైఖరి నున్నది. నిర్దుష్ట మనుటకు వీలు లేదు. శైథిల్య మించుక కలదు. గ్రంథపాతములు కానరావు.

పూర్వమువోలెఁ గనునది.

---

## No. 655. మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU

Substance, palm-leaf. Size, 14 × 1½ inches Pages, 8 Lines, 5 or 6 on a page. Mode of writing, fair but contains many mistakes. Condition, injured. Appearance, very old.

Contains some verses of the third Āśvāsa in the Yuddhakāṇḍa

Same work as the above

(వి-వి.)—

యుద్ధకాండమందలి మూడవయాశ్వాసములోని కొన్ని పద్యములు. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులు తండోపతండములు. శైథిల్య మధికము. పత్రముల సంఖ్యగలభాగ మన్నింటఁదునిగిపోయినది.

పూర్వమువోలె.

## No 656. మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU

Substance, palm-leaf Size, $10\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 194. Lines, 6 or 7 on a page Mode of writing, fair but containing plenty of mistakes Condition, injured Appearance, old

Contains the Kiskindhā, the Sundara and the Yuddhakāndas complete

Same work as the above

The date of transcription and the name of the scribe given at the end of the M S are extracted below

(వి-వి.)—

కిష్కింధ, సుందర, యుద్ధ కాండములు సంపూర్ణముగా నున్నవి. వ్రాంత యంతగాఁ దిన్ననిది కాదు. తప్పులు కుప్పలుకుప్పలు. శైథిల్యము మెండు. కొన్ని యాకులుచిటిఁగిపోయినవి. గ్రంథపాతమున్నట్లు తోఁపదు.

పూర్వవర్ణితమువంటిదియ

గ్రంథాంతమున.

" కీలకసంవత్సరమార్గశిర బ ౧౨ శనివారంవరకు పరంగిబావయ్యల య్యుద్ధకాండ్డసంపూర్ణంగ్గా వ్రాశెనూ " అనియున్నది.

## No 657 మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU

Substance, palm-leaf Size, $15 \times 1\frac{1}{8}$ inches Pages, 186 Lines, 5 or 6 on a page. Mode of writing, good but incorrect Condition, injured. Appearance, very old

Complete but a leaf in the first and a few pages in the last portion of the MS are missing

Same work as the above

The date of transcription given in the end is extracted below.

(వి-వి.)—

సంపూర్ణమే యైనను, మొదటనొకపత్రమును, కడపటఁ గొన్నిపత్రములును గానఁరావు. వ్రాంత బాగుగానున్నది. నిర్దుష్టముకాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతము కలదు.

పూర్వము వోలె.

గ్రంథాంతమున.

“ అక్షయనామసంవత్సర భాద్రపదశుద్ధ ౭ మీ॥. ” అనియున్నది.

---

## No 658 మొల్లరామాయణము

## MOLLARĀMĀYANAMU

Pages, 97 Lines, 24 on a page. Mode of writing, good but not free from mistakes

Begins on fol 63*a* of the MS described under No 28 **Wants the third Āśvāsa of the Yuddhakānda.**

**Same work as the above**

(వి-వి.)—

యుద్ధకాండమున మూఁడవయాశ్వాసము తప్ప తక్కినదంతయుఁ గలదు. వ్రాఁత బాగాగానున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వముపోలె.

గ్రంథపుముఖపత్రమున.

“ యీ మొల్లరామాయణంలో అయిదు అశ్వాసములపరియంతరం యెత్తివ్రాసం లేదు గాని యుద్ధాకాండనుగురించి రెండువిధాలుగా వున్నది. కొన్ని గ్రంథములు వకతరహాగా కొన్ని గ్రంథములు వేరే తరహాగా వున్నది. మెట్టుకు ఆరెండుతరహాలు భాస్కరరామాయణమును అనుసరించినవి కావు. ” అని యున్నది.

## No 659. మొల్లరామాయణము.

## MOLLARĀMĀYANAMU.

Substance, palm-leaf Size, 15 × 1¼ inches. Pages, 4. Lines, 5 on a page. Mode of writing, fair but incorrect. Condition, injured Apperance, very old

Begins on fol. 1*a* The other work herein is Vijayavilāsa 3*a*.

Contains a few stanzas in the beginning

**Same work as the above.**

(బి-బి.)—

అసమగ్రము. ఆదిఁ గొన్నిపద్యములుమాత్రము. వ్రాలొకతర బడిగా నన్నవి. తప్పులు కలవు. శైథిల్యగ్రంథపాతములు మెండు.

పూర్వమువోలె

---

No. 660 యయాతిచరిత్రము.

YAYĀTICARITRAMU

Substance, paper Size, 13 × 8½ inches Pages, 109 Lines, 22 on a page. Mode of writing, good but containing mistakes Condition, fair Appearance, old

Complete in five Āsvāsas.

A Prabandha in five Āśvāsas dealing with the marriage of Yayāti and Dēvayānī, by Ponnikanti Telaganārya, son of Bhāvanāmātya. This work is written in pure Telugu i e, without the admixture of Sanskrit (Tatsama) words, and the author is the pioneer of the writers of such works Amin Khan, an official of the court of Malk Ibrahim Kutubsha of Golconda approached the author through Maringanṭi Appana and got this poem dedicated to himself The patron is spoken of as a learned and philanthropic gentleman It is stated that his ancestors lived at Satyacintāmani Potlaçerla where he built a mosque. He is also said to have done many other acts of charity and literary patronage Fazul Khan, one of his sons, is said to have negotiated peace between Śrīrangarāya of Vijayanagar and the Golconda Nawab.

**Beginning:**

చ. సిరులమెఱుంగుబోఁడి తనచెక్కు-ల సిబ్బెపుగబ్బిగుబ్బలన్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నల్వఁ దలంచి కేలుఁదా
మరఁ గుడికన్ను మూయుటకు మాటికి నవ్వెడు వెన్నుఁ డింపుతోఁ
దిరముగఁ బ్రోచుఁ గావుత మదిం జేలరేఁగి యమీనుఖానునిన్.

* * * *

సీ. . . . . . . . . . . . . .

మిసిమిబంగారుమేడలమీఁదియెడల
నిడినముత్యాలుఁ జుక్కలుఁ దడఁబడంగఁ
దెలియ కెల్లరు వెఱగంద నలరు నెపుడు
మేలువజ్జీర్లగమికొండ గోలకొండ.

క. ఆపీ డేలున్ సొబగుల
పూవిల్తుడు నచ్చ బాగపున్బలియనవున్(?)
దీవులకుఁ బాదుశాలకు
దేవర యిభరాముశాహు తేజు డగంగన్.

* * * *

సీ. . . . .
వెలయు మలికిభరాముశాఁ గొలిచి మనుచు
కలనఁ దనచెయ్యి మీఁదుగాఁ గడిమి మెఱసి
మేలుసిరు లందునట్టియమీనుఖాన
యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున.

మ. పొలఁతు ల్బుట్టలు రాయవారులు దొరల్ ప్రోడ ల్చెలు ల్మన్నెవా
రలు మావంతులు దీవులేలుబలియుల్ రౌతు ల్మొదల్గాఁ దనున్
గొలువ న్వంతసమంది కబ్బములు పేర్కొ వించుఁ బిల్పించి న
న్నలరంగాఁ దనదండ నుంచుకొని నెయ్యం బొప్ప మన్నింపుచున్.

* * * *

మ. తనకు న్నిచ్చలు (మొక్కువారిని సిరుల్ దైవారఁగాఁ జల్లచూ
పున నెల్లప్పుడుఁ జూచి మన్పఁగలపెన్ప్రోడ న్మరింగంటియ
ప్పనగారి న్మదిలోనిమాట దెలియం బాటింపుచుం గాంచినన్
గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా నన్ను మన్నింపుచున్.

ఆ. పిలిచి పొన్నికంటితెలగన్న నీచేయు
నచ్చతెనుఁగుఁగబ్బ మన్నియెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడఁ గనుము

క. మున్నెవ్వరు నొడువని(?)
తెన్నిది కడుమీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పైనన్.

ఉ. అచ్చతెనుంగుపద్దెమొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చనియాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నొడువ నందలిచందమెఱుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురం బనరొ మేలనరో కొనియాడరో వినన్.

క. తెనుఁగునను మాటువే ల్లిడి
పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులుఁ బెళ్లుగా
మును పేల్పుబాస వెంబడి
నునిచెదఁ గాదనకురయ్య యుల్లములందుగా.

వ. అనిపలికి లాలసరిగజాంకుశుండును రాయపక్షిసాళ్వుండును, సతతాసింహాసనాధీశుండును సింగిణీసూత్రాణుండును, తురగారోహణరేవతుండును సింహతలాటరాయుండును నగుమలికిభరాముపాదుశాహునకు హితవరియై చదువులకుం గుదురై మన్ననల కెన్నికయై చెన్నొందునమీనుఖానసింగంబువంగడంబు నేర్పఱిచెద నది యెట్లనిన.

సీ. మున్నీటిరాణియగా విన్నాఁక యేవేల్పు
నడుగుఁ గెందామర నలరు తేనె
బాసవాల్గము లెన్నఁ బ్రామినుగ లేవేల్పు
చెలువంపు బావాలగిలుకరవలు
కడిఁదిరకగసిమూఁకమెడచాలు పేవేల్పు
చేసన్నసుడివాలుచికిలికఘుకు
కమ్మదెమ్మెఱపుగ్రాఁపదిక్కుదా నేవేల్పు
మంచుమించులపానుపంచుదూది
యతఁడు దానెనకర్తారుఁ డలమి కూరి,
బ్రోవ సత్యచింతామణిపోట్లచెరువు
నందుఁ దెందేవలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ
బుడమి వెలసె హుమాయియాపుడమిఱేఁడు

క. కలిమిని బలిమిని విడిముడిఁ
బలుకులపస నీవిరీవి బంటుతనమునన్
వెలయుహుమామియ్యారం
పిలు సొంపులజాడుబీబిఁ బెండిలి యయ్యెన్.

క. ఆమగునయందు నతఁడు బ
డేమియ్యాఁ గనియె సందడింపుచు సిరు లెం
తో మెఱయఁగ వెన్నుఁడు సిరి
చామవలన మరునిఁ గన్నచందము మీఱన్.

వ. అతండు.

క. కలిమిచెలి వెన్నుఁడుం బలు
కులజవరా (ల్మిన్న) నాలుగుమొగములతఁడుం
బలెఁ దగుసిలారుబీబిం
గొల కొలఁగఁగఁ బెండ్లియయ్యెఁ గూరిమి మీఱన్.

* * * *

ఆ. ఆసిలారుబీబియందు బడేమియా
పుడమితేఁడు సిరులఁ బొందునట్టి
కడఁకతో నమీనుఖాను వేల్పులరేనిఁ
గనియె మదిని గూర్మి గడలుకొనఁగ.

క. అనువుగ మఱియు నతఁడు సర
భనబీబీఁ బెండిలాడె బలువేడుకతోఁ
గనియెం దగ నాయమయుం
దును బాబనుమియ్యా నిబితొవచెలికానిన్.

* * * *

సీ. . . . . . .
యైనతనపేరఁ గల్గునమీనుపురము
నందు మున్నీటి జోక సేయంగఁజాలు
చెఱువు గట్టించె మిగుల నచ్చెరువుగాఁగ
నిండువేడ్క నమీనుఖానుండు మెఱసి.

ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కోసలనాటి సత్య చిం
తామణి పోట్లచర్లను సతంబగుచుండున మీనుఖానుఁ డిం
పామతిలంగ నిల్పెఁ బొడ్పుగా బెడఁగైన మసీదుఁ గాంచి యం
దేమని వెండికొండపయి కేగఁదలంపఁడు బేసికంటియున్.

* * * *

క. గరిత బడేబీబిన్ శ
కర్గ బీబిన్ శమ్మ బీబిఁ గనుపట్టెడురా
మరుఁ డగు నమీనుఖానుఁడు
సిరు లొదవఁగఁ బెండ్లియాడెఁ జెలు వలరంగన్.

వ. వారియందు.

* * * *

సీ. . . . . . . . .

ఔర తన పుట్టినింటికి నత్తవారి
యింటికిని వన్నె దెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడే బీబిఁ దరమె పొగడఁ
దమ్మిపూవింట నెలకొన్న దంట నైన.

క. కలిమిపాలఁదిఁ బోలిన యా
చెలువకును నమీనుఖాన సింగంబునకున్
గలిగిరి కతాతఖానుఁడు
బలియుఁడు ఫాజీలుఖాను పట్టపుదొరయున్.

సీ. నిను బలుగ నెరపులనే చాల మెప్పించి
(యు) కుబరుచే మెచ్చులందు కొనియెఁ
జగ విశ్వనాథదేవునిచేత మస్తుగ
వెలయ నెగ్గులఁ దెచ్చె వేనవేలు
పూనిక నేదులాఖాను పీటికి నేగ
వలుమలు మించుకప్పములు గొనియె
మాదన మలక్‌బరీదుని జాంశాహుఁ
దనయేలికకుఁ బన్ను తరుప నడఁచె
మఱియుఁ గన్నడరాజులు మెఱసి పొగడి
నెనరుదళు కొత్త క్రొత్తకానికలు వనుప
మనియె మలిగ(?)భరాము మన్ననఁ గతాత
ఖానరాయఁడు రెండవ కలువటేఁడు.

సీ. తలిదండ్రు లేమాట తన కానతిచ్చినఁ
దల మోచి నడచుఁ గతాతఖానుఁ
డిభరాముపాదుశా యేలెడి పుడమిలోఁ
దగవులరాజు గతా(త)ఖానుఁ
డల చిన్న ప్రాయంబునందు రాజులచేతఁ
దగు నిమ్మపండు గతాతఖానుఁ
డేప్రొద్దుఁ గూరిమి హెచ్చఁ గర్తారునిఁ
దలఁపులో నిలుపుఁ గతాతఖానుఁ

అరబి పారసి గుజరాతి యారెమచ్చ
తెలుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ
దారి గన్నట్టివాఁడు గతాతఖానుఁ
డహహా యతనికి నెవ్వరీ డరసి చూడ.

* * * *

వ. అతని తమ్ముండు

* * * *

చ. కని తను రాజు వెన్నుకొనఁ గాఁ బెను ఫౌఁజులతో సిరంగరా
యనికడ కేఁగి మాటలనె యాయనఁ దేరిచి తెచ్చి మలకకుఁ
మనుకువ నంటుచేసి యొరిమం గడు మెచ్చులు గొన్నమేటి నే
మని పొగడంగవచ్చు నవు నౌ నిఁక ఫాజిలుఖాను రాయనిఁ.

* * * *

సీ. మది లోఁగి యలని దామనమలక పెట్టిన
ఖల్లకి లోకవంక బాగు మీఱ
నుదిరి యేదులఖానుఁ డొసఁగినపై గోవ
గుఱ్ఱము లృడివాఁగె గొల్చిరాఁ గ
వేడుకతో నేఁడు మాడెల దొరలు కా
నుక లంపినట్టి యేనుఁగులు బెరయఁ
గన్నడరాయుండు మన్నించి యంపిన
ముత్తేలపెట్టెలు హత్తిమెఱయ
వచ్చి తెచ్చిన సొమ్ములు మచ్చి కలర
నిచ్చి ఋభరా ముశౌవాలుచే మెచ్చుఁ గనియె
నట్టి ఫాజీలుఖాన రాయనికి సాటి
గలరె నేర్పరు లెల్ల జగంబులందుఁ.

క. ఖఱపరి శకరర బీబీ
తెఱవందు నమీనుఖాను దేవర గలియెఁ
నెఱజాణ నబ్దులల్లిని
మఱియును శేకిభరామ మరునిం బెరిషఁ.

సీ. . . . . . . . .
ఒసరు నిభరాము పాదుశా హుజురునందుఁ

బొందుగా వ్రాయనేర్చినప్రోఢ యైన
యబ్దులల్లికి నీ డెవ్వ రరసి చూడ
సహాహ గుణముల నతనికి నతఁడె తగును.

క. అరబీ పారసి కన్నడ
మురమీ కన్నోజి తెనుఁగు మొదలగుభాసల్
పరికించి కుతుపుశా తలఁ
పరయుచుఁ బొలుపొందు నబ్దులల్లీ పుడమిన్.

క. అతనికిఁ గూరిమి తమ్ముఁడు
సతముగ శేకీభరాము చదురుఁడు పగఱం
దఱిఁ గూడుఁ గొక లరయని
పతినలు పట్టించి మలలపజ్జల నిలిపెన్.

వ. ఇంక నమీనుఖాను మూడవ దేవేరి యెట్టి దనిన.

*　　　*　　　*　　　*

క. తగునట్టి శమ్మె బీబీ
మగువయు (సు) నమీనుఖాన మగసింగము సొం
పుగఁ గాంచి రబ్దులకరీ
ము గొనంబులప్రోకఁ జాగములతోఁ గ టేనిన్.

సీ. . . . . . . . .
మించి యిభరాముశావాలు మెప్పించి మేలు
తగటు దట్టీలు కబాయీలు పాగరుమిగుల (?)
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుఁ గాంచి
కలిమిఁ బొగడొందెఁ బుడమి నబ్దులకరీము.

వ. మఱియు మెఱయు సిరులకు నెలవై తమపే (పీ?) రుండైన అబు రతి మీఖదుంజి ఖాదిరి యడుగుఁదమ్ములఁ దలంపులో నెలకొల్పు గతా త ఖానుండును ఫాజీలుఖాన యొడయండును నబ్దుల కరీము వీరలకుఁ గూరిమితమ్ముండైన తసీరుని వాజరతి శేఖు బుదురుడిఖాదిరిని మదిం దలంచు శేకిబు (భ)రాముండును దనర్చిరి.

ఉ. ఇట్టి కొమాళ్లు రా సిరుల హెచ్చఁగ మించినప్రోఢ యేలికై
పట్టపుటేండ్ల మ్రొకుఱ గని పాటిలు నాయిభ(?)రాముశాహుచే
పట్టి యనుంగుగా నడపఁ బాయక మూఁడుతరాలనుండి క
న్పట్టు నమీనుఖానడు రపంబున మించె నసంబుకల్మిచేఁ.

క. గమకమున నెదుఱఁ బగఱఁ
గొమరుం బాయముల వేల్పుకొమ్మలఁ గడుచు
ట్టములుగఁ గూర్చెడు నేరుపు
సమకూరిన రాయపక్షిసాల్వంబునకుఁ.

వ. సిరులం గడునమరుకొమరులం గలిగి మనునట్లుగా నాయొన ర్పంబూనిన యబ్బురం బగునిబ్బలు కబ్బంబునకుఁ బ్రాపై యగు త్రోవ యొట్టి దనినః

* * * *

**End:**

క. పెనకొని యందఱు జగములఁ
గొనియాడఁగఁ గోరినట్టి కోరిక లొదవఁ
మనుకుతుహు (బు ?) కూరిమి (కూర్మిపేరిమి)
గని సిరులొందెడు నమీనుఖానా జాణా.

కలువలచెలి సెగ కనుగలిగినయ
బ్బలియు (ని) బలుకుల పడఁతుకఁ చెలిక్రొ
త్తలిరులపలమురి నస మొగి ననఁగా
బలువు (లఁ) దగువిడుపరిపెనపు బలీ.

**Colophon:**

ఇది శ్రీమదన గోపాలమంత్ర ప్రసాదలబ్ధ సారస్వత సుకవిజనహి తవచో విభవ భావనామాత్యతనూభవ సౌజన్య వినయధుర్య పొన్నికంటి తెలగనార్య ప్రణీతంబైన యయాతి చరిత్రం బనునచ్చతెనుంగు కబ్బంబునందు సర్వమును బంచమాశ్వాసము.

(బి.-బి.)—

ఆశ్వాస పంచక పరిమితము. సంపూర్ణము. వ్రా లందముగ నున్నవి. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈ శుద్ధాంధ్ర ప్రబంధమునఁ జంద్రవంశ్యుఁ డగు యయాతి మహారాజు దేవయానం బెండ్లియాడుట మున్నగు విషయములు వర్ణింపఁబడినవి. దీనిని పొన్నికంటి తెలగనార్యుఁడు రచియించెను. ఇతఁడు భావనామాత్యుని పుత్రుఁడు. ఇట్టి కేవలాంధ్ర ప్రబంధరచన కితఁడె ముందంజ యిడినవాఁడు. ఈ కృతిని మహమ్మదీయ మతస్థుఁ డగునమీనుఖానుఁడు మరింగంటి యప్పనగారిచే నీతనికిం జెప్పించి తన కంకితముఁ జేయించికొనెను. ఈయమీనుఖాను గోల్కొండనవా బగు మల్కిభరాముపాదుషా (మల్కి ఇబ్రాహింకుతుబుషా) అనునాతనివద్ద మంత్రిగనో, ఆంతరంగిక కార్యదర్శిగనో యుండెడివాఁడు. ఇతఁడు విద్యావంతుఁడు, దాత, సప్త సంతానకర్త. ఈతనిపెద్దలు సత్యచింతామణి పోట్లచెర్ల అనుచోట నివసించుచుండెడివారు. అటనొక పెద్దమసీదు నీఖానుఁడు కట్టించెనఁట; అమీనుపురమున నొక గొప్ప చెరువును త్రవ్వించె నఁట; పెక్కులు కృతుల నం దెనఁట. ఇతని కుమారులు సైత మాఇ(బ)హింవద్దనే కొలువుండెడివారు పీరందఱు ననేక భాషలు విద్యలు నెఱుంగుదురఁట. వారలలో ఫాజిలఖా ననునాతఁడు విజయనగరాధిపతి యగు శ్రీరంగరాయలను గోలకొండకుఁ దోడుకొనివచ్చి పాదుషాతో మైత్రిం గూర్చెనఁట. ఇంకను గల విశేషము లుదాహృత పద్యములవలనఁ దెలియనగు.

గ్రంథముయొక్క ముఖపత్రమున.

"తె. ఇ. ౧౭౦ (నెం. 11-11-30) అనే మాతృక గ్రంథమునకు యిదే ప్రతిక. ॥ అక్టోబరు 1846."

అని వ్రాయఁబడియున్నది.

---

No 661. యయాతిచరిత్రము.

YAYĀTICARITRAMU.

Substance, palm-leaf Size, 16 × 1⅜ inches Pages, 103 Lines, 8 on a page. Mode of writing, good and seems to be correct Condition, broken at one corner Appearance, old.

Complete except a few verses at the end of the 1st Āśvāsa.

Same work as the above.

(వి-వి.)—

ప్రథమాశ్వాసాంతమునఁ గొన్ని పద్యములు తప్పఁ దక్కినదంతయు సంపూర్ణముగాఁ గలదు వ్రా లందముగా నున్నవి. తప్పులు లేవన వచ్చును. పత్రము లన్నియు నొక యోరఁ గొంచెము తునిఁగి పోయినవి.

పూర్వ వర్ణిత గ్రంథమే.

---

## No 662. యయాతిచరిత్రము.

## YAYĀTICARITRAMU

Substance, paper Size, 11¼ × 7 inches Pages, 188 Lines, 22 on a page Mode of writing, good but contains mistakes Condition, much injured and worm-eaten Appearance, very old

Complete. Written only on one side of the paper and different readings are interlined here and there

This is the original from which the MS described under No. 660 was copied

Same work as the above

The following is a note of Mr C P. Brown appearing on the fly leaf of the MS ,—

" This manuscript has been compared twice with other copies and proves very correct "

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుగనున్నను తప్పులు లేకపోలేదు. పత్రమున నొకవైపుననే వ్రాయఁబడియున్నది. పాఠభేదములు బంతులనడుమ నక్కడక్కడ నెక్కింపఁబడినవి. పుర్వులపాలైనది గ్రంథపాతము కానరాదు.

పూర్వము వోలె.

ఇది యితర మాతృకలతో రెండు మాఱులు సంప్రతింపఁబడినందున శుద్ధమైన ప్రతియఁట. ఈ విషయమునే మి॥ బ్రౌనుదొరవారు ముఖపత్రమున నింగ్లీషున వ్రాసిరి. ఇది నెం 660 దునకు మాతృక.

## No. 663. రఘువంశము.
## RAGHUVAMŚAMU

Substance, paper. Size, $9\frac{3}{8} \times 5\frac{1}{4}$ inches. Pages, 376. Lines, 18 on a page. Mode of writing, good but containing mistakes, written only on one side of the paper. Condition, good. Appearance, not old.

Complete in 10 Āśvāsas.

A Telugu rendering of Kālidāsa's Raghuvamsa in Sanskrit, by Auḍūri Kiccaya who is also the author of Mādhavābhyudaya described under No. 643. Apparently the work under description was his first literary production. It was dedicated to God Visnu at the instance of Kattekōla Narasāmātya, son of Dharmaya and Accama of Hāritagōtra, and minister of Kunduru Vīrarāja, a chieftain of Rāyaprōlu. Mr. Brown's statement as regards the authorship of Haṁsaviṁsati is apparently wrong.

Following is a note of Mr. Brown appearing on the fly-leaf of the MS.—

"The Raghuvamsam from the Sanskrit of Kalidāsa, translated by Kitsayya (Kiccaia) author of the Madhavabhyudaya (ancestor of the author of the Hamsavimsati).

This poem like his other work is written in a tough Sanskrit style without any great merit. It is as stupid as need be.

Read through March 1828.

The Pandit's expression is 'This translation is as remarkably tough and crabbed as the original is easy and clear.'"

**Beginning :**

శా. శ్రీరామామణి నన్ బయోనిధిసుతన్ శ్రీకంఠ శీర్షస్ఫుర
త్తారాధీశ సహోదరిన్ విడిచి నాథా! నీవు వేఱొకరయో
పారత్నంబును జెందినాఁ డవని (న) వక్షః కౌస్తుభోద్యన్నిజా
కారం బారపి యల్లఁ గౌఁగిలిడు శ్రీకాంతుండు నన్ బ్రోవుతన్.

సీ. చెన్న కృష్ణేంద్రు మద్గురు సన్నుతింతు.

వ. అని యిష్టదేవతాది సంప్రార్థనంబుఁ గావించి . . . .
నగు రఘుకులోద్భవుల చరిత్రంబులకుఁ బాత్రం బైన కాళిదాసప్రణీత కావ్యంబు నే నాంధ్రభాషఁ జంబూ ప్రబంధంబుగా నిర్మింపం బూని యున్న సమయంబున.

చ. . . . . . . . . . . .

హరి . . . . . నిండు కొల్వునన్.

వ. . . . . . . శబరీమం గాంచి . . . . . .
నిన్నటి యేకాదశీ దివసంబు . . తన,కమితానందకరం . . .
బయ్యెడుఁ గావున దానికి హరివాసరం బనునామం బిచ్చితి . . .
. . . . . . తదీయ మాహాత్మ్యంబు జగంబులఁ జాటించుమనిన
ముకుళిత పాణి యై తనయంకంబున నెక హరివాసరంబుఁ బ్రవర్తిల్లం
జేయు మని ప్రార్థించు నయ్యంబరీషునెడఁ గృపాపారీణుం డై యా
శ్రీమన్నారాయణుండు జ్యేష్ఠమాసబహుళపక్షాంతర్గతైకాదశీదినంబు
కట్టెకోల యేకాదశి య ? సకలజన సేవ్యం బౌగాక యని యాజ్ఞా
పించె. నంత . . . తాదృశ వాసరంబు శాస్త్రోక్తంబు
గా నాచరింపుచుఁ గట్టెకోలవా రన జగత్ప్రఖ్యాతిఁ గాంచిన యార్వేల
మంత్రిపుంగవులలోన.

చ. . . . . .

హరి తస గోత్ర పావనుఁడు
. . . . . . .
సరసుఁడు కట్టెకోలకుల జాతుఁడు సూరయ మంత్రి భాసిలున్.

క. అతనికి సింగమ యనఁగా
. . . . . . . .
. . . దనరుసతికిన్
సుతుఁ డై తగు గౌరరాజు సుగుణప్రతతిన్.

* * * *

చ. అతని కులాంగనాతిలక మై . . . .
. . . . . . . . . .
. . . . . భాసిలు వేంకమాంబ
. . . . . . . . . . .

గీ. అట్టి గౌరయార్యుఁ డావేంక మాంబిక
యందుఁ గాంచె సూరయాఖ్యసింగ
యాఖ్యసుతుల . . . .
. . . . . . . . .

మ. తన సతీర్త్రి . . . .

. . . . . . . . .

దశరథ సూరయ కట్టైకోలకుల మంరంబునాఁ బొల్పగుఁ

. . . . . . . .

సీ. ఆసూరయామాత్యుననుజుఁ డైతగు సింగ
రా జనంగమ యందు రసికవరులఁ
గమలవ్వ తిమ్మరాజమణి సూరయ ముకుం
దయ తిరుమలయ యఁత తనయులఁ గనె
నందగ్రభవ కమలవ్వకుఁ దతుర్లాం
గన యానసంగాంబకును దనూజుఁ
డగు రామయకుఁ బుత్త్రిఁ డైనట్టి నరసన్న
జానకి యని పొల్చు సాధ్వియందు.
మంత్రి మార్తాండు వేంకనామాత్యుఁ గాంచెఁ
గమల యానుజ తిమ్మ యాగ్రణి సమస్త
జనములు నుతింప నరసమఁ సతిని బరిణ
యం బయి కుమారు సింగరాజాఖ్యుఁ గనియె.

క. ఆ సింగరాజు నరసాం
బాసాధ్వి వరించి కాంచెఁ . . .
. . . . . దేవప్పను .
.

గీ. అట్టి తిమ్మమంత్రి కనుజాతుఁ డగుసూర
మంత్రి ఘళీ చెన్నమాంబయందు
రామమంత్రి సింగరాజునాఁ జెలువొందు
నందనులను గనె నమందయశుల.

ఉ. . . . . . . . . . నగ్రపుత్త్రుఁ డౌ
రామయ మంత్రి లింగ మను రాజముఖిఁ వరియించి కాంచె సు
శ్రీమహిమాఢ్యు లౌసుతులఁ గృష్ణయమంత్రిని జెన్నయ ప్రథా
నామరనాథు వీరసచివాగ్రణిఁ గీర్తి జితేంద్రు.

గీ. అతని తమ్ముఁడు సింగరాజార్యమౌళి
యచ్చమాంబ సాధ్విఁ బరిణయంబై తనూజు
. . . . . . . . .
. . . . . వేంకనామాత్యుఁ గనియె.

సీ. ఆసూరయప్రధానాగ్రణి(సోదరుం)
డగుముకుందయ్య రామక్క యనెడి
సతియందు నరసయ జగ్గయ వరదప్ప
నారాయణాఖ్యనందనులఁ గాంచె
నతనితమ్ముఁడు తిర్మలాభిధానామాత్యు
నాత్మజనిభు శోభనాద్రిఁ గనియె
నీపుత్త్రపౌత్త్రకలాపముల్ సంతతా
మోదంబు ఘటియింపఁ బుడమిలోన.

. . నుతికెక్కె సింగప్ప యతనియగ్ర
జాతుఁ డైనట్టిసూరయసచివమౌళి

గీ. . . . . . . . . .
. . . . . వేంకనామాత్యమౌళి
నలరమాదమ్మ యనుసాధ్వియందుఁ గాంచె.

సీ. ఆవేంకనామాత్యుఁ డాత్మీయకులకాంత
యైనలక్ష్మాంబికయందుఁ గాంచె
రామయప్రభుఁడు ధర్మాజియుఁ జినరామ
యార్యుఁ డనుసుతుల నం దగ్రజుండు

యగుపెద్దరామన్న కర్ధాంగలక్ష్మి యై
రాజిల్లు రాగమారాజముఖికిఁ
దనయుఁ డైరామయామాత్యుఁ డనఘవృత్తి
నవని భాగీరథీసమాఖ్యను వహించి
పరఁగు సాధ్విని బరిణయస్ఫురణఁ జెంది
వార్త కెక్కెను కీర్తివిస్ఫూర్తితోడ.

ఉ. ఆరసి కాగ్రయాయి సుగుణాకర నైన చెలువొందునట్టిభా
గీరథియందుఁ గాంచె . . . . . . .
. . . . . రామయ మంత్రివర్యునిన్

క. ఏవంవిధసద్గుణమణి
యై వెలసినరామమంత్రి కర్ధాంగి రమా
దేవి యగులక్ష్మమాంబిక
భూవలయమునందుఁ బతులు పొగడఁగ వెలసెన్.

గీ. అట్టి పెదరామమంత్రికి ననుజుఁ డైన
సర్వధర్మాజి జానకినాగఁ దనరు
సతికిఁ బతి యైనపినరామ . . మూర్తి
కగ్రజుం డయి భువనవిఖ్యాతిఁ గాంచె.

ఉ. శ్రీకరకల్పకోలకులసింధుసుధాకర వేంకనార్యర
త్నాకరపారిజాత మన ధర్మయమంత్రి రహించె
. . . . మనోహరాకృతిన్
. . . . . . . . . .

గీ. గౌతమసగోత్రపాత్రుఁ డై ఘనత కెక్కు
నారకేశవు లాత్మకులాంబుజాక్షి
యైనజగ్గమ్మ యనుసతియందుఁ గనిన
యచ్చమన్ సాధ్విని వివాహ మయ్యె నతఁడు.

క. తనయుల సకలకళాంచిత
వినయుల శ్రీవేంకనార్యవిభుఁ గృష్ణప్పన్
ఘనుని నరసప్రధానుని
మనసిజనిభు భాయనాఖ్యమంత్రిన్ గాంచెన్.

క. అందగ్రజుండు సచివపు
రందరుఁ డని విబుధు లెంచ రంజిల్లె సుకీ
ర్తిం దనరు వేంకనార్యుఁడు
. . . . . .

గీ. అతనిసతి కోనమాంబ విఖ్యాతిఁ గాంచె

మ. . . . . . . . ఆవెంకనామాత్యుసో
దరుఁ డాకృష్ణయమంత్రి . .

సీ. . . . . . . . . . . .
అతనికులకాంత యన్నపూర్ణాభిధాన
సాధ్వి కైన యైనయచ్చమాంబసతి చెలంగు
నమ్మహామంత్రి కనుజుఁడై యలరు నరస
యార్యు నుతియింప ధీరుల కైన వశమె?

క. ఆసచివమౌళి . . . . . . .
. . . . . కనుజుండై
. . . . నరసమయనుసతి
కీసుండై భాయనార్యుఁ డిలఁ జెలు వొందెన్.

క. ఏవంవిధసచివులలో
. . . . . . .
. . కట్టైకోలనరసన్న మహిన్
. . . . . . .

వ. . . . . . . . ధురీణాయ్యమయ్యపిన్నమయ్యం
గారు శరణ్యాచార్యవర్యాభిధానార్యగురుసపర్యాతాత్పర్యపుత్రత్రయవా
ధూళసగోత్రపవిత్ర కందాళు . . . . . . . .
నగురాయప్రోలునామకపురంబున కధ్యక్షుండును . . . . .
. . . నగుకుందురుపీరయామాత్యయక్షోణీపాలకునియాస్థానంబున
సర్వకార్యనిర్వాహుండును . . . స్వామిస్వధాసదృశరంగమాం
బావేంకమాంబానామకకళత్రద్వితయ . ప్రియుండును నగు
నరసయామాత్య చంద్రుండు . . . . . సంలబ్ధసత్స్వప్నసా
క్షాత్కారానందంబు డెందంబునఁ గందళింప . . . నిజాస్థానదివ్య
మందిరంబున సపరివారంబుగాసుఖాసీనుండై యుండి యప్పుడు.

సీ. శ్రీనందవరవంశ . . . . .
. . . . . . . . . .
. . . . . శ్రీకిచ్చయాభిదాను
నన్నుఁ బిలిపించి యిట్లనివిన్నవించె.

మ. అనఘుశ్రీమతిఁ జెన్నకృష్ణగురుపాదార్చాసమారబ్ధశో
భనానావిధసత్కవిత్వరచన(నా)ప్రావీణ్యపూర్ణీకృత
ప్రణుతప్రాకృతివై తదాత్తమణిహైరణ్యాదిసత్కార మం
దినశ్రీయాదురికిచ్చయాఖ్యసుకవీ ధీరుఁడ వీ వన్నిటన్.

ఉ. కావున నాదుస్వప్నమునఁ గంజదళాక్షుఁ డనంతుఁ డాద్య

. . . . . . . . . . . . .

డైవిలసిల్లుదేవుఁడు దయామతిఁ బల్కె నిజాంకితంబుగా
నీ వొనరింపఁ బూనినవినిర్మలకావ్య మొనర్పఁ జేయుమీ

. . . . . . . .

గీ. ఇహపరసుఖాప్తిహేతుపరమేశ్వరునకు
సత్కవిస్వామి కాళిదాసప్రణీత
మైనరఘువంశ మను కావ్య మంకితముగ
నంధ్రభాషను రచియించు మనఘచరిత.

వ. అని సబహుమానంబుగాఁ బారితోషికం బొసంగిన నేనానంద కందళితహృదయుండ నై.

క. కమలజసంభవగురునకు
కమలాక(రలాలి)తాంఘ్రికమనీయునకున్
కమలార్చితపదపద్మున
కమలాంతకమానిమానసాంతరగతికిన్.

వ. అంకితంబుగా రచియింపఁబూనిన రఘువంశం బనుమహాకా వ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

వ. ఇవ్విధంబున . . . సుకుమారగర్భంబుఁ దాల్చిన నయ్యగ్నివర్ణకులాం (గ) నాతిలకంబు వినూత్ననవరత్నకీలితకాంచనసింహాసన స్థిత యగుచు మహాస్థవిరసచివజనులతోడ నిజరాజ్యంబు విధ్యుక్తంబుగా శాసింపుచు నుండె.

మత్తకోకిల. శౌరి నందకపాణి విధ్వజ శార్ఙ్గి చక్రి దరీ హరీ
ధీర కోసలపుత్రికాత్మజ దేవ దాశరథీ సుధీ
సారసాక్ష సురారిశిక్షక సత్కృపార్ద్రకటాక్ష వీ
క్షారుచీందుగభస్తి వర్ధితకళ్యకోలకులాంబుధీ.

గద్య. ఇది శ్రీమదప్పదూరిగురువయామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర చెన్నకృష్ణశాస్త్రిసద్గురువరపాదారవిందవందనసమాసాదితకవితాభినిర్మాణచాతుర్యధౌరేయ కిచ్చయనామధేయప్రణీతం బైన రఘువంశం బను మహాకావ్యంబునందు దశమాశ్వాసము

(వి-వి)—

సంపూర్ణము. వ్రాఁత బాగుగా నున్నది తప్పులు లేకపోలేదు గ్రంథపాతశైథిల్యములు కానరావు

ఇది కాళిదాసురఘువంశమునకుఁ దెలుఁగు దశాశ్వాసపరిమితము కవియగాడూరికిచ్చయ ఇతనినిగురించినవిశేషములు నెం 643 రు నఁ జూచునది ఇతనికృతులలో నిదియే మొదటిదిగాఁ జూపట్టుచున్నది కట్టె కోలనరసామాత్యుని ప్రోత్సాహమున నితఁడీకృతిని శ్రీమహావిష్ణువున కంకిత మొసంగెను. ఈనరసామాత్యుఁడు రాయప్రోలునకధిపతియగు కుందురు వీరరాజునకు మంత్రియఁట ఇతని తండ్రి ధర్మయమంత్రి. తల్లి యచ్చమ. హారితసగోత్రుఁడు. ఆఱువేలనియోగి. తనస్వప్నంబున నారాయణుండు దర్శనం బొసంగి యీకృతిని దన కిప్పింపఁగోరెనని యితఁడు చెప్పికొనియెను. విశేషము లుదాహృతభాగమువలన నెఱుఁగఁదగును.

## No. 664 రత్నావళీపరిణయము.

## RATNĀVALĪPARIṆAYAMU

Pages, 110 Lines, 19 on a page Mode of writing, fair but containing plenty of mistakes Condition, good Appearance, not old
Complete in 4 Āśvāsas
Begins on folio 49 *a* of the MS described under No 474

This seems to have been restored from the MS. described under No. 665.

A romance describing the incidents leading up to the marriage of Ratnāvali, daughter of a Gandharva chief and Rātnacūda, a prince of the Serpent Kingdom The author is Dhūrjati Venkatarāyakavi, son of Lingarājakavi and grandson of Vēnkatapati Pradhāna of Bhāradvājagōtra He was a descendant of Kavi Dhūrjati of Kṛṣnadēvarāyā's court The work was dedicated to Cēkūri Rāmasvāmimantri who resided at Pāṭalapuram (Tirupapuliyur) on the banks of the Southern Pennar and the Garuḍa (Gaḍilam) in the South Arcot district Besides many

Daṇḍakams and Śatakams which he wrote, he translated the Sanskrit Nāmaliṅgānuśāsana of Amarasiṁha into Telugu verse and dedicated it to God Rāma

**Beginning:**

శా. శ్రీవర్ధిష్ణుకటాక్షవీక్షణసుధాసింధుప్రవాహైకలీ
లావిభ్రాజితభక్తహంసముల వాలాయంబుఁ బాలించు కా
శీవిశ్వేశుఁడు ప్రోచుఁగావుతను శ్రీచేకూరివంశేంద్రు రా
మాంవిఖ్యాతనవీనపంచశరు రామస్వామిమంత్రీశ్వరున్.

మ. పటుగంగాలహరీతర(ంగస)మశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనున్ బాదవినమ్రకృష్ణ వరదా(రా)ధ్గంభీరకోటీరవి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లఁగన్.

మ. ఘనగౌరీశకటాక్షలబ్ధకవితాగాంభీర్యసంతుష్టభూ
జనరాడ్దత్తసువర్ణచేలమణిభూషాగ్రామప(ల్యంకికా)
ఘ?(సు?)నదంతావళఘోటకాదిబహుసత్కారప్రతిష్ఠాత్ము మ
జ్జనకున్ ధూర్జటిలింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

వ. . . . - ఒకకృప్రబంధంబు రచియింపఁ దలంచియు
న్న సమయంబున.

సీ. . . . . . . . . . . .
ధరణి బ్రత్యక్ష రామావతార మనఁగఁ
దలఁప సతతప్రప(స?)న్నచిత్తంబుతోడ
వెలయుచున్నట్టి చేకూరికులపయోజ
మహితహేళి రామస్వామిమంత్రిమౌళి.

వ. వెండియు . . . . మాననీయకవిరాజరాజీకృతానూన
వద్యతరగద్యపద్యమయప్రబంధబంధురసాహితీచమత్కారపరిజ్ఞానసం(తో
షి)త స్వాంతపద్మండును బద్మాకటాక్షలబ్ధహాటకఘోటకమణిమయకలా
పకలాపపట్టాంబరపల్యంకికాచుప్రచాదు (ఛత్రచామ)? రాందోళికాదిశా
శ్వతైశ్వర్యవిధానుండును దానప్రభావసురక్షితసమస్తదేశాంతరాగతవి

ద్వతరవిజనప్రముఖనిఖిలయాచకప్రకటీకృతధైర్యస్థైర్యగాంభీర్య మహా దార్యాద్యమితకల్యాణగుణగణవర్ణనోత్సాహప్రయుక్తమానవిస్మితనానావిధభూనాథవితానుండును సమానానూనగానవిద్యావినోదబంధురుండును మంత్రికులసింధురుండును శ్రీరామచరణకమలసేవాధురంధరుండును భారద్వాజగోత్రుండును శ్రీమదాపస్తంబసూత్రుండును విద్వజ్జనస్తోత్రపాత్రుండును జేకూరికులజలజమిత్రుండును వినిర్మలచరిత్రుండును శ్రీమద్వేంకటనారాయణప్రధానబుచ్చమాంబికాగర్భపయఃపారావారసంపూర్ణచంద్రుండును నగు రామస్వామిమంత్రిదేవేంద్రుం డొకరునాడు.

* * * *

మ. ననుఁ గాశీశకటాక్షలబ్ధవిలసన్మందారమాకందబృం
దనపీనామృతసంస్కృతాంధ్రకవితాధారాసుధాంభోధిసం
జనితామేయకథానిదానఘటనాంచద్వాక్యమాధుర్యగుం
భను నంభోరుహమిత్రకాంతినిధిఁ బిల్వంబంచి పల్కెన్ దయన్.

చ. స్థిరమునఁ గాళహస్తిగిరిజేశవరాగతసంస్కృతాంధ్రనుం
దరకవనంబు వ్యాకరణనాటకకావ్యవిచక్షణత్వమున్
గరిమ వహించి భూవరశిఖామణు లెన్నఁ జెలంగి తౌరకం
ధురతనుకాంతిబాలరవి ధూర్జటివేంకటరాయసత్కవీ.

మ. అమరంబంతయుఁ బద్యకావ్యముగ భవ్యంబైనయయ్యాంధ్రభా
వ మహాపండితసత్కవివ్రజము మెచ్చన్ సాహితీకౌశల
క్రమ మొప్పన్ దృఢభక్తితోడుతను శ్రీరామాంకితంబై తగన్
రమణీయంబుగఁ జేసినాఁడవు భళీ ప్రఖ్యాతి పాటిల్లఁగన్.

చ. ఇదియునుగాక బాల్యమున నే శతకంబులు దండకమ్ములున్
గుదురుగఁ జేసి భూవరులు ఘోటకపాటకభూషణాదులన్
మదికి ముదం బెసంగ బహుమాన మొసంగఁ బ్రసిద్ధిఁ గాంచితో
విదితయశస్సుధాంశుకర వేంకటరాయకవీంద్రశేఖరా.

ఉ. కావున నీవు హర్ష మెసఁగన్ మృదువాక్యనిరూఢితోడ న
త్నావళికన్యకాపరిణయంబు ప్రియంబున మామకాంకితం
బై వెలయన్ ఘటింపు మనికాయ(హైమ)విభూషణవస్త్రముఖ్యసం
భావన సేయఁ గైకొనుచు మాటికి నెమ్మదివేడ్క మీఱఁగాన్.

వ ప్రబంధరచనాధురంధరుండ నై కృతిపతివంశావతారం బభివర్ణిం
చెద

శా. . . . . . . .

భారద్వాజమునీంద్రవర్యుఁడు తపోభ్రాజిష్ణుఁ డై వర్ధిలున్

ఉ ఆమునినాథగోత్రకలశాంబుధి నుద్భవమందె నిత్యల
క్ష్మీమహిమాభిరాముఁ డగు చేకురివెంగనమంత్రిసోముఁ డు

* * * *

శా. ఆవెంగన్నసుధీవరుం డొకఁడు నెయ్యంబొప్పఁ జెంగాంబికన్
రీవిం బెండిలియై కుమారులఁ గనెన్ డెందంబు రంజిల్ల వి
ద్యావైదుష్యనిదాను రాము బుధసుత్రాముస్ గుణోద్దాము ల
క్ష్మీవర్ధిష్ణుని ధీరు భాస్కరసుధీశ్రేష్ఠున్ గరిష్ఠప్రభున్.

వ. అం దగ్రజుండు.

సీ.

ధరణి నమ్మేటి చెలువొందె గరుడసింధు
దక్షిణపినాకినీనదీతట నిరూఢ
పాటలపురాధివాసి యై ప్రజలు పొగడ
మని[న]పె[సి]జనిభుండు రామయామాత్యవిభుఁడు.

మ. అటులన్ రామయమంత్రివల్లభుఁడు నెయ్యం బొప్పఁ గొండాంబికా
స్ఫుటగర్భంబునఁ గాంచె నందనయుగంబున్ భాగ్యధౌరేయు వేం
కటనారాయణమంత్రిశేఖరుని విఖ్యాతప్రభావాఢ్యు వేం
కటకృష్ణాఖ్యు సుధీకళానిధిని సద్గాంభీర్యపాథోనిధిన్.

* * * *

క. ధీరుం డంతట వేంకట
నారాయణమంత్రి కవిజనస్తుతమతి నె
ల్లూరినరసన్నసుత గుణ
పారీణ బుచ్చమాంబఁ బరిణయమయ్యెన్.

* * * *

క. గుణి యగువేంకటనారా
యణమంత్రియు బుచ్చమాంబయందుఁ దనూజున్

గణుతింపఁ బూర్వఫలకా
రణజన్మునిఁ గాంచె సరసు రామస్వామిన్.

చ. అతనిప్రియానుజన్ముఁడు నయంబున వేంకటకృష్ణమంత్రియున్
హితగుణ లక్ష్మమాంబ యనునిందుముఖీమణిఁ బెండ్లియాడి యం
చితమతి రామలింగబుధశేఖరనామకుమారరత్నమున్
జతురత సుబ్బమాంబ యను చక్కనికన్నియఁ గాంచె వేడుకన్.

* * * *

సీ. . . . . .
పరఁగ నమ్మేటి ధారుణిగరుడసింధు
దక్షిణపినాకినీతటస్థానపూర్వ
శరధిసంగమపాటలపురనివాస
మహితకీర్తి రామస్వామిమంత్రిమౌళి.

* * * *

శా. రామస్వామి సమస్తసత్కవినుతా రామప్రభావోన్నతిన్
బ్రాముఖ్యస్థితిఅ[న]ంకరాళ్ళికులపారావారచంద్రుండు వే
శ్రీమత్వాఢ్యుఁడు లింగరాజసచివశ్రేష్ఠుండు గన్నట్టి క
న్యామాణిక్యము సుందరాంబను వివాహంబయ్యెఁ దేజంబునన్.[?]

* * * *

మ. స్మరసౌందర్యవిలాసమూర్తి యగు రామస్వామి యారీతి సుం
దరసుస్త్రీకకళత్రయుక్తి బహుపుత్రశ్రీప్రభుత్వస్థితిన్
హరిదంతస్థిరదంతిదంతయశుఁడై యాచంద్రతారార్క మి
ద్ధరణిన్ వర్ధిలు నిష్టభోగకలనాధౌరేయుఁడై నిచ్చలున్.

క. ఏవంవిధగుణనిధికిన్
ధీవిలసత్సుకవిరాజదృఢసేవధికిన్
భావాప్తదాశరధికిన్
పావనగంభీరతాప్రభావశరధికిన్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచియింపంబూనిన రత్నావళీ
పరిణయం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

ఉ. శ్రీమతోఁ-మలమూర్తి షడ్వదను గౌరీపుత్రునిం గాంచి లో
పాముద్రారమణుండు పల్కెఁ ముదమొప్పన్ స్వామి రత్నేశ్వర
శ్రీమాహాత్మ్యము రత్నకూడభుజగోర్వీనాథరత్నావళీ
భామారత్నవివాహమున్ నుడువు సర్వంబున్ బ్రమోదంబునన్.

* * * *

చ. విని కడుసంతసించి పృథివీధరరాజతనూజతోడ న
మ్మనసిజవైరి యిట్లనియె మానిని మున్ను మదర్థమై భవ
జ్జనకుఁడు శైలభర్త మణిజాలము లిచ్చట రాసి పోసినన్
ఘనతరలింగరూపమును గాంచెను సర్వసుపర్వ లెన్నఁగన్.

**End :**

సీ. అనియిట్టుల నగస్త్యమునికి షడ్వదనుండు
భవ్యరత్నావళీపరిణయంబు
సర్వంబు వినిపించి సంతోషచిత్తుఁడై
పలికె నీదివ్యప్రబంధ మెవరు
చదివిన విన్నను ముదమున వ్రాసిన
బహుపుత్రపౌత్రప్రపౌత్రభోగ
భాగ్యయు గారోగ్యబలసంపదలు గల్గి
క్షితిని నాచంద్రార్కకీర్తిఁ గాంచి
మొనసి ప్రత్యక్షరత్నేశమూర్తి యైన
కాశికావిశ్వనాథునికరుణ జహ్ను
కన్యకాస్నానఫలమును గాంచి జనులు
సిద్ధముగ మోక్షసంసిద్ధిఁ జెందఁగలరు.

* * * *

పం. ధరామరాధనాత్మరాజితాసుధీవశీకరా
కరాకరాసురాపరాజి కక్రుధైర్యసుందరా
ధరాశరాగాశరిభూజతారకీర్తిసుస్థిరా
స్థిరావరామకాళవాహశేముషీధురంధరా. (?)

గద్య. ఇది శ్రీమత్కాళహస్తీశ్వరదాక్షిణ్యానిక్షేపితాక్షయ కటాక్ష
వీక్షాసమాలబ్ధ సంస్కృతాంధ్రోభయభాషాచతుర్విధకవితావధాన వేం
కటపతిప్రధానపౌత్ర శ్రీమదాపస్తంబసూత్ర (భారద్వాజగోత్రపవిత్ర శుభ
రిత్ర) ధూర్జటివంశపయఃపారావారసంపూర్ణపూర్ణిమాచంద్ర లింగరాజ

కవీంద్రతనయ విద్వజ్జనవిధేయ వేంకటరాయనామధేయ ప్రణీతంబైన (రత్నావళీపరిణయం బను) శృంగార ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

నాల్గాశ్వాసముల ప్రౌఢప్రబంధము. వ్రాఁతయొకతీరుగా నున్నది. తప్పులు కుప్పలు. పాతములుఁ జాలఁ గలవు శైథిల్యము లేదు.

నెం 665 రున పేర్కొఁబడిన మాతృక కిది పుత్రిక గావచ్చును.

ఇందు, వారాణసియందలి రత్నేశ్వరలింగమాహాత్మ్యమును, నాగరాజపుత్రుఁడగురత్నచూడునకు గంధర్వపతిసుత యగురత్నావళికి నైనవివాహాదికమును వర్ణింపఁబడినవి కృతికర్త ధూర్జటివేంకటరాయకవి. వేంకటపతిప్రధానునిమనుమఁడు. శ్రీకృష్ణరాయల యాస్థానకవులలో నొకఁడగుకవి ధూర్జటి యీతనికి మూలపురుషుఁడు ఈ కవి యమరమును బద్యకావ్యముగఁ దెలిఁగించుటయే కాక పెక్కుశతకములను దండకములను రచియించెనఁట. ఇక్కవి కాళహస్తినివాసి కానోపు.

ఇది చెరుకూరిరామస్వామిమంత్రి కంకితమీయఁబడినది ఇతఁడు దక్షిణార్కాడులోని దక్షిణపినాకినీ (పెన్నార్) గరుడనదీ (గడిలం) తీరముల యందు వ్యాపించియున్న పాటలపురమున (తిరుప్పాపులియూర్?) వాసముచేయుచుండెడివాఁడు. ఇతనివంశాదికము నుదాహృతభాగమునుండి యెఱుఁగనగును.

## No. 665. రత్నావళీపరిణయము.

## RATNĀVALĪPARINAYAMU

Substance, paper Size, 9¾ × 6½ inches Pages, 184 Lines, 18 on a page Mode of writing, fair but not quite free from errors, and written only on one side of the paper Condition, much injured Appearance, very old

Begins on fol 71a The other works herein are - Sārangadhara-caritra 1a, Ratirahasya (Sanskrit) 163a.

This seems to be the original for the MS. described under the last number.

Complete but imperfect on account of injuries

This is the same work as the above

The note of Mr. C P. Brown appearing on the first page of the volume is as follows ;—

" This volume contains three poems

Sarangadhara Padyacavyamu, Ratnavaliparinayamu (in Telugu),

Ratirahasyamu (in Sanskrit)

All these are transcribed from old manuscripts that were very imperfect and the copies were taken only for the sake of comparing the text.

Of the Sarangadhara I have a separate critical edition

Of the other two books my only copy "

(వి-వి.)—

నాల్గాశ్వాసములు. సంపూర్ణము. వ్రాఁత మంచిది. పత్రమున నొక వైపునమాత్రము గలదు. తప్పులు లే వన వలనుకాకయున్నది. గ్రంథశైథిల్యమువలన నైనపాతములు మెండుగాఁ గలవు. మిక్కిలి ప్రాచీనము. పూర్వోక్తగ్రంథమున కిదిమాతృక కానోపు.

వెనుకటిగ్రంథమే.

## No. 666. రసికజనమనోభిరామము

## RASIKAJANAMANŌBHIRĀMAMU

Substance, paper Size, 12¼ × 7¾ inches Pages, 226 Lines, 26 on a page Mode of writing, good and not quite correct, written only on one side of the paper, different readings being written on the blank Condition, fair Appearance, not old

Complete in six Āśvāsas

This is the same work as the one described under R No 273 of the Triennial Catalogue of MSS, vol 2, part 3

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత సొబగైనది తప్పులు బొత్తిగా లేకపోలేదు. పత్రమున నొకవైపునమాత్రము వ్రాయఁబడియున్నది. పాఠాంతరము లెదుటివైపున నెక్కింపఁబడియున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇది ప్రై- క్యా. రెండవవాల్యూము నెం 273 దున వర్ణింపఁబడి నది.

## No 667 రసికజనమనోభిరామము.

## RASIKAJANAMANÔBHIRĀMAMU.

Substance, paper. Size, 12 × 8¾ inches Pages, 281 Lines, 23 on a page Mode of writing, good but not quite correct, written on one side of the paper and variations in reading are interlined and noted in the margin as well as on the blank side Condition, injured. Appearance, old.

Complete

Same work as the above

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాత బాగుగనేయున్నది కేవలము నిర్దుష్టము కాదు. గ్రంథమునఁ గొంతవఱకు నొకప్రకరినే వ్రాయఁబడియున్నది. పాఠాంతరములు బంతులనడుమ నిరికింపఁబడినవి శుద్ధపాఠము లెదుటి పత్రమున వ్రాయఁబడినవి తక్కినదంతయు రెండువైపుల వ్రాయఁబడి యున్నది. పాఠభేదములు బంతులనడుమనే. నిర్ణీతపాఠము లంచుల వ్రాయఁబడినవి. గ్రంథము కొంతవఱకు జీర్ణముగ నున్నది. గ్రంథపాతములంతగాఁ గాన్పింపవు.

పూర్వగ్రంథమే.

## No 668 రసికజనమనోభిరామము.

## RASIKAJANAMANOBHIRÂMAMU.

Substance, palm-leaf Size, 15⅜ × 1¼ inches, Pages, 231 Lines, 5 or 6 on a page. Mode of writing, fair but containing mistakes Condition, fair Appearance, old

Begins on fol 2-a The other work herein is Subhāṣitaratnāvali.

Complete with the Sanskrit text

Same work as the above

The name of the scribe and the date of transcription written at the end of the MS. are noted below.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాత యొకతరబడిగానున్నది. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములు కాన్పింపవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున

"శేఖుమహంమ్మదుసాహెబుప్రతిక్రమానను (ఈశ్వరనామసంవత్స
ర ఫాల్గుణబహుళ 3 బుధవారంసరిగె ) బండ్లారు వెంకటరెడ్డి సం
పూర్ణముగా వ్రాసెను" అని యున్నది.

## No 669 రసికజనమనోభిరామము.

## RASIKAJANAMANŌBHIRĀMAMU

Substance, palm leaf Size 12½ × 1¼ inches Pages, 143 Lines, 6 or 7 on a page Mode of writing, fair but not quite n correct Condition, good Appearance, old

Contains the first three Āśvāsās

Same work as the above

(వి-వి.)—

తొలి మూఁడాశ్వాసము లున్నవి. వ్రాత యొకవైఖరి నున్నది. అంతగా నిర్దుష్టము కాదు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

## No 670 రసికజనమనోభిరామము.

## RASIKAJANAMANŌBHIRĀMAMU.

Pages, 289 Lines, 20 on a page Mode of writing, good but erroneous Condition, fair Appearance, old

Begins on fol. 1*a* of the MS described under No. 510 Different readings are interlined and the index of the subject matter up to the end of Āsvāsa I is written marginally

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత మంచిదియైనను దప్పులుగలవు. శైథిల్య మించుక కలదు. గ్రంథపాతము లేదు. ప్రతిపత్రమునఁ గాలువాసి యొరక వదలిపెట్టఁబడినది పాఠాంతరములు బంతులనడుమఁ గలవు. విషయసూచి ప్రథమాశ్వాసమునకుమాత్ర మంచుల వ్రాయఁబడి యున్నది.

పూర్వవర్ణితగ్రంథమే

No **671** రాఘవపాండవీయము

RĀGHAVAPĀNDAVĪYAMU

Substance, palm-leaf Size, $16\frac{3}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 124 Lines 6 on a page Mode of writing, fair but not free from mistakes Condition, fair Appearance, old

Complete in 4 Āśvāsās

A Prabandha in which the stanzas and prose passages are so composed as to give two meanings, one of them referring to the story of Rāma and the other to the story of the Pandavas The author is Pingali Sūrana, son of Abbama and Amaranna of Gautamagōtra The author's grandfather is said to have been a poet The work was dedicated to God Virūpākṣēśvara of Ākuvīdu at the instance of Misāla Peda Vēnkatādri, a chieftain of that place who, along with his ancestors was, it is stated, respected by Vijayanagar kings The author had two brothers He is spoken of as the first of all those who wrote poems with double meanings; for the work of Bhīmana, the reputed pioneer in this branch of literature, was not extant even in the author's time. Name of the scribe and the date of transcription of the MS are given in the Telugu extracts

**Beginning:**

శా. శ్రీతోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ జెన్నొందు పుష్పంబు శో
భాతారుణ్య మెలర్పఁగా మూడుచుపంపాహేమకూటాశ్రయ
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁ గావుత విరూపాక్షాహ్వయం బాకువీ
టీతిమ్మప్రభువేంకటాద్రిహృదయాటీకంబు లోకంబులన్.

* * * *

ఉ. ఏమెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిర
మ్మై యనవద్యతం బరఁగ నంధ్రవచస్థ్సితి భారతంబు రా
మాయణమున్ రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిని దిక్కసుధీమణి నెఱ్ఱనతిక్కనన్.

* * * *

వ. అని . . . యెద్దియేనియు నొక్క భవ్యకావ్యంబు నవ్య
ప్రకారంబున రచియించుటకు నుదంచిత కుతూహలుండ నై యుండు
సమయంబున.

సీ. ఏమహామహులతాత యిమ్మభూపకుఁడు స
త్కీర్తి గంగాజన్మకృతిమహాద్రి
యెవిభుతండ్రి నానావిధపౌరుష
స్థిరవృత్తి మీసాలతిమ్మశౌరి
యేన్నృపోత్తముతల్లి మానితపరమసా
ధ్వీగుణంబులప్రోక తిరుమలమ్మ
యేధీరుననుజన్ము లిద్ధదానక్షాత్ర
భద్రుండు చినవేంకటాద్రినృపుఁడు
ఘనులు వేంకటరాయ వేంకటవరదులు
ననఁ బ్రసిద్ధులు మఱి రట్టియాకువీటి
పురవరాంకుండు త్రిభువనపుణ్యమూర్తి
యతులతేజుండు పెదవేంకటాద్రివిభుఁడు

క. వడిగలతనాన నీగిని
విడిముడిపసఁ బ్రాభవమున విజయనగరిలోఁ
గడు నెన్న నేర్పుఁగలమే
ల్నడకల నెఱమేటి దొర యనన్ వర్తిలుచున్.

వ. నిజాస్థానంబున సంగీతసాహిత్యాది వివిధవిద్యాప్రసంగంబులఁ
బ్రవర్తిల్లు(చు).

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు
సుచరిత్రుఁ బింగళిసూరసుకవి
పౌత్రు నన్నపరతిభావనదౌహిత్రు
నమరధీనిధికి నబ్బమకుఁ బుత్రు

ననుజన్ము లైనట్టియమలన యెఱ్ఱనా
ర్యులు భక్తి సేయంగ నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని
సూరననామవిశ్రుతుని నన్నుఁ
బ్రియము సంధిలఁగఁ బిలిపించి బహువస్త్ర
భూషణాదిదానములఁ గరము
సంతసం బొనర్చి యెంతయు గారవ
మెసఁగ మధురఫణితి నిట్టులనియె

* * * *

ఉ. భీమన దొల్లి చెప్పె ననుపెద్దలమాటయె కాని యందునాం
డేమియు నెయ్యెడ న్నిలుచుటెంచ మనంగ నటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకు గల్గుటన్
నామదిఁ దద్ద్వయార్థకృతి నెప్పుడుఁ గల దంచు నేఁ జెడన్.

* * * *

ఉ. దక్షత యింతకల్మి విశదంబుగఁ గాంచియు నీమదన్ ఫలా
పేక్ష ఘనంబు గామి నిది యిట్లన గోరెద నీకు నోలలా
క్షేక్షణభక్తిశీల రచియించుట న్యాయము గాదె శ్రీవిరూ
పాక్షుని కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్

వ. అని సవినయభయభక్తిపూర్వకంబు లగుమధురభాషణంబుల నిజాభిలాషంబు తెలియం గాంక్షించిన నేనుం బదీయంబు లగునతిమాత్ర గౌరవసంభావనావిశేషంబులచేతం బ్రీతచేతస్కుండనై యునికిం జేసి శక్యాశక్యవిచారంబు లేక యంగీకారభంగీతరంగితం బగునంతరంగంబుతో నతని నభివీక్షించి.

* * * *

సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొక్కచోటన యొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న
ర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేష ఘటన యొక్కొకతఱి
నర్థాన్వయము వేఱయగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు

మూఁడుఁగూడుట మఱియు సముజ్జ్వలముగ
నాకుఁ దోఁచినగతిఁ బెక్కుజోకు లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచుసుమతుల కేర్పడ నాచరింతు.

* * * *

తే. ప్రభువు సత్కారమున మిందుఁ బాయు ననియు
శ్రీవిరూపాక్షసేవావిశేష మనియు
సుజను లిందు గుణాంశంబ చూతు రనియుఁ
జలిపితి నసాధ్యకృతి కిట్లు సాహసంబు

వ. అని యిట్లు కృతోత్సాహుండ నగుచు . . . .

* * * *

క. దీపితరాగశివాత
స్వీపూర్ణక్షేత్రుకు వాకువీటిపురాంక
శ్రీపెదవేంకటనృపతీ
రూపాంబకలత్రునకు విరూపాక్షునకున్.

వ. సద్భక్తిసమన్వితంబుగా నాయొనర్పఁబూనిన రాఘవపాండవీయంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన

ఆ. వెలయు నఖిలభువనములలో నవారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నాఁ
రాజవినుతిఁ గనినరాజధాని

**End:**

సీ. శ్రీధాన్యకటక మై చెలువొందె రాష్ట్రంబు
నెలమూఁడువానలు నింగి కురిసెఁ
బాఁడిని బంటలఁ బ్రజలు విజృంభించి
రరిపదవ్యుత్పత్తి యస్తమించె
రోగాపమృత్యువార్తాగంధ మెడలెను
జారచోరాదుల పేరు లుడిగె
వర్ణాశ్రమాచారవర్తన లడరెను నొప్పె
ధర్మంబు నాల్గుపాదముల నడచె

రామభద్రుండు సన్మార్గరతుఁడైక
పరుఁడు దిగవతంసితకీర్తి పాండుసూనుఁ
డుర్వి మెఁ జతురాత్మానుజోపచరిత
చరణుఁ డగుచు సామ్రాజ్యంబు సలుపునపుడు.

* * * *

కలహంస. హిమనగేంద్రతనయేక్షణలక్ష్మీ
స్తిమితపుణ్యఫలదేహవిలాసా
విమలభక్తిపెదవేంకటధాత్రీ
రమణమానససరోంతరవాసా

**Colophon:**

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతంబైన రాఘవపాండవీయంబునందు మహాకావ్యంబునందుఁ బ్రబంధపరిపూర్తి యగుచతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. నాల్గాశ్వాసములు. వ్రాఁత మంచిదే యైనను తప్పులు లేకపోలేదు. శైథిల్యగ్రంథపాతము లంతగాఁ గానరావు.

ఈ రాఘవపాండవీయమును గౌతమగోత్రుఁడగు పింగళిసూరన్న రచియించెను. ఇందు రామాయణభారతకథలు శ్లేషించి చెప్పఁబడినవి. ఈతని తలిదండ్రు లబ్బమ యమరనలు. తాతయును కవియఁట. ఇట్టి యపూర్వద్వ్యర్థికావ్యకరణమునకు సమకట్టినవారిలోనీ సూరనయే యగ్రగణ్యుఁడు. ఇంతకుఁబూర్వము భీమన యీను ప్రసిద్ధ కథాంశములనే శ్లేషించి చెప్పెనఁట. ఆమాట యీకవినాఁటివారికే నానుడికత యైనది. ఈగ్రంథ మాకువీటియందు నెలకొన్న విరూపాక్షేశ్వరున కంకిత మీఁబడినది. ఆకువీటిసంస్థానాధిపతియగు మీసాల పెద వేంకటాద్రి ప్రేరణచే నిట్లుఁ జేయబడినది. ఆకువీటిసంస్థానాధిపతియగు నితఁడును, నితనిపూర్వులును విజయనగరమునఁ బేరువడసి తదధిపతులచే గౌరవింపఁబడుచుండెడి వారు. తక్కిన యంశము లుదాహృతభాగమువలన నెఱుఁగు నది.

గ్రంథముయొక్క ద్వితీయాశ్వాసాంతమున :—

"పింగళీ వెంకన్న కొమారుడు శీతారాముడు రెండో ఆశ్వాసము కొదవవ్రాశిన ప్రతినున్న క్రమానను పోతాప్రగడలక్ష్మిపతి వ్రాశెను."

తృతీయాశ్వాసాంతమున :—

"తారణనామ సం॥ భాద్రపద బ ౬ మంగ్గళవారం వరకు పింగళి వెంకటాద్రికొమారుడు శీతారాముడు వ్రాశినప్రతినున్న క్రమానను పోతా ప్రగ్గడబల్లయ్యకొమారుడు"

తుదను :—

"తారణనామ సం॥ ఆశ్వీజ శు ౭ శు సాయంత్రంవరకు పోతాప్రగడ లక్ష్మీపతి వ్రాశెను."

## No 672. రాఘవపాండవీయము.

## RĀGHAVAPĀNDAVĪYAMU

Substance, palm leaf Size, 16⅜ × 1¼ inches Pages, 142 Lines, 5 on a page Mode of writing, fair but incorrect Condition, much injured Appearance, very old

Many leaves are torn, many missing and all the existing leaves are in disorder It is apparently incomplete

Same work as the above

(వి-వి)—

పత్రములు చాలవఱకుఁ దునుకలైనవి. కొన్ని కాన్పించవు. ఉండెడి పత్రములన్నియుఁ దాఱుమాఱుగా నున్నవి. వ్రాఁతయంతయందమైనది కాదు దుష్టము ప్రతి యత్రిపాకనము

తక్కిన విషయములన్నియుఁ బూర్వమువలెనే.

## No 673. రాఘవపాండవీయము.

## RĀGHAVAPĀNDAVĪYAMU

Substance, palm-leaf Size, 18¼ × 1½ inches Pages, 63 Lines, 9 on a page Mode of writing, fair but erroneous Condition, much injured Appearance, old

Complete but imperfect

Same work as the above

(వి-వి.)—

సంపూర్ణము వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులు కలవు. శైథల్య గ్రంథపాతములు గలవు.

పూర్వమువలెనే.

## No 674 రాఘవపాండవీయము.

## RĀGHAVAPĀNDAVĪYAMU.

Substance, paper Size, 12 × 9 inches Pages, 73. Lines, 25 on a page. Mode of writing, fair but containing plenty of mistakes Condition, much injured Appearance, old

Complete but imperfect

Same work as the above

On the fly-leaf of the MS. the following information is found probably in Mr Brown's own hand —

"527 Sec, Wilson Catalogue, vol I, p 335"

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాంత యొకతీరున నున్నది కాని దోషము లధికము. శైథిల్యగ్రంథపాతములు మెండు. కీటదష్టము.

మున్నుటియదియ

---

## No 675. రాఘవపాండవీయము.

## RĀGHAVAPĀNDAVĪYAMU.

Substance, paper Size, 9⅛ × 7⅛ inches Pages, 99. Lines, 21 on a page. Mode of writing, fair but not free from mistakes Condition, much injured Appearance, very old

Begins on fol 1*a* The other works herein are Siddhēśvaradandakamu 52*a*, Siddhēśvaravasantavilāsamu 58*b*

Complete

Same work as the above

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాంత యంతమేలైనదికాదు. తప్పులును గలవు. శైథిల్యమధికము పుర్వులపాలయినది. అతిప్రాచీనము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No 676 రాఘవపాండవీయము

## RĀGHAVAPĀNDAVĪYAMU

Substance, palm-leaf Size, 16⅞ × 1⅜ inches Pages, 139 Lines, 6 on a page. Mode of writing, fair but quite incorrect Condition, injured. Appearance, very old

Complete

Same work as the above

(తె-తె.)—

సమగ్రము. వ్రాఁత యంతతిన్ననైనది కాదు. తప్పులు పెక్కు లు గలవు. శైథిల్య మధికము గ్రంథపాతములు కాన్పింపవు. ప్రాచీనము.

పూర్వము వలె

## No 677 రాఘవపాండవీయము.

## RĀGHAVAPĀNDAVĪYAMU

Substance, palm-leaf Size, 17¼ × 1½ inches Pages, 100 Lines, 6 or 7 on a page. Mode of writing, good but not quite correct Condition, much injured Appearance, very old

Complete but imperfect

Same work as the above

(తె-తె.)—

సమగ్రమే. వ్రాఁత యందముగా నున్న[illegible] కలము నిర్దుష్టము కాదు శైథిల్యమధికము

పూర్వము వలె.

## No 678 రాఘవపాండవీయాదర్శము (సమూలము).

## RĀGHAVAPANDAVĪYADARŚAMU (WITH TEXT)

Substance, palm-leaf Size, 17¼ × 1¾ inches Pages, 137 Lines, 7 on a page Mode of writing, not bad but quite erroneous Condition, injured Appearance, old

Contains 1 and 2 Āśvāsas complete, and 3 or 4 stanzas in the 3rd Āśvāsa

The text here is the same as the work described above. The commentary herein added was written in a colloquial style by Muddarāju Peda Rāmanna, son of Ganapaya of Nandavara sect The commentary quotes authorities, illustrations and parallels from older works and is considered to be the best among the commentaries to this work The introduction is not commented upon

**Beginning.**

శా. శ్రీలీలా . . . . స్మేరాస్యుఁ డై గోపికా
జాలం బద్భుతవార్ధిఁ దేలఁగ నిజేచ్ఛ న్మెజసౌందర్యధు
ర్యాలోకద్యుతిధారఁ దన్మకుళనవ్యాకోచత ల్సేయుగో
పాలస్వామి మనోహరాకృతి మదిన్ భావించి సేవించెదన్.

చ. అమరనసూరనార్యరచితాంచితరాఘవపాండవీయకా
వ్యమహితమాధురీమదుభయార్థవిబోధిరఁ డీకఁ జేసెదన్
గమలజకామినీచరణకాంచననూపురశింజితార్భటిన్
సమమతి సంస్కృతాంధ్రకృతిసాధనలక్షణలక్షితంబుగన్.

మూలము.—

తే. వెలయు నఖిలభువనములలో . .

యీ పద్యానకు రామాయణార్థం

అఖిలభువనములలోను సకలజగత్తులలోపలనున్న "విష్టపంభువనం జగదిత్యమరః" అవారణ అనర్గళమైన సగరపు ఇంద్రునియొక్క రమ సంపదకు (అవారణపదము గమావిశేషణము) పుతల్లి పోషించేది నా అనంగాను "శ్రీయనగౌరినాబరగు చెల్వల" అనే సోమయాజిప్రయోగము తనర్చి ప్రకాశించినదై రాజ్యలక్ష్మి మిగులప్రబలగాను అత్యుక్తి ఇందుకలక్షణం చంద్రాలోకమందు "అత్యుక్తిరద్భుతాతథ్యశౌర్యౌదార్యాదివర్ణనం త్వయిదాతరి రాజేంద్రయాచకాః కల్పశాఖినః" భువనములలోనుఅవారణఅనేదికున్నసంధికి ఆంధ్రభాషాభూషణమందు "మానుగ విభక్తులందున్ పూనిన (ను)రులుకు నచ్చు బోయినబోవున్" అనేలక్షణంవల్లను ఉకారలోపము. రమతల్లి అనేదికున్న "క్షమ నకారాంతప్రకాశితంబులైనపుల్లింగములుదక్క నన్నిటికిని, పరఁగ సంబంధషష్ఠిపై ప్రథమయగుచు దంతికొమ్ములు గమపలుక తరువుకొమ్మ" అనేలక్షణంవర్ణమందు షష్ఠ్యంతరూపం అయోధ్యనా అయోధ్యనే పేరుకల్గదై రాజవినుతిగలిన రాజధాని వెలయును సంస్కృతిప్రాప్తమైవర్తించును "కృతిముఖమున దైవంబు సత్కృతి యొండె నభీష్టవస్తుకీర్తన మొండెన్ వితతాశీఃపద మొండెను ప్రతిపాదింపంగవలయు భద్రాపేక్షను". అనేన్యాయానవస్తునిర్దేశరూపమంగళము "శుభసుఖరుక్ క్షయధనకనకభయైశ్వర్యములఁ జేయుక్రవులిడఁ గావ్యప్రభులకుగనుగృతుల మొదలన్ మభజసనయరత

గణాళీ మల్లయ రేచా". అహోబిలముని ఛందమందు జెప్పినదిగనక ఆదియందు నగణప్రయోగము వెలయుఅనేది శుభపదము వకారం అమృతబీజమున్ను.

భారతార్థం.

అఖిలభువనములలోన వారణనగరి హస్తినగరము పురమతల్లి పురశ్రేష్ఠమైనది నా అనగాను మతల్లికామచర్చికాప్రకాండముద్ఘతల్లజౌ ప్రశస్తవాచకాన్యమూని" వారణనగరిపురమతల్లి అనేదికుఱన "పాసగం బలెఱడునెడ పాల్పసగినప్రథమాంతములపయిం గదిసి కడుం బసనారుకచటతపలను గసడదవల్ ద్రోచివచ్చు కవిజనమిత్రా". అని ఆంధ్రభాషాభూషణమందును, ప్రథమాంతవిభక్తులపైఁ గథితము లగుకచటతపలు గసడదవలగున్ పృథివి నవిగజడదబ లగు ప్రథమపుషున్నలుగ నాంతపదములమీదఁ". అనిఅనంతునిఛందమందున్ను చెప్పినలక్షణం వల్లనుపకారమునకువకారం రావలశినందుకు తాతంభట్లుగారుకవిలోకచింతామణియందు "భిన్నపదప్రథమలపై నున్నపకారంబు వత్వమొందును వథులన్ మున్నిజరూపముప్రాసము నన్నవరూపంబు దాల్చు నాళీకాక్షా" అనివిశేషవిధులుగా జెప్పి "ఆవాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బ పాలిండ్లపెం పావేణీ భరమావయో విఃసనం బాయొప్పులం జెప్పనన్ నైవారం బగుగాని యయ్యెడ శిరఃకంపంబుతో గూడ హాహా పుట్టింపవె పుష్పధన్వునకు నయ్యబ్జాక్షి వీక్షించినన్" అనిపిల్లలమర్రివీరమరాజుగారిప్రయోగమున్ను "భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగ తోడనె పుట్టునుత్తమ జ్ఞానము" అనియిదిమొదలైనకవిత్రయంవారిప్రయోగాలున్ను వ్రాసినందువల్లను ప్రథమాంతవిభక్తిమీదిపకారానకువకారాదేశము ప్రాసస్థానమందునిత్యముగావచ్చును యతిస్థానమందురాదు యితరత్రయెందైనం జెప్పవచ్చునంనట్టాయగనక వారణపురమతల్లిఅని చెప్పవచ్చును నాంగానేకూరపరాజుగారుయీమీదటిపద్యమందున్ను "విముఖితసమదా టోపారిపంక్తిరథుడు" అనిరామాయణార్థమందు చెప్పినారు. ప్రకృతము తనర్చి ప్రకాశించినదై అయోధ్య యుద్ధంచాయశక్యంకానిది యోద్ధుమశక్యాఅయోధ్యా అనేఅర్థమందు "ఋహలోర్ణ్యత్" అనే సూత్రాణ్ణ్యత్ ప్రత్యయాంతము "నిడుపులుడుపతెనుగగు" నా అనగాను రాజ దిగ్దేశరాజులచేతను వినుతిగనిన రాజధాని సింహాసస్థలమైనది వెలయునుక్రియ.

**End:**

See No 679 of the Des Cat. of the Tel. MSS

గ్రంథాంతవిషయము నె 679 రు నచూడనగును.

(ఖి-ఖి.)—

తొలి రెండాశ్వాసములకు సంపూర్ణముగను మూఁడవయాశ్వాసమున 3, ౪ పద్యములకును గలదు. వ్రా లంతతిన్ననివికావు. తప్పులు మెండు. శైథిల్య గ్రంథపాతములు హెచ్చు.

ఇందుఁ రాఘవపాండవీయమును ముద్దరాజు పెదరామన్నచే రచియింపఁబడిన టీకయును గలవు. ఈ వ్యాఖ్యాత తండ్రి గణపయ; నందవరవంశీయుఁడు. ఈ వ్యాఖ్యాన మన్నిటివలె వ్యావహారిక భాషయందే వ్రాయఁబడియున్నది. ఇందుఁ బెక్కు లక్షణగ్రంథములనుండియు, నితరప్రాచీనగ్రంథములనుండియు నిఘంటువులనుండియు దఱచుగా వ్యాఖ్యానసమర్థనార్థము ప్రమాణములు గైకొఁబడినవి. ఈ గ్రంథమునకుఁగలయెల్ల ప్రాచీనవ్యాఖ్యానములలో నిదియ మేలైనది. దీనిని "రాఘవపాండవీయాదర్శ" మనివ్యాఖ్యాత స్వీయగద్యములందుఁ జెప్పికొన్నాఁడు (మా.డి. క్యా నె 679 రు). అర్థద్వయముకలపట్టులలోకాక యితరకఠినభాగములకుసైతమర్థము వ్రాసియున్నాఁడు. ఈ వ్యాఖ్యాత కృత్యాదిపద్యములకుఁ డీక రచింపలేదు.

No. 679 రాఘవపాండవీయాదర్శము.

RĀGHAVAPĀNḌAVIYĀDARŚAMU

Substance, palm-leaf Size, 16 × 1½ inches Pages, 166. Lines, 8 or 9 on a page Mode of writing, fair but containing mistakes Condition, fair Appearance, old

Contains the third and the fourth Āśvāsas.

This and the above described MS. (No. 678) form a complete copy of the commentary by Muddarāju Pedarāmanna on the Rāghavapānda_ vīya.

Same work as the above

**Beginning.**

See No. 678 of the Des Cat. of Tel. MSS

గ్రంథాదిభాగము పై నె 678 రునఁ జూడుఁడు.

**End:**

సీ. .

రామభద్రుఁడు సన్మార్గరంక్షణైక
పరుఁడు దిగవతంసితకీర్తి పాండుసూనుఁ
డు ర్విపైఁ జతురాత్మానుజోపచరిత
చరణుఁ డగుచు సామ్రాజ్యంబు సలుపునపుడు

టీ॥ దిక్ దిక్కులకు అవతంసిత అలంకారము చేయబడిన కీర్తియనెడి పాండుసూనుడు తెల్లనిపుష్పాలుగలవాడు రామభద్రుఁడు చతుర మనోహరమైన ఆత్మ హృదయముగల అనుజ తమ్ములచాతను పుపచరిత సేవింపబడిన చరణుడగుచు పదములుగలవాడై సామ్రాజ్యం సలుపునప్పుడు భూమిపైయీలాగుసంతోషానవుండెను

భా॥ రామ వొప్పుచున్న భద్రముగలవాడు దిగవతంసితమైన కీర్తిగలవాడు పాండుసూనుడు ధర్మరాజు చతుః నలుగురైన ఆత్మ తనయొక్క అనుజులచేతను ఉపచరిత సేవింపబడ్డ చరణాలుగలవాడౌచు సామ్రాజ్యము సలుపునపుడు.

శ్రీధాన్యకటకమై చెలువొందెరాష్ట్రంబు ౧౮౭

* * * *

**Colophon:**

టీకాకారుల గద్య. ఇది శ్రీమన్మదనగోపాలకృపాకటాక్షసంప్రాప్త సారసారస్వత సంపదానందవరకుల పారావార రాకాసుధాధామ ముద్దరాజు గణపయామాత్య పెదరామధీమణిప్రదర్శితంబైన రాఘవపాండవీయాదర్శంబునందు సర్గంబును జతుర్థాశ్వాసము.

(బి-బి.)—

వెనకటి రెండాశ్వాసములు (౩, ౪) గలవు. వ్రాఁత బాగుగనే యున్నది తప్పులు లేకపోలేదు. శైథిల్యగ్రంథపాతము లంతఁగాఁ జూపట్టవు.

ఇందలి వ్యాఖ్యానముగూడ ముద్దరాజు పెదరామన్నదే. పూర్వ వర్ణితగ్రంథము (నె 678 రు) నిదియుఁగలసి యొకసంపూర్ణవ్యాఖ్యాన మగును.

తక్కిన విషయములు పూర్వమువలె.

## No 680 రాఘవపాండవీయాదర్శము (సమూలము)

## RĀGHAVAPĀNDAVĪYĀDARŚAMU (WITH TEXT)

Substance, palm-leaf  Size, 14⅝ × 1½ inches  Pages, 215  Lines, 6 on a page  Mode of writing, bad and incorrect  Condition, injured  Appearance, old

Contains the first two Āśvāsās

Same work as the above

(ఔ-ఔ)—

రెండాశ్వాసములవఱకు సంపూర్ణముగాఁ గలక వ్రాఁత తిన్ననిది కాదు. తప్పులును గలవు శైథిల్యగ్రంథపాతభూయిష్ఠము వ్యాఖ్యాత్పవిషయాదికము పూర్వమువలెనే తెలియనగును

## No 681 రాఘవపాండవీయాదర్శము (సమూలము)

## RĀGHAVAPĀNDAVĪYĀDARŚAMU (WITH TEXT)

Substance, palm leaf  Size, 19¼ × 1⅝ inches  Pages, 224  Lines, 6 on a page  Mode of writing, fair but incorrect  Condition, much injured  Appearance, very old

Complete but the leaves are all torn and worm-eaten while some of them in the beginning and in the end are missing, hence quite imperfect

Same work as the above

(ఔ-ఔ.)—

సంపూర్ణమే. తొలియాకులు కొన్నియు, కడపటియాకులు కొన్నియుఁ గాన్పింపవు. వ్రాఁత యొకతీరుగా నున్నది. తప్పులుకలవు శైథిల్య మత్యధికము.

పూర్వమువోలె.

---

## No 682 రాఘవపాండవీయము (సటీకము).

## RĀGHAVAPĀNDAVĪYAMU (WITH COMMENTARY)

Substance, palm-leaf  Size, 17¾ × 1⅝ inches  Pages, 88  Lines, 5 and 6 on a page.  Mode of writing, fair but not free from errors  Condition, fair  Appearance, old

Contains the first Āśvāsa only

Same text and commentary as the above

The commentary in some places here is found in a briefer form than in the MS referred to above It has also to be noted that the invocatory stanzas of the commentator are omitted and the colophon at the end of the first Āśvāsa is in the form of a verse

(వి-వి.)—

ప్రథమాశ్వాసముమాత్రము. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పులు లే వన వలను కాకయున్నది. శైథిల్య గ్రంథపాతములు లేవు

ఆశ్వాసాంతమున

"శ్రీమద్ధరాజుగణపతి
ప్రేమతనూభవుఁడు నెలమి పెదరామఁ డనఁగా
ధీమణి టీక నొనర్చెను
రామాయణభారతంబు ప్రథమాశ్వాసం"

అని యున్నది.

ఈ టీకయుఁ బూర్వోక్తమైనదానివంటిదేయైనను కొన్నియెడల నంతకన్న సంకుచితముగా నున్నది. పై వ్యాఖ్యానము (నె 678 రు)న వ్యాఖ్యాతృకృతదేవతాస్తుత్యాదిక మగురెండుపద్యము లున్నవి. ఇం దవి కాన్పింపవు. కాన నిది యదే వ్యాఖ్యయనుట విచారణీయము.

## No 683. రాఘవపాండవీయము (సటీకము).

## RĀGHAVAPĀNDAVĪYAMU (WITH COMMENTARY)

Substance, paper Size, 11⅜ × 7½ inches Pages, 210 Lines, 23 on a page. Mode of writing, fair but containing mistakes Condition, good Appearance, old

Complete

Same text as the above but the commentary is different from and much briefer than that described above The commentator's name is not given and the commentary is in colloquial style

**Beginning:**

శా. శ్రీతోఁ బుట్టి సుధామధుద్రవముతోఁ జెన్నొందుపుష్పంబు శో
భాతారుణ్యమెలర్పఁగా ముడుచుపంపాహేమకూటాశ్రయ
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁ గావుత విరూపాక్షాహ్వయం బాకుని
టీలిష్ణుప్రభువేంకటాద్రిహృదయాటీకంబు లోకంబులన్.

• • • •

ఆ. వెలయు నఖిలభువనములలో నవారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజవినుతిగనిన రాజధాని.

టీ. నగరిపురమతల్లినాదనర్చి దేవేంద్రలక్ష్మితల్లియనఁగా తనర్చి రాజ్యలక్ష్మిమిగులఁబ్రబలగాను అయోధ్య అనగాను రాజవినుతిగనినరాజ ధాని అఖిలభువనములలోనను అవారణను వెలయును

భా. వారణనగరి గజపురము పురమతల్లినాదనర్చి పురశ్రేష్ఠమనగా దనర్చి రాజ్యలక్ష్మి మిగులబ్రబల అయోధ్యనా యోద్ధుమశక్యాఅయోధ్యా అన్న వ్యుత్పత్తిని పోట్లాడశక్యంగాదనగాను రాజవినుతిగనినరాజధాని అఖిలభువనములలోనా వెలయునూ.

**End:**

సీ. . . . . . . .

రామభద్రుఁడు సన్మార్గరతుఁడైక
పరుఁడు దిగవతంసితకీర్తిపాండుసూనుఁ
డు ర్విపైఁ జతురాత్మానుజోపచరిత
చరణుఁ డగుచు సామ్రాజ్యంబు సలుపునపుడు.

రా. శ్రీధాన్య॥ స్వకీర్తి పాండుసూనుండు కీర్తిఅనెడి పాండు తెల్లనైన సూనపుష్పాలంగలవాడు చతురులైన ఆత్మానుజులచాతను.

పా. శ్రీధాన్య॥ రామభద్రుండు రామ వొప్పేటి భద్రముగలవాడు నలుగురైన ఆత్మతనయొక్క అనుజులచేతను ఉపచరితచరణుండు.

• • • •

**Colophon:**

గద్య. ఇది నిఖలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి సూరయాఖ్యతనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతంబైన రాఘవపాండవీయము సటీకము చతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకవిధముగానున్నను తప్పులు పెకుఁలు కలవు. శైథిల్యగ్రంథపాఠములు కాన్పింపవు.

ఇది పూర్వోక్తవ్యాఖ్యానమువలెఁ గాక మిగులసంకుచితముగా వ్రాయఁబడినది. అవతారికపద్యము లున్నగువానికిఁ డీక లేదు. కథాభాగమునందలివానికిఁ గూడఁ గొన్నింటికి గానరాదు రచయిత యెవ్వఁడో తెలియరాదు టీక వాడుకభాషయందే వ్రాయఁబడి యున్నది

No 684 రాఘవపాండవీయము (సటీకము)

RĀGHAVAPĀNDAVĪYAMU (WITH COMMENTARY)

Substance, palm-leaf Size, 15½ × 1⅝ inches Pages, 338 Lines, 5 or 6 on a page Mode of writing, fair but containing mistakes Condition, fair Appearance, old

Complete

Similar to the above The commentary is very meagre and as usual in colloquial style

The date of transcription and the name of the scribe given at the end of the MS are extracted below

**Beginning:**

• • • •

తే వెలయు నఖిలభువనములలో నవారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజవినుతి గనినరాజధాని.

టీ. నగరిపురమతల్లినాఁదనర్చి నగరిపు దేవేంద్రుని యొక్క గమా స్వర్గానకు తల్లి యనంగా దనర్చి రాజ్యలక్ష్మి మిగుల బ్రబలంగాను అయోధ్యయనంగాను రాజవినుతిగనిన రాజధాని అఖిలభువనములలోనను అవారణ వెలయు.

భారతాసుర.

టీ. వారణనగరి గజపురము పురమతల్లి నాంద్దనర్చి పురశ్రేష్టము నంగ్గాదనర్చి రాజ్య లక్ష్మి మిగుల బ్రబలనయోధ్యనా యోద్ధుమశక్యా అయోధ్యా యన్నవిత్పత్తిని పోట్లాడ శక్యముగా దనగాను రాజవినుతి గనిన రాజధాని అఖిల భువనముల వెలయును.

**End:**

సీ. . . . . . . . .

రామభద్రుండు సత్స్వార్థ రతు నెఱ
వరుఁడు దిగవతంసిత కీర్తి పాండు సూనుఁ
డుర్వి నైజతురాత్మాను జోపచరిత
చరణుఁ డగుచు సామ్రాజ్యంబు సల్పునపుడు.

రా. శ్రీధాన్య కీరి పాండుసూను కీర్తియనెడి పాండ్డు తెల్లనై సూను పువ్వులు గలిగినవాఁడు చతురాత్మానుజ చతుర దేహాలుగల తమ్ములు.

భా. రామభద్ర రస ణియ్యు మంగళ ప్రసంగల పాండ్డు సూనుండు ధర్మరాజు చతురాత్మానుజ నలుగురు తమ్ములు ఉపచరిత సేవింప్పబడ్డ.

* * * *

గద్య. ఇదినిఖిల సూరిలోకాంగీకార తరంగిత కవిత్వ వైభవ పింగలి యమరనార్యతనూభవ సౌజన్య జేయ సూరయ నామధేయ ప్రణీతంబైన రాఘవపాండవీయంబునందు మహా ప్రబంధంబునందు సర్వంబునందు జతుర్థాశ్వాసము.

(ఔ-ఔ).—

సంపూర్ణము వ్రాఁత సామాన్యముగా నున్నది నిర్దుష్టముకాదు. శైథిల్య గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

ఈ వ్యాఖ్యానకర్త పేరు తెలియరాదు వ్యాఖ్యాన మత్యల్పము అవతారిక మున్నగువానికిఁ బొత్తిగా వదలివేయఁబడి యున్నది కథా భాగమున సైతము కొన్నింటి విడిచిపెట్టఁబడినది. వాడుక భావయందే కలదు. —

గ్రంథాంతమున

"శ్రీ భావనామ సంవత్సర శ్రావణ శు ౧ సోమవారంవరకు
. . . . . . . దామరాజు వెంక
ట్రాయుడు . . . వ్రాసుకొనెను."

అని యిలేఖకుని నామమును గ్రంథ లేఖనము ముగిసిన కాలమును గలవు.

No 685 రాఘవపాండవీయము (సటీకము)

RĀGHAVAPĀNDAVĪYAMU (WITH COMMENTARY)

Substance, palm-leaf Size, 14¾ × 1⅛ inches Pages, 142 Lines, 6 on a page Mode of writing, fair but erroneous Condition, much injured and all leaves are broken, torn and irregularly arranged Appearance, old

As the MS is in a very much injured condition neither the extent of the work nor the name of the author could be found out

Similar to the above

(ఏ-బి.)—

గ్రంథ మెంతవఱ కున్నదో ? వ్రాంత యొక తరబడిగా నున్నది. తప్పులు కుప్పలు. శైథిల్యము చెప్పనలవికాదు. పత్రము లన్నియు తునిగి తునుకలయినవి. వ్యాఖ్యాత యెవ్వరో !

No 686. రాఘవపాండవీయము (సటీకము).

RĀGHAVAPĀNDAVĪYAMU (WITH TĪKĀ)

Substance, paper Size, 12 × 8½ inches Pages, 682 Lines, 32 on a page. Mode of writing, fair but not free from mistakes and written only on one side of paper Condition, good. Appearance, not new

Breaks off in the 4th Āśvāsa

The commentary herein found is different from those described above. The language is not so colloquial as that of the above-mentioned commentaries

The following note of Mr. Brown found at the beginning of the MS. gives further information about the commentary :—

"This verbal commentary was composed at my request by the very learned Narasima Chari. This volume is in his own handwriting. The poem is one of extraordinary refinement and singularly difficult, every stanza bearing two separate meanings–one giving the story of the Pandavas according to the Mahabharat and the other the adventures of Rama

Thus the commentary on each stanza is bipartite."

**Beginning.**

శా. శ్రీరో . . . . . . లోకంబులన్

టీ. శ్రీతో బుట్టి లక్ష్మీదేవితోకూడా జన్మించి సుధా . . . పుష్పంబు సుధా అమృతమనెడు మధుద్రవముతో మకరందరసముతో డను చెంనొందు పుష్పంబు ప్రకాశిస్తుంనటువంటి కుసుమమును శోభా తారు . . . హేమము శోభా కాంతియొక్క తారుణ్యము తరుణభావము అనగా కాంతికోమలత ఎలగ్నగా అతిశయమగునట్టుగాను ముదుచు ధరిస్తుంనటువంటి పంపా వ పా సరోవర ప్రాంతమందలి హేమకూట హేమకూటమనే పేరు గలిగినటువంటి పర్వతమే ఆశ్రయ స్థానముగా గలదనేటట్టుగాను ఖ్యాతి ప్రసిద్ధమైనటువంటి బ్రహ్మము బ్రహ్మ స్వరూపమయినటువంటిన్ని అకుపీటి . . బు అకుపీటి వంశజుడైనటువంటి తింమప్రభు వేంకటాద్రి తిమ్మరాజు కొమారుడైన వెంకటరాజుయొక్క హృదయాటీకంబు మనోవిహారము కలిగినటువంటి విరూపాక్షాహ్వయంబు విరూపాక్షుడనే పేరు కలిగినటువ టి దైవము లోకంబులు జగములను బ్రోచుగావుత రక్షించుగాక

* * *

ఆ. వెలయు నఖిలభువనములలోన వారణ
నగరిపురమతల్లి నాఁ దనర్చి
రాజ్య లక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్య నా
రాజవినుతి గనిన జధాని.

రా. అవారణ అనివార్యమైన వంటి నగరిపురమతల్లి నాదనర్చి నగరిపు పర్వత విరోధైనటువంటి ఇ మనియొక్క రమ లక్ష్మియొక్క అనగా భాగ్యముయొక్క అనుట తల్లినాదనర్చి జననో అంనట్టుగాం నొప్పినదై రాజ్యలక్ష్మి మిగులబ్రబల రాజ్యలక్ష్మి రాజ్య వైభవము మిగుల విస్తరించి ప్రబలను వృద్ధిపొందగాను అయోధ్యనా అయోధ్య అనేపేరు గలదిగాను రాజవినుతి గనినరాజధాని రాజ రాజులచేతను వినుతిగనిన పొగడ్తను పొందినటువంటి రాజధాని నగరము అఖిలభువనములలోనను అఖిల సమస్తమయినటువంటి భువనములలోనను లోకముల లోపలనున్ను వెలయును ప్రకాశించును.

పా. వారణనగరి హాస్తినాపురము పురమతల్లి నాదనర్చిపుర నగరములలోపలను మతల్లినాదనర్చి శ్రేష్టమైనదనగా నొప్పిన దాతున్ను

రాజ్య లక్ష్మి మిగుల బ్రబలుచు రాజ్యవిభవము విస్తరించి వృద్ధి పొందగాను అయోధ్యనా యోద్ధుమశక్యా అయోధ్యా అనే వ్యుత్పత్తిచేతను శత్రు రాజులు యుద్ధముచేయడమునకు తగినదిగా దనేటట్టుగాను రాజవినుతి గనిన రాజధాని రాజులచేతను పొగడ్తను పొందినటువంటి నగరమైనదా కుంటున్న అఖిలభువనములలోన సకలలోకముల లోపలనున్న వెల యును ప్రకాశించును.

End

చ. ఘనముగ నాత్మనాటి తనకాంత పరాభవ మల్కఁ బెంపఁగా
ననయముఁ బేర్చు రాజమణియాశుగ సంతతి నీదు పెద్దత
మ్ముని నడుఁబొమ్ము నెత్తురు సముద్ధతిఁ గ్రోల నినుం గృతోరుభం
గుని నొనరింపఁ జూపెదిదిగో కలహాంబె యభీష్ట మేనియున్.

టీ. రా ఘనముగ బలిష్ఠముగాను ఆత్మనాటి ఆత్మయందు గ్రుచ్చుకొని తనకాంత పరాభవమల్క బెంపగాను తనకాంత తన భార్యఅయిన సీతాదేవియొక్క పరాభవము తిరస్కారము చేతనైనటువంటి అల్క బెంపగాను కోపమును విస్తరింపచేయగాను అనయము బేర్చు రాజమణి యాశుగ సంతతి అనయము నిరంతరమున్ను పేర్చు మండుతూనుండేటివంటి రాజమణి యాశుగసంతతి రాజశ్రేష్ఠుడైన రాములయొక్క బాణపరంపర నీదు పెద్దతమ్ముని నడుఱొంము నెత్తురు నీ పెద్ద తమ్ముడైన కుంభకర్ణునియొక్క హృదయమునందలి రక్తమును సముద్ధతిగ్రోల అతి తీవ్రముగా పానముచేయుగాను నిను నిన్నున్ను కృతోరుభంగుని కృత చేయబడినటువంటి ఉరు అధికమైనటువంటి భంగుని భంగము కల వానిగాను ఒనరింప చేయగాను కలహాంబెయుద్ధమె అభీష్టమేనియున్ హితమైతేను చూచెదు చూడగలవు ఇదిగో అనగా ప్రత్యక్షముగా నగుపడుతున్నదనుట

పా. తన కాంత పరాభవము సభయందు చేయపడినటువంటి తన భార్య అయిన ద్రౌపదియొక్క అవమానము ఘనముగ నాత్మనాటి బలముగాను హృదయమందు లగ్నమై అల్క బెంపగాను కోపమును వృద్ధిపొందించగాను అనయము బేర్చు రాజమణి నిరంతరమున్ను ఉగ్రుడౌతూ నున్నటువంటి రాజశ్రేష్ఠుడైనటువంటి ఆశుగసంతతి వాయుసూనుడైన భీముడు నీద పెద్దతమ్ముని నీ పెద్దతమ్ముడైన దుశ్శాసనునియొక్క నడుఱొంము నెత్తురు హృదయమందలి రక్తము సముద్ధతిగ్రోల అత్యంతౌద్ధత్యము

చేతను పానము సేయగాను నను నిన్నును కృతోరుభంగుని నొనరింప చేయపడినటువంటి తొడలయొక్క భంగముగల వానిగాను చేయగాను కలహంబె యభీష్టమేనియున్ యుద్ధమె ఇష్టమైతేను చూచెదు చూడగలవు. ఇదిగో ప్రత్యక్షముగా నగుపడుతున్నదనుట

**Colophon:**

గద్య ఇది . . . తృతీయాశ్వాసము.

"టీ. ఇది యా చెప్ప (బ) డినది నిఖిల [illegible] బైన నిఖిల సమస్తమయినటువంటి సూరిలోక విద్వజ్జనముల చేతనైనటువంటి అంగీకార పరిగ్రహముచేతను తరంగిత సంజాతతరంగములు గలిగినటువంటి కవిత్వ కవనముయొక్క వైభవ భాగ్యము కలిగినటువంటి అనగా అతిశయమైనకవిత గలిగినటువంటి యనుట పింగళియమరనామాత్య పింగళి వంశజాతుండైనటువంటి యమరనమంత్రియొక్క తనూభవ పుత్రుండైనటువంటి సౌజన్యజేయ సౌజన్య సుజనభావముచేతను జేయ జయశీలుడైనటువంటి సూరయ నామధేయ సూరయ అనే పేరుకలటువంటి పురుషునిచేతను ప్రణీతంబైన రచింప పడినటువంటి రాఘవపాండవీయంబునందు రాఘవ పాండవకథా సమ్మిళితమై రాఘవపాండవీయమనే పేరుగల గ్రంథమందు ప్రథమాశ్వాసము మొదటి ఆశ్వాసము" అని ప్రథమాశ్వాసాంత గద్యయొక్క వ్యాఖ్యానము తక్కినవానికి సిద్ధ్లే యెఱుంగునది

(ii-ii) —

నాలవ యాశ్వాసమున సగమునకు బైబడి గేదు వ్రాంత సామాన్యము వ్యాఖ్యాతచేతనే వ్రాయఁబడినది తప్పు లల్పముగాఁ గలవు. పత్రమున నొక వైపునమాత్రము వ్రాయఁబడియున్నది శైధిల్య గ్రంథపాతములు కానరావు

ఇందు రాఘవపాండవీయ మూలమును బ్రౌను దొరవారి ప్రార్థనపై నరసింహాచారి యను పండితునిచే రచియింపఁబడిన టీకయుఁ గలదు. ఇది యింతకు ముందున్న వ్యాఖ్యానముల నన్నిటినిఁ జూచి రచియింపఁబడినటులఁ దోఁచుచున్నది.

## No 687 రాఘవయాదవపాండవీయము.

## RĀGHAVAYĀDAVAPĀNDAVĪYAMU

Pages, 61 Lines, 23 on a page. Mode of writing, good but not quite correct

Begins on fol 276b of the MS. described under No 351 of the D.C Tel MSS, Part I, Vol I.

Complete in four Āsvāsas

This is a poem in four Āśvāsas consisting of stanzas each of which is capable of being interpreted to convey three meanings referring respectively to the stories of Rāma, Krsna and the Pāndavas The author of the work is Elakūci Bālasarasvatī, son of Krṣnadēva and grandson of Bhairavārya of Kaundinya gōtra He bore the titles Bhaṭṭāraka and Mahōpādhyāya It is herein stated that his other works are Rangakaumudīnātaka, Candrikāparinaya, Āndhracintāmanīvyākhyā, Bhāsāvivarana, etc

**Beginning:**

శా. శ్రీమద్వేంకటశైలమాళిక(?)శిఖాసీమన్ సుఖాసీనుఁ డై
వ్యామోహప్రతికారసంభవభవవ్యాళాళిఁ బోఁ దోలుచున్
భూమిం గల్గు ప్రపన్న సస్యనికరంబుం బ్రోచి తత్సంభృతా
సామాన్యేష్టఫలౌఘుఁ డై యలరు విశ్వత్రేష్ఠుఁ గీర్తించెదన్.

సీ. కవిసమీహితరంగకౌముదీనామనా
టకవిధానప్రతిష్ఠాఘనుండ
సారసారస్యసచ్చంద్రికాపరిణయ
ప్రముఖశతాగ్ర ప్రబంధకర్త
నంధ్రచింతామణీవ్యాఖ్యానభాషావి
వరణాదిబహుతంత్రకరణచణుఁడ

వేదశాస్త్రపురాణవివిధసంగీతసా
హిత్యాదివిద్యోప బృంహణుండ

ననఘకౌండిన్యగోత్రుఁడ హరిపదాబ్జ
భక్తిశీలుఁడ నేఁకూచిభైరవార్య
కృష్ణదేవుతనూజుఁడ నే విచిత్ర
కావ్య మొకటి నిర్మింపఁగాఁ దొడంగి.

తే. ప్రజ్ఞకును సాక్షి యరయఁ గబ్బంబ కాన
నద్భుతంబైనప్రజ్ఞ కనుగుణంబు
గా నిరంతరదుష్కరం బైనకబ్బ మెద్ది
సేయువాఁడనొ యంచు యోజించి మదిని.

శా. మున్నైదేకట్టివిచిత్రవైఖరులచే మీఁదౌ మహాకావ్యముల్
దండిం దొల్లియు చేసి రాదిములు తత్కావ్యాధికశ్లాఘమై
నుండన్ రాఘవకృష్ణపాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నేఁ జేసితిన్.

గీ. ఖ్యాతికై కొంద ఱీమేము త్ర్యర్థికృతులు
చేసితి మటంచు రచి కల్ల సేయ నేల
సరసులకుఁ బ్రతిపద్యవిస్మయ మొసంగు
నాదుకబ్బంబునకు సాటి లేదు గాన.

క. ప్రకృతకథాత్రితయశ్లే
షకావ్యమిది యిందు నిజముశబ్దశ్లేషా
ధికవిరచనయర్థశ్లే
షోక్తియొకొక్కయెడలజతయై మెఱయున్.

క. అంగజగురునకు మణిఖచి
తాంగదధరునకు భవార్తిహరునకు నలమే
ల్మంగావరునకు సదయా
పాంగప్రవరునకు సర్వభావపరునకున్.

* * * *

ఆ. వినుతి గాంచు భూమిపీఠ కుంజరపురి
మధురసప్రసూనమహితవనస
మగ్రదక్షిణయుత మణిశిలోచ్చయ యోధ్య
గణ్య కనకసౌధకలిత మహిని

**End:**

క. నాదావధానయోగా
ప్లోదిత్రోటకవిలోకలక్ష్యప్రపంచో
పాదానకారణాత్మక
వైదికతాంత్రికమనీషివరదహరచరా

సుగంధి. పంకజాక్ష మోక్షదప్రవృత్తియోగమందహా
సాంకురాభిశోభితాననాబ్జయజ్ఞసంభవా
తంకకృత్పురాణదైత్యదండధృతవజ్రశ్రీ
వేంకటాద్ర్యధిత్యకానివిష్టశిష్టరక్షణా

**Colophon:**

గద్య. ఇది సకలకవితాస్వతంత్రభట్టారబాలసరస్వతీకవిమహో
పాధ్యాయప్రణీతంబైన రాఘవయాదవపాండవీయంబను మహాప్రబం
ధంబునందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము నాలుగాశ్వాసములు వ్రాఁత బాగుగనేయున్నది
తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాఠములు లేవు

రామాయణభాగవతభారతకథలు మూఁడును వచ్చునట్లు శ్లేషించి
చెప్పబడిన యీ ప్రబంధమునకుఁ గర్త యెలకూచి బాలసరస్వతీకవి
ఇతఁడు భైరవార్యుని పౌత్రుఁడు. కృష్ణదేవుని పుత్రుఁడు. కౌండిన్య
గోత్రుఁడు. ఇతనికి భట్టారమహోపాధ్యాయ బిరుదములు గలవు.
ఇతని యితరకృతులు:—రంగకౌముదీనాటకము, చంద్రికాపరిణయము,
ఆంధ్రచింతామణివ్యాఖ్యానము, భాషావివరణము మొదలయినవి.

## No. 668. రాఘవవాసుదేవీయము.

## RĀGHAVAVĀSUDĒVĪYAMU.

Pages, 136. Lines, 21 on a page Mode of writing, good and fairly correct Condition, good.

Begins on fol. 1 of the MS described under No. 596 of the D C. Tel. MSS, Part I, Vol 1

Complete in five Āsvāsas

This Prabandha consists of stanzas conveying two meanings and narrating succinctly the stories of Rāma and Krsna. It was composed by Śingarārya, son of Kōnamāmba and Krottapalli Rangayācārya of Ātrēyagōtra, and was dedicated to Kāminēni Ranga Raukabhūpala of Hanumatsvāmigōtra, who was a chief of Candikāpura and disciple of Vīranapandi ārādhya, a descendant of Mallikārjunapanditārādhya of Śrīsaila The author states that his other work is Bilhanīya which is described under R No 158 (b).

**Beginning :**

శా. శ్రీమత్సాధ్వియుఁ దా నిజేశ్వరశిరశ్శ్రీమత్కిరీటంబుపైఁ
బ్రేమ న్ముత్తెపుబెండ్లిప్రాలొసఁగుచో బ్రీడ న్విలోకించి వ
క్షోమధ్యస్థితకౌస్తుభంబున లసచ్ఛాయాకృతిం జిత్ర మం
చామోదించక యాఁచుసింగవిభుం డంకేంద్రుని బ్రోవుతన్.

* * *

సీ. గీ అట్టివల్మీకభవునకు వ్యాసమునికిఁ
గాళిదాసునకును నన్నఘునున కెలమి
నేను రచియించునిరణీయకావ్య
మునకు శుభతరశక్తిరా వినుతి సేతు

వ. అని . . . పురాతన భగవత్కథాద్వయరచనానిబం
ధం బగు నాకక్ప్రబంధంబు సేయంబూని మదీయం బగు వంశావతారం
బభివర్ణించెద.

*

సీ. గీ. అజహరిశారదాపర్ణనీయ తిలబ్ధ
యోగమహిమల వాణీరమాగభూతి
సంజ్ఞలుగణింపద్విజరాజసన్నుతాంకుఁ
దత్రి మహితానసూయానుమైత్రి నలరు.

క. ఆమునివంశపరంపర
శ్రీమన్నారాయణాఖ్యశేఖరుఁ డెలమిన్
భూమిని జనించి భాగవ
తామోదవిధాయి యనఁగ నభినుతిఁ గాంచెన్.

వ. ఆమునివంశంబునందు స్వయానుసంధానధురీణుం డగు నారాయణదేశికుం డుదయించె; అప్పురుషునకు భాష్యభగవద్విషయవిశారదుం డగుచు నభినవనారాయణదేశికుం డుద్భవిల్లె; ఆ ఘనునకు నఖిలవిద్యావిచక్షణదక్షుం డగు నప్పకొండాచార్యులు జనించె; అమ్మహాభాగునకు ననర్ఘపాండిత్యప్రవీణుం డగు నాంబిళ్ళాచార్యుం డుద్భవిల్లె; ఆ దేశికాగ్రణికిఁ దిరుమలాంబకు విమతగజసింహు లగు నారసింహులును, నృపులచే మెప్పుగాంచిన యప్పలాచార్యులును, నాటకాలంకారనయవిశారదుం డగు నాంబిళ్ళదేశికుండును జన్మించిరి; వారలు మద్దికర మను పట్టణమందు శ్రీమంతులై ప్రవర్తిల్లుదురు. ఆ నృసింహాచార్యులకు నభినవరామానుజులగు రామానుజులును, ప్రబంధకవితాబంధురుం డగు నప్పలాచార్యులును పుట్టిరి. ఆయప్పలాచార్యులపత్నికి శ్రీరంగాంబయందు విష్ణుదేవునకుఁ బంచాయుధంబులపోలెడి రంగప్ప, కోతయ్య, నారసింహులు, వెంకటప్ప, అప్పలాచార్య లను దేశికాగ్రేసరు లయిదుగురు సముద్భవులైరి వారల కనుజయై యచ్చమ్మ జన్మించె. అట్టిదేశికోత్తములలో రంగాచార్యులకుఁ గోనమాంబకు సింగరాచార్యసమాఖ్యుండ నగునే నాదిగా నలుగుర ముద్భవించితిమి.

తే. అనెడు నన్ను బుధు ల్గారియాడి బిల్హ
ణీయము మొదలైన కృతులు విన్నాము తెలుఁగు
నపుడు భగవత్కథాప్తి నూహించునట్టి
కావ్యము రచింపు శ్లేషోక్తిఁ గవులు మెచ్చ.

వ. అనిన మహాప్రసాదం బని కావ్యంబు రచన గావింపుచుండు సమయంబున.

* * * *

వ. . . . . . శ్రీమచ్ఛ్రీశైలమల్లికార్జున పండితారాధ్యుల ప్రదీపక వీరనపండితారాధ్య సుందరచరణారవింద మరందాస్వాదనతుంది

శేందిందిరాయమానమానసుండును, హనుమత్స్వామిగోత్రేంద్రుండును. కామినేనికులపయఃపారావారపూర్ణచంద్రుండును నగు బంగారంక భూపాలచంద్రుండు . సామంతమంత్రిపురోహితామాత్య భృత్యవర్గంబుతోఁ జెలువు దీపించి

మ. ననునారాయణమానుపాదవిలసత్స్వాలీకసేవామరం
దనితాంతాంచితపాననీరకవితాధారాసుపర్వాంధ్రవా
గ్జనితానేకవిచిత్రకావ్యఘటనాశ్లాఘ్యుఁడా మహోల్లిష్టక
ల్పను శ్రీవైష్ణవవంశవార్ధిశశిఁ బిల్వం బంచి పల్కెం గృపన్.

చ. వరసుకవిస్తుతంబు లయివర్తిలు సత్కృతుల న్నృపాళిచే
నరుమగఁ గాంచునట్టిసముదారబహూకృతు లేమి చెప్ప శ్రీ
కర మగునీకవిత్వ మతిఁ గాంచిన వింతయు మెచ్చు సేయుటన్
స్థిరమతి నీవు సేయుకృతి సేయుము మాకిపు డంకితంబుగన్.

వ. అని సబహుమానంబుగాఁ బసిఁడి జాంబూనదాంబరాభరణ పల్యంకికాశ్వ సమస్తవస్తుప్రదానంబుల న్మహోరాప్రదానంబుల సంతుష్టుం గావించిన నేను నానందకందళితాంతఃకరణుండనై కృతిపతి వంశావతారం బభివర్ణించెద.

సీ. గీ. ఘనతరద్విజరాజాంకుఁ డనఁగ నచల
ధర్ముఁ డన విశ్రుతాగమధర్త యనఁగఁ
గావ్యరాగి యనంగ యోగప్రభావ
మునను జెలువొందె వాల్మీకిమునివరుండు.

క. ఆమునివంశపరంపర
భూమిం జనియించె విబుధపుంగవవినుతిన్
శ్రీమహితకామినాయకు
ధీమణి భోగముల వాసుదేవనిభుండై.

క. ధారుణి నాథును పేర్మిన్
ధీరులు దత్కులజు లెల్ల దీపితయశులై
యారయ యనఁ గామినాయని
వా రనఁగా వెలసి రతులవైభవయుక్తిన్.

క. ఆకామినేనికులర
త్నాకరపూర్ణకువలయాప్తునికరణిన్

లోకత మోహారణుం డై
నాకౌకస్తుతుల దాదినాయఁడు పుట్టెన్.

* * * *

క. అలదాదిభూమిభృద్వర
విలసన్మహితోరుకుక్షి వెడలి తదంక
స్థలిఁ బెరిగి వీరహారి యై
కలిచెన్ రిపునరుల శేఖునాయఁడు పేర్మిన్.

క. వర శేఖుభూతలేశున
కరకుఁదనభాగ్య లచ్చమాంబిక సతి యై
కర మొప్పఁ బుట్టె వారక
సరసన్నుతకీర్తి పోలినాయఁడు వేడ్కన్.

* * * *

క. ఆజగతీశుఁడు సుగుణస
మాజము నందనరు లచ్చమాంబికయందున్
రాజీవరాజసన్నిభ
రాజితహిత తేజు ముత్తిరాజున్ గాంచెన్.

* * * *

క. ఆరమణుఁడు తిమ్మాంబా
వారిజముఖియందుఁ గాంచె వరు వీరన్నన్
శ్రీరామలింగనృపతిన్
శ్రీరంజితకాంతవిభుని జెలువు దలిర్పన్.

క. ఆముత్తిరాజు రెండవ
కామిని యగు వేంగమాంబికామణియందున్
ధామాకరధామాకర
ధీమానితగుణు నబాబుధీరుని గాంచెన్.

* * * *

గీ. అల నబాబునిసతులు లచ్చమ్మ కొండ
మాంబ నరసాంబ మఱి యక్కమాంబ భ్రమర
మాంబ యనఁ నైదుగురు చెల్వ లలరుదు రిల
ధన్యలగుచుఁ బతివ్రతల్ దమ్ముఁ బొగడ.

* * * *

సీ. గీ. రహిఁ జెలంగుచు శ్రీముత్తరాజవిభుఁడు
కలితశౌర్యాఢ్యుఁ డేకునాంఖానుఁ డతుల
సుప్రభావుండు వేంకటాద్రిప్రభుండు
విశ్వపతిమూర్తి క్రమముగా వెలసె రేమి.

క. అందగ్రజుండు సుమనో
బృందస్తుతి ముత్తరాజు పృథివీంద్రుం డై
మందీకృతపరభూభృ
త్సందోహుం డగుచు వెలసె సన్మార్గమునన్.

* * * *

గీ. అనపాలునఘనాత్రి కొండమ్మ సుతుల
ముగురుమూర్తు లనంగ సమ్మోదలీలఁ
జెలఁగు పెదజన్న శేఖరుఁ జిన్నన్న
విభుఁడు గల్యాణమతిఁ గాంచె విబుధనుతుల.

క. ఆవఘుతుని మూఁడవసతి
గామె దగు నరసాంబ సుతు మహోమహుఁ గనియెన్
భూదోర్బలసమేతున్
పాదాంబుజనతవిభుతు భ్రమరాధ్యతున్.

క. ఆరథికుని నాలవనా
రీరత్నము గాంచె సుతుల మృత్యుంజయునిన్
వీరేశుఁ జంద్రశేఖరు
నాగయ శ్రీసర్వమంగళాహితకరులన్.

క. ఆమానఘునియైదవ
దేవయ భ్రమరాంబ రామలింగప్రభునిన్
శ్రీమహిళ కుసుమబాణుని
శ్రీమెఱయఁగఁ గాంచినట్లు చెలువుగఁ గాంచెన్.

క. పన్నిద్దఱుసూర్యులవలెఁ
బన్నిద్దఱుసుతులు శ్రీనగాబున కెలమిన్
జెన్నొందఁగ జన్మించిరి
మున్నిలయులు ముత్తరాజముఖ్యులు పేర్మిన్.

సీ. శ్రీముత్తరాజభార్యామణి యోబమ్మ
కళలచేఁ జంద్రరేఖను హసించె
పకునాంఖానునియింతి యయ్యమసాధ్వి
లలి దానమునఁ గల్పలతను గేరె
వేంకటాద్రీంద్రునివెలఁది శ్రీనరసమ్మ
సిరులచేఁ గలుములచెలువ నొంచె
భ్రమరప్పనాయనిపడఁతి వేంకటమాంబ
సత్యవాగ్భూతి భామను జయించె
నను చురాజేంద్రభర్తృక లభినుతింప
వరఁస సర్వజ్ఞుఁడగుదివ్యధరణిజ మగు
హరి యగుఁ జతురాననుం డగు విభుఁను
జెంది యెంతయు నొప్పదు గంద పురర.

మ అరయన్ మంగకదీటువచ్చుసరసాంబాంభోజపత్రాక్షికిన్
హరితేజం డగువేంకటాద్రిపతికిన్ హాలాహలాహరదు
స్తరఫాలాక్షవిలగ్నజాంగభవుఁ డుర్వ్యస్తార్తియై నుంచి యి
ద్ధరఁ గొండప్రభుఁడై జనించెఁ బ్రమదాధారాత్ముఁడై యెంతయున్.

మ. ప్రమదాంవస్థుని యైనవిశ్వపతిభూపాలావతంసాగ్రణీ
కమనారత్నము లార్యసన్నుతలు బంగారమ్మ యచ్చమ్మ ల
చ్చమ సాధ్వీతిలకంబు మూర్తిజఃజాతస్వత్రయీభావము
త్తమ మై కిన్పదునాథునందు సవిభేదప్రోక్తలై రెంతయున్.

* * * *

క. శ్రీవల్లభుఁ డన నెసఁగుచు
నావిశ్వపతిక్షితీశుఁ డల లచ్చమహా
ధ్వీవల్లభియడ నెలమిగ
భావజనిభు ముత్తరాజప్రభువరుఁ గాంచెన్.

మ. నృపవర్యుం డగుముత్తరాజు సతియౌ నేగంటమాసాధ్వి శ్రీ
విపులాంకుం డగునంకభూవరునిఁ గృష్ణానాథసంస్తుత్యశౌ
ర్యపరుం డైతగుక్షీకుమారవిభునిన్ రాజప్రభున్ మించు వి
శ్వపతిక్ష్మాపతి లచ్చమాంబ సతిమించం గాంచె నత్యున్నతిన్.

క. శ్రీధరుఁ డగుబంగారం
కాధీశ్వరుకాంత లచ్చమాంబిక విబుధా
రాధిత యయి రుక్మిణిక్రియ
సాధర్మ్యముతోఁ గుమారచంద్రునిఁ గాంచెన్.

* * * *

శా. ఆలచ్చమ్మకు నంకభూపతికిఁ జెల్వై మించి జన్మించి రో
ప్పులకుప్పల్ రహి ముత్తభూపతి నబాబుల్ వేంకటాద్రీశుఁడు
జ్జ్వలుఁ దేగంటిమహీశుఁ డార్యులు గణింపన్ పకునాంఖానుఁడున్
బలభిద్వైభవకొండభూవరుఁడు భూపాగ్రణ్యుఁడుం గేఁద్రముఁడున్.

* * * *

సీ. గీ. అతఁడు చెలువొందుఁ దారకాహితసమాఖ్య
నీలకంఠాశ్రయుం డయి నిరుపమాన
శక్తిధరుఁ డయి సేనానపక్తియుక్త
మతికుమారుఁ డనంగఁ గుమారవిభుఁడు.

క. ఆరమణునిభార్యామణి
ధీరంజిత యగుచుభూమిదివిజపఘాటీ
వారోదితశుభభాషిత
యై రాజిలుఁ జెన్నమాంబ యతులవిభూతిన్.

* * * *

శా. ఆచెన్నాంబ మహావిభుం డగుకుమారాధీశునం దింపుమైఁ
బ్రాచీభర్త కుమారుఁ బోలుతనయుల్ ప్రఖ్యాతసత్కీర్తిస
త్యాచారవ్రతశీలభద్రు ననుజన్మాకాంక్షు శ్రేయఃకళా
ప్రాచుర్యున్ ఘను ముత్తరాజుఁ గనియెన్ భాస్వన్మహోజ్జ్వలమై.

* * * *

వ. ఇట్టివంశంబున కధీశ్వరుం డగుబ గారంకభూపాలునకు షష్ఠ్యం
తంబులు రచియించెద.

* * * *

క. ఘృణిగురుసర్వజ్ఞశిఖా
మణికిని బరిపంథివీరమదగజసృణికిన్
ఫణిహారకలితదామర
మణికిని శ్రీబంగరంకమనుజాగ్రణికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన రాఘవవాసుదేవీయం బను మహాప్రబంధమునకు కథాప్రారంభం బెట్టిదనిన.

**End:**

లయగ్రాహి. డిండరిక్తి పైయొదవుదండిరిపువరులఁ గడి
కండలుగ బాహుతటమండితసముద్య
చ్చండతరఖడ్గమున మెండుకొని చూపరుల
గుండెలవియంగఁ దలగెండు వెగమీటి (?)
పండితులఁ గూడి వెస నిండుకొలువుండు ఘన
మండలమునందుఁ దగుదండనముతోడన్
దండగను భూజనుల దండిగను బ్రోవఁగను
పండువుఁ మీఱితివి చం(చుం?)డిపురవర్యా.

* * * *

ఆ. ఇతరకథలుగావి దేమని మదిరోయ
రమ్యభాగవతము రామకృష్ణ
చరిత మెవ్వఁడేనిఁ జదువ నాకర్ణింప
వ్రాయఁ గలుగు సకలవైభవములు.

* * * *

క. గురువిజ్ఞానవృషాంకా
వరహనుమత్స్వామిగోత్రవార్ధిశశాంకా
నరసన్నుతబిరుదాంకా
స్ఫురదంచిత మోహనాంకభూపాలాంకా

**Colophon:**

గద్య. ఇది శ్రీమదళఘుసింగరిస్వామిశ్రీమన్నారాయణమునిగురుచరణయుగళసేవాసంభృతసంస్కృతాంధ్రకవితాధౌరేయాత్రేయగోత్రపవిత్రక్రొత్తపల్లిరంగయాచార్యసత్పుత్రచిత్రకవిసింగరార్యప్రణీతంబైన రాఘవవాసుదేవీయంబనుమహాప్రబంధంబునందు . . . . . పంచమాశ్వాసము సంపూర్ణము.

(వి-వి).—

సంపూర్ణము. అయిదాశ్వాసములు. వ్రాఁత బాగుగానున్నది. తప్పులంతఁగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు రామకృష్ణకథలు శ్లేషించి చెప్పఁబడినవి. కర్త చిత్రకవి సింగరార్యుఁడు. శ్రోత్రపల్లి రంగయాచార్యుని పుత్త్రుఁడు. ఆత్రేయ సగోత్రుఁడు. ఇతని తల్లి కోనమాంబ. ఇది చండికా(చుండి)పురాధిపతియగు కామినేనిబంగారంకభూపాలునకంకితము సేయఁబడినది. ఈ యంకభూపాలుఁడు శ్రీశైలమల్లికార్జునపండితారాధ్యుని వంశజుఁడైన వీరనపండితారాధ్యుని శిష్యుఁడు. ఇతనిది హనుమత్స్వామి గోత్రము. బిల్హణీయమీకవియితరకృతి (చూ. ఆర్ నెం. 1686). ఇదియే పండిపెద్ది కృష్ణస్వామికృతమని ప్రసిద్ధిఁ జెందినది. అది సింగరార్యకృతమగుట నందు ఒండుచక్రబంధము చెప్పుచున్నది. ఉదాహృతభాగముం గాంచునది. చుండిపురము నెల్లూరు మండలమందున్నది

---

## No 689. రాఘవవాసుదేవీయము.

## RĀGHAVAVĀSUDĒVĪYAMU

Substance, palm-leaf Size, 18 × 1⅝ inches Pages, 104. Lines, 7 or 8 on a page Mode of writing, fair and fairly correct Condition, fair Appearance, old

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులును గలవు. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతములు లేవు. పూర్వమువలె.

## No. 690 రాజవాహనవిజయము.

## RĀJAVĀHANAVIJAYAMU

Pages, 127 Lines, 24 on a page Mode of writing, good but faulty.

Begins on fol 106a of the MS described under No 455 of the D C. Tel MSS, Vol II

Complete in five Āśvāsas

A Prabandha narrating the incidents leading to the marriage of Rājahaṁsa, the king of Kusumapura with Avantisundarī, the daughter of Mānasāra, king of Avantipura This was composed by Kākamāni Mūrtikavi, son of Timmāmba and Rāmalingabudha of Kauṇḍinyagōtra. The author's great grandfather Rāmabudha and grandfather Prabōdhabudhī are spoken of as paṇḍits possessing good knowledge of both

Sanskrit and Telugu For other particulars, reference may be made to the extracts given below

**Beginning:**

ఉ. శ్రీయధరోపరిన్ గుచగిరిన్ గబరిన్ దరహాసవీటికా
చ్ఛాయలకింపుసొంపు లయి చందనకుంకుమపత్త్రరేఖ లై
యాయతకుందచంపకము లై తగఁ గన్గొను వేంకటేశ్వరుం
డాయిరుగంటిమూడిర భజనార్థితమంబు నదల్పఁ గావుతన్.

* * * *

ఉ. శ్రీరఘురామకావ్యకృతిశిష్టవిధిజ్ఞుఁ బరాశరాత్మజున్
భారవిఁ గాళిదాసు శివభద్రు మురారి మయూరు బిల్హణున్
జోయని మల్హణాదిసురసూక్తికవీంద్రులఁ గొల్చి యెంచెదన్
భారతకర్తృతాచణుల నన్నయతిక్కనయెఱ్ఱనార్యులన్.

చ. ప్రబలమతి న్నుతింతుఁ బ్రతిభాప్రశు(కృ)తిభాషితభారతీంద్రులన్
గబళితసర్వశర్మనులఁ గావ్యచమత్కృతికాళిదాసులన్
నిబడతపోవిలాసులఁ దృణీకృతవాసులఁ గాకమానిరా
మబుధవిధున్ బ్రబోధసుధి మత్ప్రపితామహానిం బితామహున్.

పి.
చల్లచూపులకాంతామతల్లి నాదు
తల్లి నలమేలుమంగఁ గైదండగొనుచుఁ
బన్నగనగాధ్యుఁ డే నింతకన్ను మోడ్చు
తఱిని గలలోన నెదుటఁ బ్రత్యక్షమయ్యె.

క. . . . . . .

సీ. గుణధన్య కౌండిన్యగోత్రు నాపస్తంబ
సూత్రుని వెలనాటిశుభచరిత్రుఁ
గాకమానీమహాగ్రామాబ్జమిత్రు వె(పె)
న్నాకలశాబ్ధితారాకళత్రు
సరసవిద్వత్కవిసార్వభౌముని రామ
బుధసంభవునకుఁ బ్రబోధసుధకుఁ
పౌత్రుఁడిబినరామభట్టాగ్రజన్ముఁడై
సట్టిశ్రీరామలింగసుకుఁదిమ్మ

మాంబికకుం బుత్రుసూర్యనారాయణద్వ
న్యైకమహాజన్ము నుభయభాషాకవిత్వ
తత్త్వనిధి నన్ను మూర్తివిద్వత్కవీంద్రు
హర్షమునఁ జూచియిట్లనియానతిచ్చె.

తే. అనఘమణి కాకమానిరామాహ్వయుండు
నీకు ముత్తాత యుభయభాషాకవిత్వ
తత్త్వనిత్యప్రబోధ పితామహుండు
నీవు కవిపట్టభద్రుండ వెవ్వ రీడు

క. కృతిలోఁ బ్రతిపద్యచమ
త్కృతి గులుకంగఁ బలుక నేర్చుకృతి నీవు మహా
కృతి మాకొనరుచు భాషా
కృతి భారవి కాకమాని శ్రీమూర్తికవీ

క. అనినం బరమానందం
బనువొందఁగ శ్రీనిధాన మబ్బె నటంచుం
గను దెఱచి యితరులకు బ్రా
కటను వెలిచి మురారిచరణఘటితాత్ముండ నై

* * * *

క ప్రతిపద్యప్రతివాక్యో
న్నతికావ్యము రాజవాహనవిజయము మంట యీ
కృతికిం బతి శేషాచల
పతి యంట యెందింతకంటె భాగ్యము గలదే.

క జటిధూర్జటిభరణవిశం
కటమతికిం ద్రుటితజటిలకరటీశ్వరసం
కటగతికిం మాతిరువేం
కటపతికిం దళితదైత్యకంటకతతికిం.

వ. అంకితంబుగానాపొంకింపం బూనినరాజవాహనవిజయం బను ప్రబంధంబునకు గథానిబంధనం బెట్టి దనిన.

**End:**

శా. అంభోధిప్రియసంభవాన్వయుం డతం డత్యుగ్రుండంతం జయ
స్తంభం బుత్తరవార్ధి నిల్పి నిజకాంతాసైన్యసంయుక్తుండై

జంభారిక్రియఁ జేసె యాత్మపురి నిచ్చల్ తల్లిదండ్రుల్ ప్రజల్
సంభావింప సమస్తరాజ్యపదవీ సౌఖ్యంబుఁ జెందెఁ దగన్.

* * * *

పృథ్వి. ధరాధరధనుర్ధనుర్ధళనలబ్ధసీతారుణా
ధరాధరధరాధురాధరణధన్యబాహాత్యదా (?)
పరాధరహితాఖి ప్రబలభూసురాగ్రేసరా
సరాధరవినందినాంచలవిహారపారాయణా (?)

**Colophon:**

గద్య. ఇది శ్రీరామభద్రభజనాసముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిపవరసమాగతసరస్వతలహరీపరిపాక కాకమాలిమూర్తి ప్రబోధబుధకవిసార్వభౌమపౌత్ర రామలింగాబట్టపుత్ర కౌండిన్యసగోత్రభాగదేయమూర్తినామధేయప్రణీతం బైనరాజవాహనవిజయం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి)—

సంపూర్ణము. ఐదాశ్వాసములు. వ్రాఁత తిన్ననిది. తప్పులు మెండుగాఁ గలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందు రాజహంసుఁడను కుసుమపురాధీశుఁ డవంతిపురాధిపతిపుత్రికయగు నవంతిసుందరిని వివాహమాడుట లోనగుగాథ వర్ణింపఁబడినది. కర్త కాకమాలిమూర్తి. ఈతని తమతాతలు పండితోత్తము లగు ప్రబోధసుధీరాముబుధులు. వీరింటిపేరు పెన్నావారు. కౌండిన్యగోత్రులు. వెలనాటితెగవారు. కవితల్లితండ్రులు తిప్పమాంబా రామలింగబుధులు ఈకృతి వేంకటేశ్వరస్వామి కంకితముసేయఁబడినది. విశేషములను దాహృతపద్యములనుండి తెలియునది

---

No 691. రాజశేఖరవిలాసము.

RĀJAŚĒKHARAVILĀSAMU

Pages 86 Lines, 23 on a page Mode of writing, good, but faulty Condition, fair Appearance, old Variations in reading are interlined

Begins on fol. 1a of the MS described under No. 499 ante.

Complete.

This is the same work as the one described under R No. 59 of the Triennial Catalogue, Vol. I, Part 3. By Kūcimañci Timmakavi.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతిన్నదిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు. పాఠాంతరములు బంతులనడుమ నెక్కింపఁబడినవి.

ఇది ఆర్ నె 59 రున వర్ణింపఁబడినగ్రంథమే.

## No 692. రాజశేఖరవిలాసము.

## RĀJAŚĒKHARAVILĀSAMU

Substance, palm-leaf Size, 16 × 1⅝ inches Pages, 121 Lines, 6 on a page Mode of writing fair but contains mistakes Condition, fair Appearance, old

Complete

Same work as the above

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత యొకతీరుగానున్నది తప్పులు కలవు. శైథిల్య మంతగాలేదు. గ్రంథపాతము లేదు.

పూర్వము వలె.

---

## No. 693. రాజశేఖరవిలాసము.

## RĀJAŚĒKHARAVILĀSAMU

Substance, palm leaf Size, 17 × 1½ inches Pages, 75 Lines, 7 on a page Mode of writing, not good and not correct Condition, slightly injured Appearance, very old

Complete

Same work as the above

A stanza, containing the name of the scribe and the date of transcription which is found at the end of the MS is extracted below.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతతిన్నదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు. ప్రాచీనము

పూర్వము వలె.

ఈ గ్రంథము చివర వ్రాయసకానిపేరును, గ్రంథ లేఖనకాలమును తెలుపఁగల పద్యమొకటి యలదు.

౭ సరవితో నక్షయసంవత్సరనిజన
భోమాసశోధపక్షామలదశ
మీసూర్యసంభూతవాసరంబునకు శృం
గారకవికులసాగరశశాంకుఁ
డనఁదగు శ్రీవేంకటావనీగీర్వాణ
వరతనూభవుఁడు పవనజసత్కృ
పాలబ్ధకవితావిభవుఁడు సద్రాజశే
ఖరవిలాసం బను కావ్య మాన్తె

౮. నెఃమితో వేంకటాఖ్యుండు సలలితముగ
వ్రాసెఁ బూర్వపు పద్ధతిఁ జేసి దీని
వ్రాసి చదివిన వినిన విరాజితముగఁ
బాలనము సేయుచుండుఁ బార్వతివిభుండు.

---

## No 694. రాజశేఖరవిలాసము.

## RĀJASĒKHARAVILĀSAMU.

Substance, palm-leaf. Size, 18 × 1¾ inches. Pages, 76. Lines, 7 or 8 on a page. Mode of writing, fair but incorrect. Condition, fair. Appearance, fair.

Complete.

Same work as the above.

This seems to be the original of the MS. described under No. 691 ante.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులున్నవి. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతము లేదు.

పూర్వ వర్ణిత గ్రంథమే.

---

## No 695. రాధాకృష్ణవిలాసము.

## RĀDHĀKRSNAVILĀSAMU.

Pages, 68. Lines, 21 on a page. Mode of writing, good but quite faulty. Condition good. Appearance, old. Contains omissions here and there.

Begins on fol 273*b* of the MS. described under No. 608 of the D.C. Tel. MSS.

Begins in the course of the first Åsvāsa and breaks off in the third Åsvāsa

This is a Prabhandha wherein the love incidents relating to Śrīkṛṣṇa and Rādha are described The author of the work is Kṛṣnadāsa, son of Vēnkatadāsa of Kṛsnadāsa's family

**Beginning:**

సీ. . . . . . . . . . లు సడల్చి
విఫలబలయుక(త)మగుచున్న విల్లువిఱచి
వారుఁ కునెల్ల నతిసాహ . . . .
. . . . . . కదైత్య
హరణరణశౌర్యధుర్యుఁడయ్యెడ మెలంగె.

క. కువలయభారోత్తారుఁడు
కువల . . . . .
. వఁయనాగేంద్రజనా
కువలయ దానవులఁ గుండె గుబులు మనంగా.

**Colophon:** – At the end of the Second Åsvāsa

ఇది శ్రీ గిరినాథవరణారవిందవందనానంద కృష్ణదాసవంశనందన వనమందార వేంకటదాసకుమార శుకశ్యామలాకరుణావశాంకనామృత జనిత వివిధభాషాసంగతి సాహిత్యకవిత్వ శారదావిలాసకృష్ణదాసప్రణీతంబైన గీతగోవింద రసాలంకృత రాధాకృష్ణవిలాసంబను మహాప్రబంధంబున దు ద్వితీయాశ్వాసము.

**End:**

చ అని యమునాతటీపులినహారికుంజములోన నందనం
దనుఁడు నవచ్ఛదంబున తల్ప మొనర్చి వసించి రాధికా
గనుఁగొనఁగోరుచుం జెలియఁగన్గొలఁజూ . . .
. . . . . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసమునందుఁ బ్రారంభించి మూఁడవయాశ్వాసమునఁ ఖిలీఅనది. ప్రాఁత యందముగానున్నది. తప్పులు మెండు. గ్రంథపాతములు కలవు. శైథిల్యము లేదు

ఇందు రాధాకృష్ణుల శృంగారవిహారము వర్ణితము. కర్త, కృష్ణదాసకవి. వెంకటదాసుని పుత్త్రుఁడు.

No 696. రాధాకృష్ణవిలాసము.

RĀDHĀKṚṢṆAVILĀSAMU.

Substance, palm-leaf. Size, 15 × 1⅛ inches. Lines, 5 on a page. Mode of writing, not good and not correct Condition, injured Appearance, old.

Incomplete

This is the original of the MS described above

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిదికాదు తప్పులు గలవు.
శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది పూర్వవర్ణిత గ్రంథపు మాతృక.

No 697. రాధామాధవసమాగమము.

RĀDHĀMĀDHAVASAMĀGAMAMU

Substance, paper Size, 12½ × 8¼ inches Pages, 111 Lines, 18 on a page Mode of writing, good but contains mistakes Condition, good Appearance, old

Begins on fol 1*a*, the other works herein are Bobbilikatha 60*a*, Kumārarāmunikatha 122*a*, Kāmammakatha 198*a*, Śirānta grāmadēvālaya Pūrvōttaramu 226*a*, Erragaddapāti pōtlāta 236

Complete in three Āśvāsas

This Prabandha describes the amorous sports of Śri Krsna and Rādhā The author is Edavalli Venkatapati, son of Vengamamba and Kiccamantri of Haritasa gōtra

A note, probably of Mr Brown, which appears on the frontispiece of the MS., is as follows —

"This is copied from a manuscript in the Mackenzie Library The poem is extremely rare"

**Beginning:**

ఉ. శ్రీ మహిమన్నిజాంకమునఁ జేర్చి సమున్నతసింహపీఠిపైఁ
దానరహస్తకోటినిభధామమునన్ గొలునాదరించియున్
వేమఱుఁ దగ్గఱం బొటనవ్రేలను గూర్చినకేలుఁ జూపు మా
రాముఁడు ప్రోచుఁగావుత నిరంతరమైనకృపన్ జగంబులన్.

* * * *

క. హరితుఁడు శాంతగుణంబుల
హరిరుచిరుఁడు భవ్యతరమహత్త్వముచేతన్

హరతులికుండు వాక్పుమనో
హరతులితుండు సృష్టినిర్ణయము గావింపన్.

• • • •

క. ఇమ్మగునయ్యార్వేలకు
లక్ష్మన నెడపల్లికులకళానిధి యనుచున్
దమ్మనమంత్రి జనించెం ది
రమ్మగ నాకరమునందు రత్నముకరణిన్

క. ఆమంత్రికిఁ దనయుండగు
ధీమంతుఁడు వేంకటప్ప తిమ్మాజమ్మన్
నేమమ్మున పరిణయించెను
ప్రేమ న్మరవైరి సిరి వరించినకరణిన్.

సీ. ఆదంపతులకు మహానుభావుఁడు నాగ
రాజు జనించి యవ్యాజభవ్య
లక్షణ నైన కామాక్షమ్మను వరించి
ముచ్చటతోఁ గాంచెఁ గిచ్చ నార్య
నాకిద మంత్రి ధర్మాత్ముఁడై వెంగమాం
బిక ధర్మపత్నిఁ గాఁ బెండ్లియాడె
నాయమ్మగర్భమునందుఁ బుట్టినవాఁడ
మాననీయులకు లోనైనవాఁడ
వేల్పుఁ బరదైవతంబుగాఁ దలఁచువాఁడ
కోరి సద్గురుకరుణఁ గైకొన్నవాఁడ
ఆర్యజనులకు సమ్మతమైనవాఁడ
దిమ్మతప్పరుఁడను వేంకటాహ్వయుఁడను.

క. భూతేశదత్తచాపక
ఖ్యాతతభృగురామగర్వదళిరామునకున్
శ్రీతారకనామునకున్
సీతారామునకు వదనజితసోమునకున్.

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనినరాధామాధవసమాగమం బనకుఁ గథారంభ క్రమం బెట్టి దనిన.

క. శ్రీలలితఫలితచూతర
సాలాదిమహామహీరుహాశ్రమవాసా
లోలల్ల్రహ్మర్షికథా
జాలాహార్ణ్ణశము నైమిశము మహి నలరున్.

**End:**

క. అని సూతుఁడు వివరించిన
విని శౌనకముఖ్యమునులు విమలాత్మకులై
అనిశముఁ గృతిపూజా
న్వనులైరి పరమసంతోషమునన్.(?)

క. కల్యాణాంబుధారా
కల్యాణాహార్యనిగ కంధిగభీరా
కల్యాణమయాకారా
కల్యాణాకాంక్షమాణకవిమందారా.

**Colophon.**

ఇతిశ్రీహయగ్రీవదేవప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రమాధురీధు రీణభాషావిచిత్రకిచ్చనామాత్యపుత్ర నిశ్శంకనిజాంక వేంకటపతిప్రణీతం బైనరాధామాధవసమాగమం బను మహాప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. మూఁడాశ్వాసములు. వ్రాఁతయందమైనది. తప్పులు కలవు గ్రంధపాతము గలదు శైథిల్యము కానరాదు

ఇందు రాధాకృష్ణుల శృంగారవిహారాదికము గాథవర్ణింపఁబడినది. కర్త ఎడపల్లి వేంకటపతి కిచ్చమంత్రికిని వేంగమాంబకును బుత్రుఁడు హారితసగోత్రుఁడు ఇది రామాంకితము

No **698** రాదామాధవసమాగమము.

RĀDHAMĀDHAVASAMĀGAMAMU.

**Substance,** palm-leaf. **Size,** 15¾ × 1½ inches **Pages,** 148 **Lines,** 5 on a page **Mode of writing,** good but not correct **Condition,** injured. **Appearance,** old

**Complete.**

**This is the same work as the above**

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బిన్ననిది తప్పులు కలవు. శైథిల్యము కలదు గ్రంథపాతము కాన్పింపదు.

ఇది పూర్వ వర్ణితగ్రంథమే.

---

No 699. రాధామాధవసంవాదము.

RĀDHĀMĀDHAVASAMVĀDAMU

Substance, paper Size, 9¾ × 6½ inches Pages, 178 Lines, 22 on a page. Mode of writing, fair but faulty Condition, good Appearance, old Written on one side of paper Variations in reading are noted on the blank pages

Begins on fol 1a. The other work herein is Surābhāndēsvaramu 97a

Complete but without the introductory portion

This is the same work as the one described under R No 339 (b)

(వి-వి.)—

కృత్యవతరణిక లేదు. వ్రాంత యంతయందమైనది కాదు. తప్పులున్నవి. పాఠాంతరము లెదుటి పత్రములపై నెక్కింపబడినవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం. 339(బి) రున వర్ణింపబడిన గ్రంథమే.

---

No 700 రాధామాధవసంవాదము

RADHĀMĀDHAVASAMVĀDAMU

Substance, palm-leaf Size, 16⅞ × 1⅜ inches Pages, 62. Lines, 7 on a page Mode of writing, bad and incorrect Condition fair Appearance, old

Wants the prefatory portion

Same work as the above

The date of transcription and the name of the scribe are given below as found at the end of the MS

(వి-వి.)—

అవతారిక తప్ప తక్కినదంతయుం గలదు. వ్రాంత మంచిదికాదు తప్పులుమెండు శైథిల్య మించుకకలదు. గ్రంథపాతము లేదు.

పూర్వము వలె.

గ్రంథాంతమున "యీశ్వరనామ సంవత్సరమార్గశిరశు 3గురు వారాన భట్టిప్రోలు వెంకటనరుసరాధామాధవ సంవాదంసంపూర్ణంగా వ్రాశెను" అని యున్నది.

No 701. రాధామాధవసంవాదము.

RĀDHĀMĀDHAVASAMVĀDAMU.

Substance, palm-leaf Size, 14 × 1⅛ inches Pages, 88 on a page. Lines, 5 or 6 on a page Mode of writing, fair but quite erroneous Condition, fair Appearance, old

Complete except the prefatory portion.

Same work as the above

The date of transcription as found at the end of the MS. is given below.

(తె-వి.)—

గ్రంథావతరణిక లేదు. వ్రాఁత యంతతిన్నగ లేదు. తప్పులు మెండు. శైథిల్య గ్రంథపాతము లంత గానఁబడవు.

ఇదియుఁ బూర్వవర్ణితగ్రంథమే

"విరోధికృతినామ సం॥ చైత్రశు 2 లు గురు యీ రాధామాధవ విలాసం సంపూర్ణం . . ."

అని గ్రంథాంతమందున్నది.

No 702. రాధామాధవసంవాదము.

RĀDHĀMĀDHAVASAMVĀDAMU.

Substance, palm-leaf Size, 14 × 1⅜ inches Pages, 144 Lines, 7 on a page Mode of writing, bad and mostly incorrect Condition, much injured Appearance, old Many leaves are broken here and there.

Complete

Same work as the above

(తె-వి.)—

సమగ్రము. వ్రాత లెడ్డది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము మెండు. గ్రంథపాతములు గలవు.

పూర్వము వలె.

## No 703 రాధామాధవసంవాదము.

## RĀDHĀMĀDHAVASAṀVADAMU.

Substance, palm leaf Size, 18 × 1¼ inches Pages, 89 Lines, 5 on a page. Mode of writing, illegibly written in the mode of Kanarese characters and incorrect. Condition, fair. Appearance, old

Begins on fol 66a The other works herein are Āndhranighaṇṭu 1a, Dvirūpakōśamu 31a, Alankārādilakṣaṇasaṅkaramu 40a, Kāvyālankāracūḍāmaṇi 55a Chandōvyākaraṇādisaṅkaramu 111a, Śṛṅgāranaiṣadhamu 132a

Incomplete ; contains from the beginning of the story

Same work as the above

The name of the scribe and the date of transcription are given below in Telugu, as found at the end of the MS

(వి-వి )—

కథా ప్రారంభమునుండి కడపటివఱకుఁగలదు. వ్రాఁత కన్నడపుఁ దీరుగానున్నది. తప్పులత్యధికముగా నున్నవి. శైథిల్య గ్రంథపాతములంతగా లేవు.

గ్రంథాంతమున

" ప్రభవ సం॥ చైత్రశుద్ధ ౧౧ . . . ధారాపురం . . . సీతారామయ్య మనుమఁడు, సుబ్బయ్య కుమారుడు సీతారామయ్య వ్రాసిన . రాధామాధవము . . " అనియున్నది.

## No 704 రాధామాధవసంవాదము.

## RĀDHĀMĀDHAVASAMVĀDAMU

Pages, 135 Lines, 16 on a page Mode of writing, fair but incorrect. Condition, good. Appearance, old.

Begins on fol. 72a of the MS described under No. 461 of the D C Tel MSS

Complete but without the prefatory portion

Same work as the above

(వి-వి.)—

కృత్యవతరణిక తక్కఁ దక్కిన గ్రంథమంతయుఁ గలదు. వ్రాఁత యందమయినది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

## No 705. రాధామాధవసంవాదము.

## RĀDHĀMĀDHAVASAMVĀDAMU.

Substance, paper. Size, $8\frac{1}{8} \times 6\frac{3}{8}$ inches Pages, 15 Lines, 39. Mode of writing, good but not free from mistakes. Condition, fair Appearance, old.

Begins on fol 1a The other work herein is Vēdāntasāramu 8b.

The story breaks off in the beginning of the third Āśvāsa.

Same work as the above

(ఏ-ఏ.)—

కృత్యవతారిక లేదు. మూఁడవ యాశ్వాసము మొదట నంత వ్రాయఁబడినది. తప్పులు లేక పోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వము సరి.

## No 706. రాధామాధవసంవాదము (సటీకము).

## RĀDHĀMADHAVASAMVĀDAMU (WITH MEANING).

Substance, paper Size, $12\frac{5}{8} \times 8$ inches Pages, 100 Lines, 22 on a page Mode of writing, good but faulty Condition, good Appearance, old Foll 54b to 62 and 96 are left blank.

Complete but without the preface

The text is the same as the one described above This poem was dedicated to Mugadala Ramadāsāmātya, a chieftain of Pralayakāvēri Paṭṭana (Pulicat) and son of Lakṣmāmba and Kṛṣnamantri. This MS contains also brief notes on the text in colloquial Telugu. From the following English note written apparently by Mr. C P. Brown at the beginning of the MS, it is seen that this commentary was prepared under his direction by Pamidipāti Vēnkatanarasayya

"The Rádhá Mádhava Samvádam
or
The Loves of Radha and Crishna
an original Telugu Poem
by వెలిదిండి తిరువేంగళయ్య Velidandi Tiruvēnga'ayya *

* It is not by Tiruvengalayya but by his son Venkatapati.

a critical edition
illustrated with an ample commentary
prepared under the direction of
Charles Philip Brown
by
P Venkat Narasu పమిడిపాటి వెంకట నరసయ్య
1829"

**Beginning**·

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నేరచియించం బూనిన రాధామాధవసంవాదం బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన.

చ. అనవరతప్రబోధకర మైన మిథిలాపురమందు నొకనాఁ
డనఘుఁడు ధర్మదక్షుఁ జనకుఁ డాప్తులతో సుఖగోష్ఠి నుండి సొం
పున సకలావతారములపుణ్యకథ ల్వివరింప వించుచుం డాఁ
జనవున వేఁడెఁ గృష్ణుకథ సత్యసంధుఁ శుకయోగిరాయనిన్.

టీక. నిత్యమైనట్టువంటి జ్ఞానవంతులు గలిగినట్టువంటి మిథిలయనేపట్టణమందు ఒకదినమందు పాపరహితుడున్ను సమర్థుడు నైనట్టువంటి జనకమహారాజు విద్వాంసులతోకూడా సుఖకరమైనట్టువంటి సంతోషమైనసభయందు కూర్చుండి విలాసముగా శుకయోగీంద్రుడు సమస్తమైన అవతారములయొక్క కథలను జెప్పగా వినుచున్నవాడై ఆ జనకమహారాజు సత్యసంధుడైనట్టువంటి శుకయోగీంద్రునిగూర్చి స్నేహంచేతను కృష్ణస్వామివారిచర్యలను వేడుకొనెను అనగా చెప్పుమనుట.

* * * *

ప్రథమాశ్వాసాంతపద్యము :—

శా. శిక్షామాత్రఫలప్రద ప్రథయుకావేరీమహాపట్టణా
ధ్యక్షా శంకరపద్మనాభరఘునాథామాత్యగోపాలకా
దిక్షేమంకర సోదరాదరపదాత్మీయాభ్యవాఙ్మజరీ
సాక్షాన్నందకుమారపాదయుగపూజాలబ్ధభాగ్యోదయా.

* * * *

ద్వితీయాశ్వాసాంతపద్యము :—

మాలిని. సులభనవమహోజా సూర్యసంకాశతేజా
ఫలితహరిసుపూజా బంధుమందారభూజా
కలితసుకవిభోజా కాంతిసత్కీర్తిరాజా
లలితహితసమాజా లక్ష్మమాంబాతనూజా.

తృతీయాశ్వాసాదిపద్యము

క. శ్రీకరవరవైభవని
త్యాకమలానాథమృదుపదాంబుజభృత్యా
యాకారవిజితనాస
త్యా కృష్ణాపన్న రామగాసామాత్యా.

**End:**

మాలిని. మగదలకులధీరా మానినీచిత్తచోరా
యగణితగుణహారా యరిరాధాకుమారా
నిగమవిధివిహారా నిత్యసాఖ్యానుసారా
సగరభవగభీరా చారుశృంగారవీరా.

టీక. మగదిలకులమందుధీరుడైనవాడా స్త్రీలయొక్క మనస్సుకు దొంగవంటివాడా లెక్కకు మిక్కిలియైనటువంటిసుగుణములే భూషణములుగా గలవాడా యాచకులకు రాధకుసాకుడుకుమారుడైనటువంటి కర్ణుడివంటివాడా వేదములయొక్క విధానమందు సంచరించేవాడా శాశ్వతమైనటువంటిసౌఖ్యముయొక్క అనుసరణముగలవాడా అనగా మోక్షమందు ఆసక్తికలవాడని భావము। సముద్రమువంటిగంభీరముగలవాడా అనగా తనమనస్సుయొక్క లోతును తెలియనియ్యనివాడనిభావము మనోహరమైనటువంటిశృంగారముగలవాడా వీరాఅనగా పరాక్రముగలవాడా.

**Colophon:**

గద్య. ఇది శ్రీవేణుగోపాలవరప్రసాదలబ్ధశృంగారకవిత్వవైభవవెలిదండలిరువేంగళార్య తనూభవవిద్వజ్జనవిధేయవేంకటపతినామధేయప్రణీతంబైన రాధామాధవసంవాదంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

కృత్యవతరణికతప్పదక్కినదంతయు సంపూర్ణముగఁగలదు. వ్రాంత బాగుగానున్నది. తప్పులు కలవు. శైథిల్య గ్రంధపాతము లంతగా లేవు.

ఇందలిమూలము పూర్వోక్తగ్రంథమే. ఈ మూలగ్రంథము మగదలరామదాసామాత్యునికిఁ గృతియీయఁబడినది. ఇతఁడు ద్రళయకావేరీ పట్టణాధిపతి. లక్ష్మమాంబాకృష్ణమంత్రు లితనితలిదండ్రులు. టీక ప్రతిపదమునకు లేదు. దండాన్వయముతీరున నున్నది. వమిడిపాటి వెంకటనరసయ యనునాతఁడు మే॥ బ్రౌన్ దొరవారియుత్తరువునను

రించి 1829 వ సంవత్సరమున నీ టీకను వ్రాసిన గ్రంథముఖపత్రమున నాంగ్లభాషయందు మే॥ దొరవారిచేత వ్రాయఁబడియున్నది. ఈ టీక వాడుకభాష నున్నది.

## No 707. రాధికాసాంత్వనము.
## RADHIKĀSĀNTVANAMU.

Substance, paper Size, 11$\frac{3}{8}$ × 7$\frac{3}{4}$ inches Pages, 143 Lines, 26 on a page Mode of writing, good but not free from mistakes. Condition, good. Appearance, old

Complete in four Āśvāsas

An amorous poem describing the troubles of Śrī Kṛṣṇa in pacifying the indignant Rādhā and his amorous sports with her as well as with her adopted daughter Iḷā. The work is also known as Iḷādēvīyamu. The author of the work is Muddupaḷani, daughter of Muttyālu (father and Pōṭi and a disciple of Vīrarāghavadēśika of Tirumala Tātārya family She was also presented with many jewels, valuable sarees, etc by Pratāpasiṁha, son of Tulajēndra of the Bhōsala family and king of the Chola kingdom She is also the author of Saptapadulu—vide R. No. 221(c) of the Triennial Catalogue of M S, Vol II, Part 3

**Beginning:**

ఉ. శ్రీలుఁ జెలంగురాధికను జెల్వరొ యిల్లెల రూపురేఖలం
బోలుదు రే పడంతు లన మోహపుటాలిని యిప్పు డెన్నడో
హేళిం నన్నుఁ గూర్చి యని యొగ్గిన యచ్చెలిఁ గౌఁగిలించుగో
పాలునిఁ జిన్నికృష్ణునిఁ గృపాళునిఁ గొల్తు నభీష్టసిద్ధికై.

* * * *

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవిపురస్కారంబును కుకవితిరస్కారంబునుం గావించి యొద్దిమేలయు నొకశృంగారప్రబంధంబు నిబంధింపం దలంచి హరివాసరంబున శ్రీహరిం బ్రార్థించి మన్నిశాంతంబున నిదురింపుచున్న నన్నిశాంతంబున.

సీ. . . . . . . . .

ప్రతి యొలయంగనిదివ్యరూపంబుతోడ
సొగసు గనుపించు మవ్వపుసొంపుతోడ
రాధికామణి నైదడ నమణఁ బూని
చిన్నికృష్ణుఁడు కలను బ్రసన్నుఁ డయ్యె.

తే. చిన్నికృష్ణుఁడ నే నాదుచిత్తమునకు
సమ్మతం బైనరాధికాసాంత్వనంబు
తగ నొనర్ప మదీయాంకితముగ నీవు
లలితగుణపేటి శ్రీముద్దుపళని బోటి.

వ. అని యానతిచ్చి యంతర్ధానం బగుటయు నేను నిదురమేల్కాంచి యీశుభస్వప్నం బెవ్వరితోడ విన్నవించెద నని యూహించి యుభయవేదాంతప్రతిష్ఠాపనాచార్యుండును నిరుపమౌదార్యగాంభీర్యధుర్యుండును పాషండషండగిరితటమహాఖండలుండును పాలితభక్తమండలుండును తిరుమలతాతాచార్యవర్యకులకలశపారావారతారారాడారుండును మదీయపూర్వజన్మతపఃఫలసారుండును సుగుణాభిరాముండును నగు వీరరాఘవదేశికసార్వభౌముసన్నిధానంబున కరిగి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తత్కటాక్షంబును గాంచి యాశుభస్వప్నంబు విన్నవించిన దత్సన్నిధానంబునం గల సకలకళావల్లభు లగువిద్వజ్జనంబులు నన్నవలోకించి సాక్షాచ్ఛ్రీమన్నారాయణాపరావతారుం డగువీరరాఘవధీరుచరణారవిందంబు లాశ్రయించినదాన వగుటం జేసి దేవదేవుం డగు శ్రీకృష్ణదేవుండు సాక్షాత్కరించె దీన నీకు నధికశ్రేయఃప్రాప్తి యగు నదియునుం గాక.

సీ. ఏరాజు కువలయం బెల్ల రంజిలఁ జేసి
 జైవాతృకాఖ్య నిచ్చలుఁ దలిర్చు
ఏలోకబాంధవుం డిలఁ దమంబు లడంచి
 చక్రప్రమోదంబు సంఘటించు
ఏఘనుండు శరంబు నేవేళ గురియించి
 పరవాహినుల నెల్ల భంగపఱచు
ఏయాశుఁ డార్యావనాయత్తమతిఁ గాంచి
 కీర్తింప సర్వజ్ఞమూర్తి యాను

వాఁడు నృపమాత్రుఁడే రఘూద్వహదయాప్ర
వాహవర్ధితభోసలాన్వయపయోధి
సోమ తుళజేంద్రవరతనూజుండు శ్రీప్ర
తాపసింహుఁ డమాపాలతల్లజుండు.

తే. ఆమహారాజుకృపఁ జెందినట్టి నీకు
నిట్టి భాగ్యంబు లద్భుతం బేమి తెల్ప
సార మగు నీదు విస్తారచర్య లెల్ల
వినుము వినుపింతు మని యిట్టు లనిరి కరుణ.

* * * *

తే. ఆమహీనాథుపదపద్మమందుఁ బుట్టి
సురుచిరఖ్యాతిఁ గనె నీతి శూద్రజాతి
దాన నయ్యన్వయ మెలంగె దానకర్ణుఁ
డితఁడె యం చను జను లెన్నఁ జతురుఁ డగుచు.

తే. అతఁ డెంతయుఁ గాంచెఁ జెంగ తిమ్మన
నతుల యుగము ద్రుతంజినాయకుని బ్రేమ
నాడి బొంకని వాని ముత్యాలుగునని
దండినాయకి వారల దతుగొనియె.

* * * *

క. ఆమద్రుతంజినాయకి
ప్రేమను గౌను కరయెఁ దీవె పిరిఁ బడసె సర్వ-
భూమీశు లెంచ దగు నఖ
రామాద్భుతసుగుణమణిని రామామణినిన్.

సీ. ఏరామ గట్టించె నిదె యగ్రహారంబు
పుడమి రామాంబాఖ్యపుర మనంగ
నపర నైధన్య మవ్వాలయం బొనరించి
తిరముగాఁ గ శివప్రతిష్ఠ జేసె
నెంచి యేపుణ్య పెట్టించె నంపనవలి
కొలువేఁ బిదు లెత్తి కొమరు మిగుల
నేమాన్య జీవనం బెసఁగఁ దటాకంబు
ఘటియించె సేతుమార్గంబునందు

నేటి యెన్నటె గండరకోటలోన
మఱియు నిత్యాన్నదానాదిమహిమలంది
పార్వతీశుల నిత్యోత్సవము లొనర్చె
నట్టి రామామణి ధాటి నలవె పొగడ.

సీ-గీ. . . . . . .

అనఁగ ననువొందు బ్రహ్మవిద్యాప్రవీణ
సరసఁ దిరుమలతాతయాచార్యపాద
తోయరుహమత్తచంచరీకాయతాత్మ
పాలితాశ్రితజనుఁడు ముత్యాలుఘనుఁడు.

తే. అట్టిముత్యాలుఘనుఁడు తాఁ జెట్టఁబట్టెఁ
దనకు ననుకూల మగునట్టిధర్మపత్ని
యానఁ దెంచును మాణితానూనసుగుణ
పేటి మేటివధూటి శ్రీపోటిబోటి.

* * * *

సీ. సాహిత్యవిద్యావిశారదశారద
యె యున్ను పళలి నానచురు నిన్ను
గురుతరంబై తన్ను గుణగణప్రౌఢి వే
లాయుతుండైన వేలాయుధాఖ్య
భరతశాస్త్రాభావభావజగురుఁడు నాఁ
గొమరు చెందెడు ముద్దు కొమరవరుని
రూపవిభ్రమకళారూఢి నెంతేయు రతీ
దేవి యా ముద్దులక్ష్మీసధాటి
బుద్ధి నల్గారు ముద్దైముద్దయామ్య
డీటు లేనట్టిపద్మానశీలలామ
చలివిమీఱు రామస్వామి నెమ్మిఁ గాంచె
మేటిముత్యాలుపోటి వధూటివలన

సీ. చెన్నొందు మరంభ గాకున్న చోను బ్రతాప
సింహేంద్రుఁ బెంపునఁ జెంద నేల

* * * *

సీ. . . . . . . . . . .

నీదె మతియుక్తి పరికింప నీదె శక్తి
నీదె నెలుపద్దు సరయుఁగా నీదె ముద్దు
సరసముగఁ జేసి రాధికాసాంత్వనంబు
భక్తి హరి కిమ్ము శ్రీముద్దుపళని బోటి.

వ. అని నియోగించిన నేనునుం బ్రబంధనిబంధనోద్యుక్తుండనై.

క. శ్రీకృష్ణదేవునకుఁ గరు
ణాకరచారిత్రవిలసదనుభావునకున్
గోకులజప్రియభావున
కాకృతిజితశంబరార్యహంభావునకున్

*  *  *  *

సీ. మునినాథ హరికథ ల్వినను నేను బొందుగా
వీనులవిందుగా వింటినందు
నందుతోఁ బుట్టి గోవిందున కత్తయై
వరగుణాకర యన వఱలు రాధ
తా నెత్తి పెంచఁగాఁ దగుఁ గ్రాపతి పెండ
వడి నేఁడు బలుకారుబారు చేసి
గోపాలదేవుతోఁ గోపించె నపు డెట్లు
దక్షిణనాయకోద్ధతుఁడైన
దేవకీసూనుఁ డానారిఁబేరు తీర
తీరుగా నేలె నని యింపు దేరనటుల
నాసతీచర్య బహుసాధనమతిని
విని కృతార్థుఁడ నయ్యెద విమలహృదయ.

**End**.

శా. శ్రీలక్ష్మీముఖపద్మషట్పద తనుశ్రీరమ్యనీలాంబుదా
లీలామానుషవిగ్రహా ప్రమద లేలీహానశయ్యాస్పదా
కాళిందీతటకేళికోవిద మహాకంసాదిదుష్టాంతదా
శార్ఙ్గీయోగకరత్నరంజితపదా కౌంతేయధైర్యప్రదా.

క. సారగదాధారసదా
చారసదాతనవినూత్న చారుతరోద్య
న్నారకదాకారయుతా
ధీరనుతాపారచరిత ధికృతదురితా.

మత్తకోకిల.—నాగపాలకనాగదాలకనాగఫాలకవాహనా
నాగధీశ్వరనాగహీశ్వరనాగఈశ్వరగాహనా
యోగచారణయోగధారణయోగకారణసాహనా
భోగిశోషణభోగిపోషణభోగిభూషణమోహనా.

**Colophon:**

గద్య. ఇది శ్రీచిక్కకృష్ణరుణాకటాక్షవీక్షణక్షణ ప్రవర్ధమానానూన శృంగారరసప్రధాన సంగీతసాహిత్య భరతశాస్త్రవిద్యాపారంగ శ్రీమత్తిరుమలతాతయాచార్యపదారవిందమిళిందాయమాన చోళసింహాసనాధ్యక్షప్రతాపసింహమహారాజబహూకృతానేక చామీకరాంబరాభరణ ముత్యాలుగర్భశుక్తిముక్తాయమాన ముద్దుపళని ప్రణీతం బైన రాధికాసాంత్వనం బను మహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. నాల్గాశ్వాసములు. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈ శృంగార ప్రబంధమున శ్రీకృష్ణుడు కుపిత యగు రాధికాదేవి ననునయించి శృంగారవిహారము లొనర్చుకథ వర్ణింపఁబడినది. కర్త "ముత్యాలు" అను నాయికకూఁతు రగు ముద్దుపళని. వేశ్య. తిరుమల తాతాచార్యవంశజుం డగు వీరరాఘవదేశికుల శిష్యురాలు. చోళదేశాధీశుం డగు ప్రతాపసింహమహారాజుచే ననేకవస్త్రభూషణాదులను బహుమతిగాఁబడసెను. ఈ గ్రంథకర్త్రిని గురించి ఆర్. నె 221 C యన చూడనగును.

---

## No. 708 రాధికాసాంత్వనము.

## RĀDHIKĀSĀNTVANAMU.

Pages, 205. Lines, 17 on a page. Mode of writing, good but faulty. Variations in reading are noted. English notes written by Mr C P Brown are found here and there throughout the MS.

Begins on fol 156a of the MS described under No 351 ante.

Complete.

Same work as the above.

The following is the note of Mr C P Brown written at the beginning of the work —

"The Radhica Swantanam"*
or
The melting Soul of Radhica (or Ila)
Adopted Daughter of Rad'ha,
favourite mistress of Crishna

An amatory poem written by Palani, a dancing girl, mistress to the Raja of [Tanjore] named Vira Pratapa Simha

---

* The name of the work is "Radhikasantvanamu" and not "Radhikasvantanamu". The title adopted by Mr Brown is wrong.

This poem is excessively rare I at last obtained three manuscripts all imperfect but luckily deficient in different places, and from third Vencat Narsu under my directions formed this complete edition

It does not seem probable that the lady herself composed the whole poem; parts of which display much learning Her name and the other names she introduces as her relations appear to be Mahratta, utterly different from Telugu appellations. Her tutor, Viraraghavachari, probably assisted her, but the composition in other parts evinces a female hand; and it may be observed that she uses only the changing metres those being the easiest to compose in She also uses the easiest and loosest rhymes such as అఖండయతి and వబయోరభేదయతి, etc"

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యగ్రంథ పాతములు లేవు. పాఠాంతరము లెక్కింపఁబడినవి. బ్రౌనుదొరవా రాంగ్లటిప్పణి నందందుఁ బంతులనడుమ వ్రాసియున్నారు.

పూర్వము వోలె.

బ్రౌనుదొరవారు గ్రంథముఖపత్రమున నాంగ్లభాషయందుఁ జిన్న యుపోద్ఘాతమును వ్రాసియున్నారు.

## No 709. రాధికాసాంత్వనము.

## RĀDHIKĀSANTVANAMU

Substance, paper Size, 8 × 6¼ inches Pages, 236 Lines, 17 on a page Mode of writing, good but contains mistakes Condition, good Appearance, old Variations in reading and Brown's English remarks are noted throughout

Complete

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు. పాఠాంతరములు బంతులనడుమ నెక్కింపఁబడినవి. మే॥ బ్రౌనుదొరవారి యాంగ్లటిప్పణి యక్కడక్కడ చూపట్టుచున్నది.

పూర్వము వోలె.

## No 710. రాధికాసాంత్వనము.

## RĀDHIKĀSĀNTVANAMU

Substance, palm-leaf Size, 15⅜ × 1¼ inches Pages, 30 Lines, 7 on a page Mode of writing, fair but faulty. Condition, much injured Appearance, very old

Contains the first three Āśvasas without the preface

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణిక తప్పఁదక్కిన తొలిమూఁడాశ్వాసములు గలవు వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పు లున్నవి. శైథిల్యమత్యధికము. గ్రంథపాతము కలదు. ప్రాచీనము.

పూర్వము వోలె.

## No 711 రాధికాసాంత్వనము, సటీకము.

## RĀDHIKĀSĀNTVANAMU WITH COMMENTARY

Substance, paper Size, 12⅜ × 8 inches Pages, 386 Lines, 23 on a page Mode of writing, good but not free from mistakes Condition, good. Appearance, old This was copied from the MS. described under the next two numbers.

Complete.

The text is the same as that described above The name of the author of this brief commentary which is written in colloquial Telugu is not given

**Beginning:**

ఉ॥ శ్రీలఁ జెలంగురాధికను జెల్వరొ ని న్నిల రూపురేఖలం
బోలుదురే పడంతు లన మోహపుటాలిని నిప్పుడన్నెదో
హేళిని నన్నుఁగూర్చి యనియగ్గినయచ్చెలిఁ గౌఁగిలించుగో
పాలునిఁ జిన్నికృష్ణునిఁ గృపాళునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

టీక. ఇళాఅనఁగా । ఓయిళాదేవి - సంపత్తులచేతను ప్రకాశిస్తూవుండే । అటువంటిరాధికనున్నూ । నిన్నున్నూ । చక్కఁదనముయొక్క రేఖలచేతను । యేపడంతులు - అనఁగా యెటువంటిస్త్రీలయినా । సమానము అవుదురే - పోలరు అనిభావము । అన - అనఁగా । యీ ప్రకారము కృష్ణస్వామిపలికితే । యిప్పుడుహేళిని - అనఁగా - కేళీవిలాసము

చేతను । నన్నుగురించి - మోహాపుటాలిని - అనఁగా నీవు మోహించి నముపంటి - రాధను స్తోత్రం చేస్తూవున్నావో అని । అలిగిన అచ్చెలి - అనఁగా - కోపం చేసినటువంటి ఆయిశను । ఆలింగనము చేసుకొన్నమం వంటిన్నీ । గోపులను కాసినముపంటిన్ని । దయగలిగినటువంటిన్ని । చిన్ని కృష్ణుని । అనఁగా । బాలకృష్ణస్వామిని । మిక్కిలి కోరికలయొక్క ప్రాప్తికొరకు సేవిస్తూవున్నాను.

**End:**

మత్తకోకిల॥ నాగపాలక నాగదాలక నాగఫాలకవాహనా
వాగధీశ్వర వాగహీశ్వర వాగనశ్వరగాహనా
యోగచారణ యోగధారణ యోగకారణసాహనా
భోగిశోషణ భోగినీషణ భోగిభూషణమోహనా.

టీక. గజేంద్రునిరక్షించినవాడా । నాగదాలక - అ. సర్పరూపముగానున్న అఘాసురుని భేదించినవాడా । పాములనుగొట్టే గరుత్మంతుండే వాహనముగా గలవాఁడా సరస్వతికి అధిపతి అయినబ్రహ్మయొక్కాను న్నూ సరస్వతియొక్కాను న్నూ । సర్పములకుదొరయయిన శేషునియొక్కాను న్నూ । వాక్కులయందు । అక్షయమైన । ప్రవేశముగలవాడా । యోగమునందు సంచారముగలవాడా । భోగిశోషణ। అ॥ కాళియాహిని కృశింప జేసినవాడా । భోగినీషణ । అ॥ మోహించిన స్త్రీలయందు । ఇచ్ఛగలవాడా । పాములుసొమ్ములుగా గలిగిన । శివుని మోహింపఁజేసినవాడా.

**Colophon**

ఇదిశ్రీ చిన్నికృష్ణ . . . . . రాధికాసాంత్వనంబను మహా ప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము సంపూర్ణము.

ప్రథమాశ్వాసాంతమున నుండు పైగద్యయొక్క టీక.

టీక. ఇది । శ్రీబాలకృష్ణునియొక్క । దయాసంబంధమైనమువంటి। క్రేగంటిచూపులచేతను । ప్రతి క్షణమందున్నూ । వృద్ధినిబొందుతూనుండే అమువంటిన్నీ । శృంగారరసమే ముఖ్యముగా గలిగినమువంటి । సంగీతమనేటిన్నీ । సాహిత్యమనేటిన్నీ । భరతమనేటిన్నీ । శాస్త్రములు మొదలైనమువంటి । చదువులయొక్క । తుదనుపొందినమువంటిన్నీ । శ్రీతిరుమలతాతయాచార్యులయొక్క పాదములనే తామరలకు । తుమ్మెద వంటి మనస్సుగలిగినమువంటిన్ని । చోళసింహాసనాధ్యక్షు । అ । చోళదే

శముయొక్క సామ్రాజ్యసింహాసనమునకు । అధిపతి । అయినట్టువంటి ప్రతాపసింహుఁడనే । మహారాజుచేతను బహుమానముచేయఁబడినట్టువంటి । అమితమైనట్టువంటి బంగారు వికారములైనట్టువంటి వస్త్రములున్నూ । సొమ్ములున్నూ । కలిగినట్టువంటిన్ని ముత్యాలు అనే నర్తకునియొక్క కడుపు । అనే । స్వాతిచిప్పకు । ముత్యమువంటి ముద్దుపళనిచేతను । చెప్పఁబడినట్టువంటి । రాధికాసాంత్వన మనే । మహాగ్రంథమునందు । . . . . ఆశ్వాసము.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత యందముగానున్నది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

మూలము పూర్వోక్తమయినదే. ఇందలివ్యాఖ్యానమును రచియించినవారెవరో తెలియదు. ఈ వ్యాఖ్య విరివియైనది కాదు. వాడుకభాషను వ్రాయఁబడినది.

## No 712. రాధికాసాంత్వనము, సటీకము

## RĀDHIKĀSĀNTVANAMU WITH MEANING

Substance, paper Size, 12 × 7⅝ inches Pages, 321 Lines, 20 on a page Mode of writing, fair but incorrect, written only on one side of the paper. Condition, much injured and worm-eaten Appearance, old Mr Brown's remarks in English are noted here and there on blank pages

Contains the first and the second Aśvāsas.

Same work as the above The following note, apparently in Mr Brown's hand, is found on the fly-leaf of the MS

The Ila Deviyam or
Radhica sāntwanam
With commentary

"This is the rough copy from which a fair copy has been taken"

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమ ద్వితీయాశ్వాసములు మాత్రము. వ్రాఁత యంత యందమయినదికాదు. తప్పులున్నవి. శైథిల్యమత్యధికము గ్రంథపాతము లేదు.

ఇది పూర్వవర్ణితగ్రంథముయొక్క మాతృక.

## No 713 రాధికాసాంత్వనము సటీకము.

## RĀDHIKĀSĀNTAVNAMU WITH MEANING

Substance, paper. Size, $11\frac{1}{4} \times 7$ inches Pages, 297 Lines, 20 on a page Mode of writing, fair but incorrect, written only on one side of the paper Condition, much injured and worm-eaten Appearance, old

Mr Brown's remarks in English are found here and there on the blank sides Contains the third and the fourth Ásvāsas

The MSS described under this and the previous number (712 and 713) form one complete edition

Same work as that described under No 711 ante

(వి-వి.)—

అసమగ్రము. తృతీయ చతుర్థాశ్వాసములు మాత్రము. వ్రాఁత యొక తరఁబడిగా నున్నది. తప్పులుగలవు. శైథిల్య మనల్పము. గ్రంథపాతము లేదు.

ఇదియుఁ బూర్వోక్తగ్రంథమునుగలసి యొక సమగ్రగ్రంథమగును. నె 711 రున వర్ణించిన గ్రంథమున కీ రెండును మాతృకలు.

## No 714. రామాభ్యుదయము.

## RAMĀBHYUDAYAMU.

Substance, paper Size, $12\frac{3}{4} \times 7\frac{7}{8}$ inches Pages, 397 Lines, 21 or 22 on a page Mode of writing, good but not quite correct. Appearance, old. A list of contents of the work is found in 14 pages at the end of the MS

Complete in eight Āśvāsas

This is a classical Prabandha describing the story of the Rāmayana composed by Ayyalurāju Ramabhadra Kavi, son of Akkāyāmatya, grandson of Parvata and the great grand son of Tippayamantri, who is said to be the author of the Ontimittaraghuvira sataka The author is a disciple of Mummadi Varadācārya This work was dedicated to Gobbūri Narasarāja, who was a ruler of Kandanōlu, Cinakotla, Dharmavaramu, etc, and who was the son of Obamāmba and Timmaraja and a nephew and son-in-law of Aliya Rāmarāja (the son-in-law of Krsnadēvaraya) This Gobbūri family is said to have belonged to the dynasty of Kalikālacōḍa The following Brown's note appears at the end of the work :—

"This new edition was completed in September 1850 C. P. Brown.

**Beginning :**

శా॥ శ్రీరామాకుచహారనాయకమణిశ్రీఁ జేయుసాకారత్వం
గాగం బైతగుమచ్చ వక్షమున భూకాంత (తా) స్థితిం జెల్వ సౌ
ఖ్యారూఢి న్వ్యలసిల్లువేంకటనగాధ్యక్షుండు రక్షించు గో
బ్బూగీతిక్ష్మనృపాలసింహు నరసింహార్యోత్తమ చూడామణిన్.

*　　*　　*　　*

తే. శబ్దశాసనసుకవి కంజలి యొనర్చి
యుభయకవిమిత్రునకు హస్తయుగళి మోడ్చి
శంభుదాస హుళక్కిభాస్కరులఁ దలఁచి
యాంధ్రవాగ్గుంభనకర్త నభినుతించి.
క. పరవస్తువంశరత్నా
కరకౌస్తుభసుప్రభావఖని నయనారుం
బరమగురుఁ దలఁతు ముమ్మడి
వరదాచార్యాంఘ్రివనజవందారుఁడనై.

వ. ఇట్లు . . . ఏనొకమహాప్రబంధనిర్మాణంబునకుఁ బ్రా
రంభించియున్న సమయంబున . హత్తుమువ్వరగండండును
. . కాశ్యపగోత్ర పవిత్రుండును . . . సరస
సభాజన కృతసభాజనభోజనపల్లి నారాయణాచార్య కైంకర్యపరా
యణుండును తాటకా నారాయణుండును . . అగు
గోబ్బూరి నృసింహుండొకనాఁడు . . . పేరోలగంబుండి
. . . యిట్లనియె.

చ. క్షితిపతి యెవ్వఁడైన నగు. గీర్తిప్రతాపుల (బు) పుణ్యకోటికిం
గృతిపతి యైనవాఁడె కృతకృత్యుఁడు గాన నొనర్పు సత్తసం
తతులకు నెక్కుడంద్రు కృతి దాశరథీతకథాసుధావమ
త్కృతకృతి రామభద్ర చెలికించవికోల్పు భవత్కవిత్వముల్.

వ. అని బహూకరించి కర్పూరతాంబూల జాంబూనదాభరణ ప్రత్యగ్ర
చీనిచీనాంబరంబు లొసంగిన నేనును . . . . .
రచియింపఁబూనితి తదీయ వంశావతారం బెట్టిదనిన.

*　　*　　*　　*

క. ఆరఘుపతివంశసుధా
నీరధికఁ గరికాలచోళనృపచంద్రుఁడు దు
ర్వారశరభిన్నవిమతా
కారుఁ డుదారుఁడు జనించెఁ గలియుగవేళన్.

ఉ. ఆకరికాలచోళవిభు నన్వయసంభవు లైరి యాత్మర
క్షాకుశలుండు భూపతిశిఖామణి భూపతిరాజు గంగరా
జాకృతపుణ్యశేఖరుల కాశ్రితలోకశరణ్యతేజముల్
గైకొన ధర్మమూర్తులకుఁ గల్గ నేర్తురె సాటివారిలోన్.

* * * *

క. ఆభూపతిరాజేంద్రుఁడు
ప్రాభవవిభవేంద్రుఁ గొండపార్థివచంద్రుని
భూభరణరతునిజబా
హాభాసురబలపరాక్రమాఢ్యులఁ గనియెన్.

* * * *

క. అవ్విభుఁడు గాంచె రూపునఁ
గ్రొవ్విరివిలుకాని ధన్యుఁగులమూర్ధన్యున్
జివ్వలను గెల్పుసిరిఁ గను
కవ్వడి నగుక్షాభవేంద్రుఁ గరుణోపేంద్రున్.

తే. అతనితనయుండు నిత్యాపాలితరయ(నయు?)ండు
వైభవము గాంచె సకలగుణాభిరాముఁ
డోబళా యని తను రాజు లభినుతింప
నోబళాధిపుఁ డలరె విఖ్యాతమహిమ.

* * * *

ఉ. ఆరమణీయకీర్తి యగునోబళరాజకుమారుఁ డోబరా
జౌర విలాసబోధ ధనురాగమసత్త్వసమృద్ధి బల్మి న
మ్మారు సనత్కుమారునిఁ గుమారు సమీరుని మీఱుఁ గేరు వే
మాఱు నదల్చుఁగొల్చునృపమాత్రుఁ డెయాసుచరిత్రుఁ డెన్నఁగన్.
ఉ. ఆనయశాలి గొబ్బురికులాగ్రణి యోబమహీవిభుండు ధా
త్రీనుతరామరాజు పెదతిమ్మనృపాలుని ముద్దుపట్టి యం (నం)
భోనిధిరాజకన్య సరిఁబోలినపుణ్యచరిత్ర భూమరు
ద్దీనకుటుంబపోషణవిధేయను గొండమదేవిఁ బెండ్లి యై.
ఉ. ఆసతియందు నోబవసుధాధిపచంద్రుఁడు గాంచెఁ బుత్రులన్
భూసురపాలనద్రవిణపుణ్యచరిత్రుల నోబపార్థివా
గ్రేసరు సర్వదిగ్విశదకీర్తినిధి న్నరసక్షితీశ్వరున్
భాసురనీతిభూషణుల బాంధవపోషణులం గృతార్థులన్.

క. వెండియు నోబక్షితిపతి
కొండదేవేరియందు రిపుభయదబలో
ద్దండభుజదండుఁ గనియెం
గొండనృపా. . . . . .

* * * *

మ. అలయోబక్షితిభర్త కోనేటిసిరంగాధీశుపుత్రీమణిన్
కులశీలంబును సత్యమున్ సుకృతమున్ గోత్రాసురత్రాణని
ర్మలధర్మంబును గల్గుశ్రీతిరుమలాంబం బెండ్లియై కాంచెఁ బు
త్రుల వర్ధిష్ణుచరిత్రులన్ సమరశత్రుక్షోణిభృజ్జైత్రులన్.

సీ. శ్రీపరాంకుశగురుశ్రీమత్కృపాలబ్ధ
శాశ్వతైశ్వర్యుఁ డేజనవిభుండు
వేంకటగిరిసత్యవీటికాముఖదుర్గ
రాజ్యధౌరేయుఁ డే రాజమౌళి
జారచోరవ్యథావారకాజ్ఞాచక్ర
పాలనాప్రౌఢుఁ డే పార్థివుండు
సంతతభగవదాచార్యభాగవతాంఘ్రి
కైంకర్యశాలి యేకలుషహర్త
యతఁడు నిరవధికధ్యానసతతభజన
నామకీర్తనహర్షితరామచంద్రుఁ
డొప్పు సౌభ్రాత్రమైత్రిసముజ్జ్వలాత్ముఁ
డోబభూమండలేశ్వరుం డురుబలుండు.

. . . .

ఉ. ఆనరసక్షితీంద్రుఁడు మహామహుఁ డాకులశేఖరాఖ్యుఁ డా
కోనేటికొండరాజమణికూతురు తిమ్మమదేవిఁ బెండ్లియై
దానపరాక్రమోన్నతుల ధన్యులఁ బుత్రులఁ గాంచె విష్ణుసే
వానయధైర్యశౌర్యముల వర్ధిలువంశపవిత్రులన్ మహిన్.

* * * *

ఉ॥ ఆకులశైలకీర్తి యగునాతనిసోదరుఁ డైనదానధీ
త్యాకలనార్కనందనుఁ డఖండితశౌర్యుఁడు మించె గంగరా
జాకరుణాధురంధరున కాత్మజుఁడై పొగడొందె దిమ్మరా
జాకులకర్తకుం దనయుఁ డయ్యెను గొండనృపాలుఁ డున్నతిన్.

శా. ఆరాజన్యశిఖామణుల్ సుతుల నా హ్లాదంబుతో...

శా. ఆరాజన్యశియందు నేపు రుదయంబై రిద్ధసత్యవ్రతో
దారు ల్తిమ్మవిభుండు వెంగళధరాధారాగ్రగణ్యుండు గో
బ్బూరిత్మావరచంద్రుఁడున్ దిరుమలాఖ్యుండౌట శేషుండుమం
దారత్మారుహపంచకంబు గలశోదన్వంతునందు న్వెలెన్.

* * * *

చ. అలయనఘుండు వెంగళధరాధిపచంద్రుఁడుదాత్తధీరతా
కులగిరి రామరాజు పెదకొండనృపాలునికన్యకామణిం
గులసతిగా వరించెఁ దగ గోపమదేవిని దత్కుమారుఁడు
జ్జ్వలజయశాలి చిన్ననరసక్షితిపాలకమౌళి రాజిలున్.

* * * *

క. వెంగళవిభుసంతతి యి
భ్భంగిన్ భాసిల్లె నానృపతితమ్ముఁడు భ
వ్యాంగుఁడు గోబ్బూరయ్యప
తంగకులోత్తంస మతినిఁ దరమే పొగడన్.

* * * *

ఉ. భావుకకీర్తి గోబ్బురినృపాలకుమారుఁలుధన్యులామర
గ్రావనిభుండు గొండయధరావరశేఖరుఁడున్ సముల్లస
ద్దీవిజతాహినాయకుఁడు తిమ్మమహీపతి చిన్నరంగపృ
థ్వీవరుఁడోబపార్థివుఁడు వేంకటరాజును దిమ్మధీరుఁడున్.

తే. ధరణి గోబ్బూరిరాజుసంతాన మిట్లు
చిగురుఁగొమ్మకుఁ జేవ యై చెలఁగె నతని
యనుజమణి యైనతిరుమలమనుజవిభుని
శుభచరిత్రంబుఁ బొగడ శేషునకుఁ దరమె.

* * * *

తే. ధీరుఁ డమ్మేటి గోబ్బూరితిరుమలయ్య
రమణఁ గోనేటిపినకొండరాజతనయ
రంగమాంబ వరించె వారాశితనయ
నబ్జనాభుండువలె హర్ష మావహిల్ల.

క. ఆరంగాంబకుఁ దిరుమల
శౌరికి సుతు లైరి కొండజనపతిరంగ
క్ష్మారమణగ్రామణి క
స్తూరీరంగక్షితీశచూడామణియున్.

వ. తదనుజుండు.

* * * *

ఉ. కోనేటిచిన్నతిమ్మనృపకుంజరునాత్మజ వెంగళాంబచం
ద్రాననఁ బెండ్లియై కనియె నౌబళభూవిభుఁ డౌబళేశ్వరున్
ధీనిధిఁ గొండభూవిభునిఁ దిమ్మనృపు న్నరసేంద్రు ఖడ్గధా
రానిహతాహితప్రకరు రామధరావరు లక్ష్మణాధిపున్

వ. పతతుకుమారాగ్రజుండు

ఉ. అల్లుఁడు రామరాజునకుఁగుటల్లుడు గొబ్బురియౌబళేశుఁ డా
వాల్లకవైరిఁ గన్నఘనునల్లుఁడు పోషణబుద్ధి గట్టురా
జల్లుఁడు వింటినేర్పున సమంచితరూపమునందుఁ జందమా
మల్లుఁడు దేవకీరమణునల్లుడు శత్రుసమిజ్జయంబులన్.

క. ఈరీతి నౌబళేశమ
హీరమణునివంశ మడరె నిందటలోనన్
ధీరుఁడు సర్వజ్యేష్టుఁడు
దారుఁడు గొబ్బూరితిమ్మధరణిపుఁ డలరున్

* * * *

క. ఆతిమ్మవిభునకును బ్ర
ఖ్యాతశ్రీ సోమ(యోబ)మాంబ యాత్మేశ్వరి యై
సీతాశాతోదరికిం
బాతి వ్రత్యప్రసిద్ధిఁ బ్రతి యై మించెన్.

వ. తన్మందగమనా మందారవల్లీ జననంబునకు రత్నాకరస్థానం బగు
సోమ వంశంబునకు మేటి యగునారవీటి బుక్కభూపాల సుత్రామ
రామ రాజన్య మూర్ధన్య శ్రీరంగరాజప్రభావం బెట్టి దనిన.

క. శ్రీరంగరాజసుతులు ధ
రారంగతిభర్త లలియరామాధిపుఁడున్
ధీరుఁడు తిరుమలరాయఁ డు
దారుఁడు శ్రీవేంకటాద్రి ధరణీవిభుఁడున్.

* * * *

ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁ డై వితతప్రతాపసం
తాపితశత్రుఁ డై యలసదాశివరాయనిరంతరాయ వి
ద్యాపురరాజ్యలక్ష్మికినిదానము తా నయి మించె నెంతయున్.

శా రామక్షోణివిభుండు కృష్ణమనుజేంద్రగ్రామణిన్ భీమసం
గ్రామేంద్రాత్మజుఁ బెద్దతిమ్మవిభునిన్ రామారితిమ్మాధిపున్
శ్రీమంతుం జినకొండభూవరవరున్ శ్రీరంగరాజన్యసు
త్రాముం గాంచెఁ గుమారరత్నములమందారోపమోదారులన్.

వ. అందు.

సీ. . . . . . . .

కప్పము ల్గొనియె నేఘనుఁడు కేరళచోళ
పాండ్యలాటాంగభూపతులచేత

. . . .

అతఁ డభయదానసంరక్షితాజిరంగి
భీతభూతలనేత వాగ్భూతధాత
యసమసమరప్రచండబాహార్గళుండు
రమ్యగుణశాలి పెదతిమ్మరాజమౌళి.

* * * *

మ పినకొండక్షితినాథుఁ డెన్నఁదగుగాంభీర్యాఁబురాశిం గరా
సినికృత్తప్రతివీరబాహుజవమున్ శీతాంశుబింబాననా
జనపుంద్రేక్షుశరాసనున్ యవనపాంచాలాంగనేపాళభూ
పనికాయార్పితదర్పితద్విపమదాంభఃపంకిలప్రాంగణున్

* * * *

వ. ఏతాదృశకుమారజనకుం డైన రామరాజశేఖరుం డలరుఁ దదను
(జా?)ండు.

* * * *

క. కృపగలతిరుమలరాయా
ధిపుఁ డలరఘునాథభూపతిన్ శ్రీరంగా
ధిపుఁ రామధరణిపు రిపు
ద్విపకేసరి వేఁకటాఖ్యవిభునిం గనియెన్.

* * * *

వ. ఇట్టి పుత్రసంతానంబు గాంచి తిరుమలరాయశేఖరుండు రా
జిల్లుఁదదవరజుండు.

* * * *

క. ఆవేంకటాద్రివిభునకు
గ్రావాధిపధైర్యనిధికిఁ గలిగిరి రంగ

త్త్వావరమణియును దురితత
మోవిధుఁడగు రామరాజు మొదలగుతనయుల్.

* * * *

వ. ఏతాదృశతనూజరత్నంబులం గాంచి వేంకటాద్రిరాజమూర్ధన్యుం
డుమించెనంత.

క. ఆరామరాజు తిరుమల
శౌరియు శ్రీవేంకటాద్రిజనపతి ముగురున్
గారాపుం దోఁబుట్టువు
లై రాజిల సాధ్వి యోబమాంబ దనర్చున్

మ. ప్రభురత్నం బగుతిమ్మభూవిభుతపఃప్రారబ్ధపుణ్యోదయం
బభిరామాకృతి నొందెనో కొఱ యనఁగా నాయోబమాబ్జాననా
శుభగర్భాబ్ధిజనించి రానరసరాజున్ జగ్గభూభర్త కౌ
స్తుభచింతామణులున్వలెన్ సహజతేజోదానధౌరేయులై.

చ. ఇరవుగ వేంకటాద్రిమనుజేంద్రుభుజంబులప్రాపు దాపునన్
నరసవసుంధరావలయనాథుఁడు జగ్గనృపాలచంద్రుఁడున్
హరి కిరుగేలుదామరలయందును జక్రముఁ బాంచజన్యమున్
దొరయుగతిం బ్రతాపవరదుర్జయకీర్తులు గాంచిరున్నతిన్.

* * * *

చ. సమరకిరీటి జగ్గనృపచంద్రుఁడు సాంద్రతరప్రభావమం
జిమఁ దగునోర్వకంటినరసింహనృపాలవరేణ్యపుత్రి నో
బమను వరించి యందుఁ గులపావనులన్ గిరియప్పఁ బాపభూ
రమణునిఁ గాంచెఁ బుత్రులఁ నిరంతరకీర్తిరమాకళత్రులన్.

వ. ఆజగ్గరాజాగ్రజుండునుం గృతినాయకుండును నోబమాంబాగర్భ
శుక్తిముక్తాఫలంబును నగు గొబ్బూరి నారసింహరాజసింహుని ప్రభావం
బెట్టిదనిన.

* * * *

చ. కోనేటి తిమ్మభూవిభునికూతురి రంగమఁ బుణ్యగొబ్బురి
శ్రీనరసింహుఁ డాహరి సిరిన్ వలెఁ బ్రేమ వరించి కాంచె స
త్సూనులఁ బెద్దతిమ్మవిభు శూరమణిం జినతిమ్మరాజు సం
ధానిధి కృష్ణధీరు రఘునాథునిఁ బాపనృపాలు రంగపున్.

* * * *

ఉ. ఆపెదతిమ్మభూవరకులాగ్రణి కంద(నా?)వోలిభర్త సం
తాపితశాత్రవుం డతనితమ్ముఁడు ధర్మయుతుండు కొండవీ

టీపురదుర్గరక్షణవటిష్ఠమతిం జినతిమ్మశౌరి యా
జ్ఞాపరిపాలనప్రతిభ సంధిల రాజ్యము సేయ రంజిలున్.

*    *    *    *

క. ఇట్టి కుమారులఁ గని చే
పట్టి జయేందిర నృసింహపార్థివుఁ డాజిన్
మట్టించె వైరిశిరములు
ఘొట్టాణకరోర ఘోరఖురపుటపటలిన్.

*    *    *    *

సీ. ఉప్పుతోఁ దొమ్మిదియును బెట్టి కృపణర
క్షణము గావించు నే గుణసముద్రుఁ
డడుగుమాత్రనె పెక్కువడుగులకిచ్చి కీ
ర్తన మొందు నే పుణ్యజనవరుండు
నెలకట్టడలు చేసి నిఖిలబుధత్రాణ
మొనరించు నే పురుషోత్తముండు
వర్షాశనంబులవ్వారిగా నొసఁగు యో
గ్యద్విజశ్రేణికే ఘనుఁడు కరుణ
నరుణకిరణప్రతాపుఁ డే ధరణివిభుఁడు
సనయవినయప్రచారుఁ డే యనఘమూర్తి
యతఁడు గొబ్బూరి తిమ్మరాజాగ్రసుతుఁడు
సరసగుణశాలి గొబ్బూరి నరసశౌరి.

*    *    *    *

ఉ. సంగరభూమిశత్రునృపసంఘముఁ గొల్చి ధృతిం దదీయ స
ప్తాంగములన్ హరించి సరసాగ్రణియై నరసక్షమావిభుం
డంగమనోజ్ఞకుంతలసమన్విత మంజులలాటభూమియో
షం గదియించెఁ దా భుజభుజంగనిరంతరభోగకేళికిన్.

సీ.

పుత్రకులఁ గాంచె నిధు లుంచె బుధుల నిండ్ల
నిలిపె నల్లిండ్లు దేవళంబులు నమర్చెఁ
గావ్యపతి యయ్యె వనతటాకము లొనర్చె
నెనయె గొబ్బూరి నారసింహునకు నృపులు.

క. ఏతాదృశగుణమణికిన్
శాతాసినివారితారిజనవరఘృణికిన్

సీతాపతిసేవాకృతి
కాతతనయవినయశుభగుణాలంకృతికిన్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన రామాభ్యుదయం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

మ. మనువంశోత్తమమత్తవారణఘటామాద్యద్ఘటానీకని
స్వనహేలాబధిరీకృతాఖిలదిశాస్తంబేరమోదీర్ణక
ర్ణనయజ్ఞా చినకోట్లధర్మవరనానారాజ్యధౌరేయకం
దనవోలీముఖదుర్గరక్షణచణోదగ్రప్రభావోదయా.

ప్ర. ఆ. చివర.

* * * *

క గోబ్బూరివంశమణిహ
న్నిబ్బరగండాంకమేదినీశ్వరతిలకా
బిబ్బోకవతీమదనక
కుబ్బంధురసురభికీర్తికుసుమోత్తంసా.

* * * *

క. సతతసహాస (బరీదా) ద్వి.ఆ. చివర.
దితురుషాధిపశరణ్యాదివ్యాంఘ్రిసము
న్నతకర్ణాటస్థాపన
చతురాళియరామరాజ (జామాతృమణీ).

సప్తమాశ్వాసము చివర.

**End:**

క. గండరగండ హరిద్వే
దండకులాచలకిటేంద్రదర్వీకరరా
డ్దండనపాండిత్యసము
ద్దండమహీమండలాస్పదభుజాదండా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదొంటిమిట్టరఘువీరశతకనిర్మాణకర్మఠజగదేకఖ్యాతిధుర్యాయ్యలురాజతిప్పయామనీషిపర్వతాభిధానపౌత్రాకరయామాత్యపుత్రపరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మిడివరగాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయపద్మాధిష్ఠితశ్రీరామభద్రరామభద్రకవిప్రణీతం బైనరామాభ్యుదయం బనుమహాప్రబంధంబునందు సర్వంబునష్టమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. ఎనిమిదాశ్వాసములు వ్రాఁత తిన్ననిది. తప్పులు లేకపోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు. చివఱ 14 పేజీలలో నీగ్రంథము యొక్క విషయవివరణసూచిక కలదు.

ఇందు రామాయణకథ ప్రౌఢప్రబంధరూపమున వర్ణింపఁబడినది. కర్త అయ్యలరాజు రామభద్రకవి. ఒంటిమెట్ట రఘువీరశతక కర్తయగు తిప్పయమనీషి యీతనికి ముత్తాతయో పెత్తాతయో యగును. ఈతఁడు పర్వతుని మనుమఁడు అక్కయామాత్యుని పుత్త్రుఁడు. ముమ్మిడి వరదాచార్యుల శిష్యుఁడు ఈగ్రంథమావిటి యళియ రామరాజు మేనల్లుఁడును జామాతయును నగు గొబ్బూరి నరసరాజునకుఁ గృతియీయఁబడినది. ఇతఁడోబమాంబా తిమ్మరాజులకుఁ బుత్త్రుఁడు. కందనోలు చినకోట్లధర్మవరము మొన్నగు రాజ్యమునకధీశ్వరుఁడట. గొబ్బూరివారు కరికాలచోళవంశమువారు

ఈ ప్రతిని బ్రౌనుదొరవారు 1850 వ సంవత్సరము సెప్టంబరు మాసమున వ్రాయించి ముగించినట్లు గ్రంథాంతమున నాంగ్లభాషను వ్రాసియున్నారు.

## No 715 రామాభ్యుదయము.

## RĀMĀBHYUDAYAMU

**Substance**, paper Size, 12⅝ × 8¼ inches Pages, 266 Lines, 23 on a page Mode of writing, good but contains mistakes. Condition, good Appearance, old Written only on one side of the paper Variations in reading are inteilined

Complete

Same work as the above

About 25 stanzas left in the prefatory portion are found at the end of the MS

Mr. C. P Brown's note found on the fly-leaf of the MS is as follows:—

"This poem is much celebrated but extremely rare for many years I never met with but one manuscript Subsequently I procured one from the Mackenzie collection: but that is deficient—the first book is wanting as far as the end of the introduction.

"That manuscript was in confusion, for the leaves were not numbered and had been jumbled I therefore prepared lists of "first lines" according to the present volume then on each leaf I marked the number of the first stanza it contained and by this tedious process ultimately adjusted that ancient volume throughout I succeeded in doing this after the Brahmans had thrown the volume aside as utterly unintelligible. Done 4th April 1840 Afterwards obtained four more MSS and they enabled my pandits to edit the work satisfactorily

"The Mackenzie Manuscript mentioned in the opposite page is the one alluded to in Mr Taylor's Report, Madras Journal, 1840, p 100 It is there described as imperfect But after being properly arranged it proved to be complete It is very ancient Judging from the style of the writing, I should imagine it to be more than 200 years old Natives say fully 400"

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్ననిదే. తప్పులునుగలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు. పత్రమునకొక వైపుననే వ్రాయఁబడినది. పాఠభేదములు బంతులనడుమ నెక్కింపఁబడినవి.

పూర్వవర్ణితగ్రంథమే.

## No 716 రామాభ్యుదయము.

## RĀMĀBHYUDAYAMU

**Substance, palm-leaf** Size, 16½ × 1¼ inches Pages, 296 **Lines, 5 or 6 on a page** Mode of writing, fair but quite faulty Condition, much injured Appearance, very old Many leaves are not found in the MS.

**Wants the beginning and the end and contains many omissions.**

**Same work as the above.**

(వి-వి.

తుద మొదళ్లును, నడుమ నక్కడక్కడ కొన్నియాకులును గాన్పింపవు. వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పులు మెండు. శైథిల్యము నల్పము. గ్రంథపాతము గలదు. మిక్కిలి ప్రాచీనము.

పూర్వము వోలె.

## No. 717 రామాభ్యుదయము.

## RĀMĀBHYUDAYAMU

Substance, palm-leaf Size, $17\frac{7}{8} \times 1\frac{1}{2}$ inches Pages, 161 Lines, 9 on a page Mode of writing, good but not free from mistakes Condition, much injured Appearance, old

Wants the prefatory portion

Same work as the above

(వి-వి.)—

కృత్యవతరణికతకరా దకీరానగ్రంథము గలదు. వ్రాంత తిన్ననది. తప్పులున్నవి. శైథిల్యమధికముగాఁ గలదు గ్రంథపాతము కానరాదు. ప్రాచీనము.

పూర్వమువోలె.

## No 718. రామాభ్యుదయము.

## RĀMĀBHYUDAYAMU

Substance, paper Size, $9\frac{5}{8} \times 7\frac{1}{2}$ inches Pages, 270 Lines, 26 on a page. Mode of writing, fair but incorrect Condition, injured Appearance, old

Wants one page in the beginning More than half the number of leaves is placed upside down in binding and their arrangement too is not correct.

Same work as the above

తొలుత నించుకతకరా తకిరానదంతయు సమగ్రముగాఁ గలదు. వ్రాంత యంతతిన్ననిదికాదు. తప్పులున్నవి. శైథిల్యముకలదు గ్రంథపాతము నించుకకలదు. ప్రాచీనము. పత్రములు తలక్రిందుగను తారుమారుగను కూర్పఁబడినవి.

పూర్వమువోలె.

## No. 719 రుక్మాంగదచరిత్ర.

## RUKMĀNGADACARITRA

Pages, 259 Lines, 20 on a page Mode of writing, good but faulty. Condition, much injured Appearance, very old Variations in reading are noted throughout the MS

Begins on fol 1*a* of the MS. described under No. 600 of the Des. Cat. of Telugu MSS.

Complete in five Āśvāsas

This is the same work as the one described under R Nos 183 and 282 (*a*) of the Triennial Catalogue of Manuscripts, Vol II, Part 3

The following is a note written by Mr Brown and found on the fly-leaf of the MS :—

### తెలుగు.

This poem is intended to advocate the Brahminical system of vows and especially the rules for fasting on the eleventh day of each lunar fortnight called Ecadasi Vratam This is declared to be a pious act of the highest merit - See Book I, verse 54—100

After describing the birth of Dharmangada, son of a king named Rucmāngada (1- 114—124) the author returns to his text and describes the grief of Yama, King of Hell, that his realms were thinned by the piety of men who by Rucmangada's command adhere to this vow He resolves to consult Brahma

Book II contains an account of the conference, wherein is given a full list (50—100) of all that is held sinful and all that is thought virtuous (102—140) by Brahmins Burning of widows is highly applauded 41

Brahma now stated that to meet the wishes of Yama he would create Venus (Jaganmohini) and send her on earth with her damsels to seduce men Their descent on Mount Mandara is described

In Book III we have a description of the ravages committed by wild beasts on Mount Mandara The highlandmen request king Rucmangada to come to the chase

Here (8—67) is inserted a long discourse on Government

68 Preparations for the chase List of names of the king's dogs 70 The Brahminical arguments against hunting (75—83) These are used by the queen The King replies that he is merely going to clear the hills of vermin and begs her to observe the Ecadasi The superstitious rites used when he set out—88

The chase is described 87—107 The various readings found in MS No T T 131 have been entered in this copy

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్ననిది తప్పులున్నవి. శైథిల్యమత్యధికము. గ్రంథపాతములు లేవు. ప్రాచీనము. పాఠాంతరములు ఖంతులనడుమ వ్రాయఁబడినవి.

ఇది ఆర్. నె 183, 232 (*a*) రుల వర్ణింపఁబడిన గ్రంథము.

గ్రంథాంతమున—

"౧౮. అక్టోబరు ౧౮౩౧ సం॥ మొకాబలా వ్రాయడమయ్యినది".

## No 720 రుక్మాంగదచరిత్ర.

## RUKMANGADACARITRA

Substance, palm-leaf. Size, 18¼ × 1⅝ inches. Pages, 114. Lines, 6 on a page. Mode of writing, fair but not free from errors. Condition, fair. Appearance, old.

Breaks off at the end of the third Aśvāsa.

Same work as the above.

(వి-వి.)—

మూఁడవయాశ్వాసమునఁ జాలవఱకుఁగలదు. వ్రాఁత యొక తీరుననున్నది. తప్పులు లేక పోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

## No 721 రుక్మాంగదచరిత్ర.

## RUKMĀNGADACARITRA

Substance, palm-leaf. Size, 15¾ × 1¼ inches. Pages, 283. Lines, 5 on a page. Mode of writing, fair but not free from mistakes. Condition, good. Appearance, old. The MS described under No 719 ante was copied from this MS.

Complete.

Same work as the above.

The date of transcription and the name of the scribe are extracted below as given at the end of the MS.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులును లేక పోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

నె 719 రున వర్ణింపఁబడిన గ్రంథమునకిది మాతృకయయినది.

గ్రంథాంతమున—

"దుంధుభినామ సం॥ జ్యేష్ఠ బ॥3॥ శు॥సరికిమాదిరాజుజగ్గరాజు రుక్మాంగదచరిత్ర సంపూర్ణంగా వ్రాసెను."

అనియున్నది.

---

No 722 రుక్మాంగదచరిత్ర.

RUKMĀNGADACARITRA

Substance, palm-leaf Size, 14½ × 1¼ inches Pages, 230 Lines, 5 or 6 on a page Mode of writing, fair but faulty with many omissions here and there Condition, injured Appearance, old

Complete, but wants a few stanzas in the middle and end.

Same work as the above

(వి-వి.)—

సమగ్రమే. కాని కడపటను, నడుమకొన్నిచోట్లను లోపములు కలవు. వ్రాత యొక తరబడిగానున్నది తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములున్నవి.

పూర్వము వోలె.

---

No 723 రుక్మాంగదచరిత్ర.

RUKMĀNGADACARITRA

Substance, palm-leaf. Size, 15 × 1¼ inches Pages, 124. Lines, 5 on a page Mode of writing, fair but faulty Condition, fair Appearance, old

Contains the first two Āśvāsas only

Same work as the above

(వి-వి.)—

రెండాశ్వాసములు మాత్రము గలవు. వ్రాత యొకతరబడిగా నున్నది. తప్పులు గలవు శైథిల్యమించుకగలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

No 724 రుక్మాంగదచరిత్ర.

RUKMĀNGADACARITRA

Substance, palm-leaf Size, 16½ × 1¼ inches. Pages, 142 Lines, 7 on a page Mode of writing, fair but faulty Condition, slightly injured Appearance, old

Contains the first four Āśvāsas only

Same work as the above.

(వి-వి.)—

తొలి నాల్గా శ్వాసములున్నవి. వ్రాంత యొకతరబడిగానున్నది. తప్పులున్నవి. శైథిల్యమించుకగలదు. గ్రంథపాతముగలదు.

పూర్వమువలె.

---

No 725 రుక్మాంగదచరిత్రము.

RUKMĀṄGADACARITRAMU

Substance, palm-leaf Size, 16½ × 7¼ inches Pages, 255 Lines, 4 or 5 on a page Mode of writing, fair but erroneous Condition, fair Appearance, old

Complete, but without the prefatory portions

Same work as the above Date of transcription is given below as found at the end of the MS

(వి-వి.)—

కృత్యవతరణిక తక్కిన దక్కిన దంతయుగలదు. వ్రాంతయొక తరబడిగానున్నది. తప్పులున్నవి. శైథిల్యమంతగా లేదు. గ్రంథపాతమును కానరాదు.

పూర్వమువలె.

గ్రంథాంతమున—

"చిత్రభానునామసంవత్సర మాఘ బహుళ ౧౦ భానువారంవరకు శ్రీరుక్మాంగద చరిత్ర సంపూర్ణంగా వ్రాసినారు." అనియున్నది.

---

No 726 రుక్మాంగదచరిత్ర.

RUKMĀNGADACARITRA

Substance, paper Size, 8¾ × 6½ inches Pages, 30 Lines, 24 on a page Mode of writing, fair and faulty. Condition, good Appearance, old

Contains the first Āsvāsa alone without a few stanzas in the beginning

Same work as the above

(వి-వి.)—

తొలియాశ్వాసము మాత్రమున్నది. అందును దొలిపద్యములు గొన్ని లేవు. వ్రాంత తిన్ననిది. తప్పులుగలవు శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

## No 727 రుక్మిణీపరిణయము.

## RUKMINĪPARIṆAYAMU.

Substance, palm-leaf Size, 15 × 1½ inches Pages, 142 Lines, 6 on a page Mode of writing, not good and not correct Condition, fair Appearance, old.

Complete, but a few leaves are missing here and there

A Prabandha describing the story of Śrī-Kṛṣṇa's marriage with Rukmiṇī The author is Kūcimañci Timmakavi, who is said to have composed many other poems, such as Nīlāsundarīpariṇaya, Rasikajanamanōbhirāmamu, etc Reference may be made to R Nos 59, 60 and 273(a) of the Triennial Catalogue of MSS, Vols I and II, regarding the author. This work was dedicated to God Kukkuṭēśvara worshipped in the shrine at Pithapur The author gives the date of composition of the work as Śaka 1637

Just in the beginning of the work, there is a stanza having no connection with the work and it is also given in the Telugu extracts below

**Beginning ;**

ఉ. శ్రీనగజాగజాననులు చేరి నెఱిం దనమస్తకంబుపై
జానగుచందమామఁ గని చయ్యన నద్దము వెన్నముద్దయుఁ
గా నెలమిం దలంచి యది కైకొనఁ బూని కరంబు లెత్తుచో
మానక వారిముగ్ధతకు మాటికి మ్రొక్కుశివున్ భజించెదన్

* * * *

సీ. చిన్నివెన్నెలరేఁడు చెన్నైనసికపూవు
పసిమించుపులితోలు పట్టుసాలు

* * * *

నగుచుఁ జెలువొంద భువనంబు లనదినంబు
రమణఁ బాలించు నిన్ను నేఁ బ్రస్తుతింతు
బుధనుతవిలాస పీఠికాపురనివాస
కుముదహితకోటిసంకాశ కుక్కుటేశ!

* * * *

క. చిరతరముగ నాకొస్గిన
కరణిన్ రచియించి నీకుఁ గావ్య మొసఁగెదన్
సరగున దోషము లెల్లను
బరిహార మొనర్చి దయను బాలింపు మజా!

* * * *

**End**

ఉ ఆరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులన్
బేరగు మన్మథాబ్దమునఁ బ్రేమఁ బ్రబంధ మొనర్చి మీ కిటుల్
చేరికతో సమర్పణము చేసితి నీకృతి యాతమిస్రను
శైత్రరవమిత్రతారకముగా భువిఁ జెల్వుగఁగాత శంకరా!

* * * *

మాలిని. కలుషఘనసమీరా! కామగర్వాపహారా!
విలసితగుణసారా! వేదమార్గప్రచారా!
బలవదహితదూరా! పన్నగాధీశహారా!
వలయితమునివారా! వంచితాశేషశూరా!

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరవరప్రసాదలబ్ధకవితాసామ్రాజ్యధురంధర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన రుక్మిణీపరిణయం బను శృంగారప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. అయిదాశ్వాసములు. వ్రాఁతయంత మంచిది కాదు. తప్పులు లేక పోలేదు. శైథిల్యగ్రంథపాతము లించుక కలవు. అచ్చుపుచ్చుట కొన్ని పత్రములు కానరావు.

ఇందు శ్రీకృష్ణమూర్తి రుక్మిణీవివాహ మనుకథ వర్ణింపఁబడినది. కర్త కూచిమంచితిమ్మకవి. దీని నితఁడు పీఠికాపురియందలికుక్కుటేశ్వరస్వామి కంకితమిచ్చెను. ఈకవినిగూర్చి ఆర్. నె 59, 60, 273 (a) రులు చూచునది. నీలాసుందరీపరిణయ, రసికజనమనోభిరామాదులు పెక్కు లితనియితరకృతులు. ఈగ్రంథము శా.శ. 1637 న రచియింపఁబడి నట్లు కవి చెప్పికొనియెను. గ్రంథాది నీక్రింది పద్యమెందును గలియని దొకటికలదు.

" ఉ. శ్రీదేవీపతిమూర్తినిర్జరగణశ్రేణీకిరీటాగ్రర
త్నోద్దీర్ణాంశుపచారవిందునిగమస్తోమార్థసంసేవ్యవి
చ్ఛేదుంగౌరవవంశవర్ధనునుతజ్జీమూతవర్ణాంగున
వ్వేదవ్యాసమునీంద్రుఁగొల్తునుజగద్విద్వజ్జనశ్రేష్ఠునిన్ "!

## No 28 రుక్మిణీపరిణయము.

## RUKMINĪPARINAYAMU.

Substance, palm-leaf Size, $17\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches Pages, 58 Lines, 7 on a page Mode of writing, bad and incorrect Condition, much injured. Appearance, old. Many leaves are broken.

Contains the first two Āsvasas, but without the beginning

Same work as the above

(వి-వి.)—

మొదటియాశ్వాసము మొదట గొన్నిపద్యములుగాక తక్కినభాగమును, రెండవయాశ్వాసమంతయును గలదు. వ్రాంత మంచిదికాదు. తప్పులు పెక్కులు. శైథిల్య మత్యధికము గ్రంథపాతముకలదు.

పూర్వమువోలె.

---

## No 729. లంకావిజయము.

## LANKĀVIJAYAMU

Substance, paper Size, $11\frac{3}{4} \times 7$ inches Pages, 54 Lines, 22 on a page Mode of writing, fair but full of mistakes Written only on one side of the paper Condition, injured Appearance, old Variations in reading are interlined

Begins on fol. 303(*b*) The other works herein are Sukumarīparinayamu 1(*b*), Sunandâparinayamu 170(*a*)

Complete.

This is the same work as the one described under R No 79(*a*) of the Tri Cat of MSS, Vol I The work was dedicated to God Gōpāla worshipped in the shrine at Kuyyeru Fuller extracts are given below.

**Beginning:**

శా. శ్రీలక్ష్మీస్తనకుంకుమాంకమొకొ నాఁ జెల్వై యెదం గౌస్తుభం
బోలిం గాల దయారసంబు లిలిపై కుప్పాంగ నా నెమ్మెయిన్
మెలో గంధపుఁబూఁత యొప్పఁ దగఁ లక్ష్మీజాని కుయ్యేటిగో
పాలుం డైహికసౌఖ్యముం బరము శుంభల్లీలమాకీవుతన్.

* * * *

సీ. ఆర్యవర్యుని నన్నపార్యుని రమ్యయ
శోరాజి దిక్కనసోమయాజి
రమణీయసుగుణాభిరాము నాచనసోము
రసికత్వసాంద్రు నెల్లనుకవీంద్రు

సకలకవినుతయశస్కరు భాస్కరు
గీతగుణసమాజుఁ బోతరాజు
భూనుతవాక్యభాషానాథు శ్రీనాథుఁ
బ్రథుకుకవిస్వాంతభీము భీము
సూక్తిచాతుర్యుఁ బింగళిసూరనార్యుఁ
బ్రీత బుధముఖ్యు నలసాని పెద్దనాఖ్యు
నాంధ్రభాషావిశారదు లైనయట్టి
సకలసత్కవివర్యులసన్నుతింతు

వ. అని . . . యేనొక్క ప్రబంధంబు నవరస భావార్థలక్షణా
నుబంధంబుగా రచియింప నుద్యోగించియున్న సమయంబున.

సీ. పాత్రభారద్వాజగోత్రుఁ డాపస్తంబ
మునిసూత్రుఁ డగుపిండిప్రోలు రామ
కృష్ణమంత్రికి శంకరీసాధ్వికిని పెద్ద
పట్టి శ్రీతిమ్మయ పద్మనాభ
వేంకటాచలరామవిభుల కగ్రభ్రాత
కీర్తి సీతారామకృతికి లక్ష్మి
యనుసతికిఁ దనూజ యగురాజమకుఁ బతి
ప్రథితుఁ డౌతిరుపన్న రామకృష్ణ
నాము లక్ష్మణాఖ్యుని నను రాముఁ గన్న
తండ్రి గోపాలమంత్రి సన్మతివిశేష
దేవతామంత్రి ద్యుతిభాసి త్రిదివవాసి
కరుణ నొకనాఁడు నాకలఁ గాననయ్యె

క. అటు గనుపించిన నే ను
తర్కటసంతోషమున లేచి తత్పదములకున్
బటుభక్తి మ్రొక్కుచు నిటిల
ఘటితాంజలి నైన నన్నుఁ గని యిట్లనియెన్.

సీ. ఆరె వట్టం బన్న యూర నండెడురావు
బుచ్చయ్య నరసమా పుత్రకుండు
దమ్మన్న రావన ధర్మరాయం డన
నిరుపేళ్లతోడుత నెసఁగువెలమ

యరయ భద్రయ్య జగ్గయ్య తమ్మయ్య బా
పయ్య లన్నలుగురి కగ్రజుండు
పుత్రాదిసంపత్తిఁ బొసఁగునతఁడు మన
కుయ్యేరు ప్రీతితో గుత్తచేసి
నీదులంకమాన్యము బల్మినిన్ హరించెఁ
గానఁ దత్ప్రాప్తికై రామకథయను మన
కథయు జతిగాఁగ నర్థంబు ఘటనపఱచి
కృతిరచించి గోపాలున కిమ్ము తనయ

క మనకుయ్యేరున నెలమిన్
బెనఁగొనుగోపాలమూర్తి పేరనె సుమ్మీ
మును నాపేరిడియెను మ
జ్జనకుం డటుగాన నతఁడు దైవము మనకున్

* * * *

క. అనిపలికి యమ్మహాత్ముఁడు
చన నేమేలుకొని సంతసము నాశ్చర్యం
బును బటుభక్తియు ముప్పిరి
గొనుమదితో మ్రొక్కు లిడితి గోపాలునకున్.

ఆ అట్లు మ్రొక్కి హితులకందఱ కీవార్త
చెప్పి యర్థయుగము చేరఁగబ్బ
మేరచింపవలఁతినే మున్ను పింగళి
సూరనాదు లైనసుకవులట్లు.

వ అనిన వార లిట్లనిరి.

చ గణుతికి నెక్కు నట్టిఘనకావ్యము లొప్పుగఁ జేయ శాస్త్రవి
ద్గణములు మెచ్చ భావములు కల్పనసేయ రసంబు లొప్ప భా
షణముల కర్థగుంభనము సమ్మతి సేయఁగఁ బిండిప్రోలి ల
క్ష్మణకవివర్య నీవె తగుజాణఁడ వన్యులు నీసమానులే

మ. అనిన న్వారలప్రేరణంబునను మున్నత్యంతసంప్రీతిమ
జ్జనకుం డానతియిచ్చుటం దుదిని మోక్షం బిప్పు డిష్టార్థముల్
గొనసాగంగ నొసంగు శ్రీవిభునకుం గుయ్యేటిగోపాలదే
వున కీఁ గోరుటఁ జెప్పఁ బూనితి సుకావ్యు ల్మెచ్చ నీకావ్యమున్.

* * * *

వ. కావున.

క. ఓ ప్పని తోఁచిన మెచ్చుఁడు
తప్పనితోఁచినను జాలఁదరచుం డొప్పున్
దప్పని యుపేక్ష సేయకుఁ
డెప్పుడు నోసుమతులార యేఁ బ్రార్థింతున్.

క. అనిబుధులవేడుకొని. . . .

* * * *

క. సురుచిరసద్గుణజాలున
కురుతరమృగనాభితిలకయుతఫాలునకున్
శరధిసుతాలోలునకున్
గురుకీర్తివిశాలునకును గోపాలునకున్.

వ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన లంకావిజయం బను ద్వ్యర్థిప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన.

ఆ. ఁమరు సకలలోకసమితిఁ గు ద్యే తితి
రహితముగను సిరి కిరవును విబుధ
విలసితంబు నగుచు విపులం బయోధ్య య
నునగరము సురపురి ననుకరించి

**End**

క ఈలంకావిజయంబును
హోల్రిఁ జదివిన వినిన జను లలఘుచిరాయు
శ్శ్రీలాభ సమన్వితు లై
శ్రీలక్ష్మీశ్వరునికడ వసింతు రఁట తుదిన్.

* * * *

ఉభయభాషాకందము.

రామము దేవర కావవ
యామాజేజే య య మయా మున్నలజే
జే మదిని నారదేమయి
తేజద్దామోదర యది తెల న్నావిన్

**Colophon**

గద్య ఇది శ్రీమత్కుర్త్యేటిగోపాల లీలాకటాక్ష వీక్షణసంప్రాప్త దీప్తసాహిత్యసుకవిజనస్తుత్యశుభాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర పిండిప్రోలు గోపాలామాత్యపుత్త్ర సరసకవితా లక్షణవిచక్షణ లక్ష్మణకవి ప్రణీతం బైనలంకావిజయం బనుద్వ్యర్థి పబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁత యొకతరఁబడిగానున్నది తప్పులు కు
ప్పు. శైథిల్యగ్రంథపాతములు మిక్కిలి కాన్పించవు. పాఠాంతర
ములు బంతుల నడుమ నెక్కింపఁబడినవి.

ఈగ్రంథము ఆర్. నెం 79 (a) రున వర్ణింపఁబడినదే. ఏతత్కా
వ్యకర్తయగు పిండిప్రోలి లక్ష్మణకవి తన తండ్రియగు గోపాలామాత్యుఁడు
స్వప్నమునఁగాన్పించి తమకుయ్యేరున గుత్తకు దీసికొనినపుడా గ్రామ
మునందిన లంకమాన్యము నపహరించిన యారెవట్లగ్రామ నివాసియగు
రావుదమ్మన్నయను ధర్మారాయుని రావణునిగాను, లక్ష్మణకవిని రాముని
గనుగూర్చి యంతటను రెండర్థములు వచ్చు లాగున రచియింపఁగో
రఁగా దీనినిరచియించి తమ కులదైవమగు కుయ్యేటిగోపాలస్వామి కం
కిత మొసఁగినాఁడు. దమ్మన్న వెలమ. రావుబుచ్చయ్యకును నరసమ్మ
కును బుత్త్రుఁడు. విశేషములకుదాహృతభాగముఁగాంచునది.

## No 730 లంకావిజయవ్యాఖ్య.

## LANKĀVIJAYAVYĀKHYA

Substance, palm-leaf. Size, 15¾ × 1⅝ inches Pages, 112 Lines, 7 or 8 on a page Mode of writing, fair but not free from mistakes. Condition, fair Appearance, old

Incomplete Wants the commentary for the introduction and for a portion at the end of the second Āśvāsa

A commentary written in colloquial language on the Lankāvijaya described above From the colophon given by the scribe it is understood that Kōsuri Krsnamācārya of Ātrēyagōtra and Vaikhānasasūtra and a resident of Pekeru, near Daksārāma and Kuyyeru, is the author of the commentary

**Beginning.**

గీ. రాఘవార్థము సకలలోకసమితికుయ్యి సకలజనసముదాయము
యొక్క మొత్తి లోకస్తుభవనేజనత్వమరః యేలి యేప్రాకారముచేతను
రహితముగను లేనట్టుగానున్ను యుక్కడకుయ్యి శబ్దములోనియికారము
నకు కిమాదికస్యేతః అనేసూత్రముచేతలోపము సిరికి సంపత్తికి యిర
వును స్థానమున్ను విబుధవిలసితంబును పండితులచేత ప్రకాశింపచెయ్య

బడ్డదిన్ని అగుచు విపులంబు విశాలమైన అయోధ్యయను అయోధ్యఅనె యిక్కడ అనుశబ్దము అకారమునకు యశ్రుతిమార్యాలఘుశ్చ అనే సూత్రముచేత యకారమువచ్చినది నగరము పురము సురపురి అమరావతిని అనుకరించి పోలినదౌకుంచున్న అమరును

లక్ష్మణకవీశ్వరుని అర్థము. సకలలోకసమితి సకల విద్యలతో కూడుకున్న లోక జనముకు సమితి సభాస్థానమనుట సంఘేసభాయాం సమితిరిత్యమరః కుయ్యేరు కయ్యేరుఅనేగ్రామము యీతిరహితముగను సిరికి అన్యత్రలక్ష్మికి యిగఫ్రను విబుధవిలసితంబును పండితులచేతప్రకాశింపచెయ్యబడ్డది అన్యత్ర దేవతలచేతను అగుచు విపుల భూమియందు విపులాగహ్వరీధాత్రీత్యమరః యిక్కడవిపులాశబ్దమునకు దీర్ఘాణాంహ్రస్వ స్యాత్ అనెసూత్రముచేత హ్రస్వమైనప్రథమమీదను కూర్చిలనునయోః అని ద్వితీయకు నుకారమురాంగా బిందుంప్రవదంతితం క్వచిత్క్వచిత్ అనిబిందువునిలిచి యితరత్రగద్వితీయ్యాఅని సప్తమ్యర్థమువచ్చినది పయోధ్యనును పయోధి సముద్రము అయను స్థానముగాగల విష్ణువుయొక్క ఇకోయణచి అనిపాణినియ్యసూత్రము యిక్కడ పరుషాద్రుతప్రకృతికాత్పరళాస్యః అనిబత్వమువచ్చినది పయోధ్యయను అనేద్వితియ్యకు షష్ఠిభవే ద్వితీయతుల్యా అనిషష్ఠ్యర్థమువచ్చినది నగరము వైకుంఠమును యిక్కడ నిరమహతాంలుక్చఅనెసూత్రముచేత నుకారలోపము సురపురిని అనుకరించిఅమరును.

**End :**

క. రా. కనుగొంటిరిసీతారమణిని కం- స్థిరిసీతాదేవిని భవిశదకీర్తి నక్షత్రములభంగిని . . . .

**Colophon :**

గద్య. ఇది శ్రీమద్ద్రాక్షా రామప్రాగ్భాగగవ్యూతి మాత్రదూరస్థిత కుయ్యేరు నామధేయ పురవరదక్షిణపార్శ్వ శ్రీకరక్షీరాబ్ధితుల్యావలయిత హ్రాదమధ్య శ్వేత ద్వీపోపమసమున్నత పేకేరు నామగ్రామ లలామాభిరామ గోపాలనామ శ్రీమన్నారాయణ నిత్యపూజావిధాన వైఖానసశాఖాశ్లాఘ్య తేయ గోత్రపవిత్ర కోనూరివేంకటాచార్యపుత్ర పిండిప్రోలు లక్ష్మణకవి వాక్యార్థపరిజ్ఞాన పాత్రవిబుధజన వినుతచర్య కృష్ణమాచార్యలిఖితంబగు లంకావిజయ వ్యాఖ్యానంబునందు ప్రథమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము కృత్యవతరణికయు ద్వితీయాశ్వాసాంత భాగమును లేవు. వ్రాంత యొకతరఁబడిగానున్నది. శైథిల్యము విశేషము లేదు. గ్రంథపాతము లేదు.

ఇది పైనుదాహరింపఁబడిన లగ్నాలివిజయమునకుఁ ప్రతిపదాంధ్ర వ్యాఖ్యానము దీనికర్త విలేఖకుఁడనియున్న గోసూరి కృష్ణమాచార్యుఁడుకాబోలును. అతఁడు పేకేరు గ్రామవాస్తవ్యుఁడు. ఈ గ్రామము దాక్షారామమునకుఁ పూర్వ రెండుక్రోసుల దూరముననుండు కుయ్యేటికి దక్షిణముననున్నదట. వాడుకభాషయందే వ్యాఖ్యానము రచియింపఁబడినది.

## No 739 లక్ష్మీనారాయణసంవాదము

## LAKSMĪNĀRĀYANASAMVĀDAMU

Substance, paper Size, $7\frac{1}{8} \times 6\frac{3}{8}$ inches, pages, 24 Lines, 16 on a page Mode of writing, good but not free from mistakes Condition, fair Appearance, old

Contains the first Āśvāsa of which a few stanzas are wanting in the beginning.

Begins on fol 300(*a*) The other works herein are Sangamēsvaraśatakamu 1(*a*), Yaduvamsabhūsanaśatakamu 25, Rāmapancādas kandamulu 39*a*, Śrīnivāsatāravali 47*a*, Kālahastilingaśatakamu 61*a*, Śvētakubhrnnrkēsarisatakamu 97*a*, Lāvanyasīmasatakamu 121*a*, Caudappaśatakamu 158*a*, Bhahrakarivēlpuśatakamu 193*a*, Kaluvāyisatakamu 229*a*, Bhandanāratibhima Kōdandarāmaśatakamu 287*a*.

Same work as that described under R No 431(*b*) of the Triennial Catalogue of MSS

This poem is said to have been reduced to writing by Adurti-Hariharadāsa while it was being composed

(వి-వి.)—

ప్రథమాశ్వాసమునఁ గొంతభాగముగలదు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది మైసూరు ప్రాచ్య - ఆర్ 431 (b) రున వర్ణింపఁబడినగ్రంథము. దీనినిదోలుదొాల్ల నాదు_రి హరిహరదాసుఁడు లిఖించినట్లు క్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది —

" క. హరిలక్ష్మీసంవాద మ
మర గోఁగులపాటికూర్మమంత్రి రచింపఁగ
ధర నాదు_రి కులజుఁ డగు
హరిహరదాసుఁడు లిఖించె నానందముగన్."

ఈపద్యము గద్యమునకుఁబూర్వమేకలదు.

## No 732. లక్ష్మీనారాయణసంవాదము.

## LAKSMĪNĀRĀYANASAMVĀDAMU

Pages, 12 Lines, 15 on a page Mode of writing, fair but full of mistakes Condition, much injured Appearance, very old

Begins on fol 138*a* of the MS described under No 90 of the Des Cat of Telugu MSS, Vol I

Incomplete Contains a small portion in the first Āśvāsa

Same work as the above

(వి-వి) —

అసమగ్రము. తొలియాశ్వాసమునఁ గొంచెము కలదు. వ్రాఁత యొక తీరుగా నున్నది. తప్పులు పెక్కులు గలవు. శైథిల్యము మిక్కిలి మెండు గ్రంథపాతములు గలవు. అతిప్రాచీనము.

పూర్వము వలె.

## No. 733 లక్ష్మీనృసింహవిలాసము.

## LAKSMĪNRSIMHAVILĀSAMU.

Substance, paper Size, $11\frac{1}{4} \times 7\frac{5}{8}$ inches Pages, 133 Lines, 20 on a page Mode of writing, not good and not correct Condition, fair Appearance, old

Begins on fol 100*a* The other work herein is Kuvalayānanda-prakāśika 1*a*

Complete in three Āśvāsas.

This Prabandha describes how God Nṛsimha, worshipped at Ahōbila, fell in love with a Chenchu girl, while out on a hunting expedition, how the goddess Lakṣmī became indignant thereby and how they were all reconciled The author is Paidipāti Venkatanṛsimhakavi, son of Venkamāmba and Lakṣmīpatikavi of Śaṭhamarsanagōtra and Āpastambasūtra His ancestors are said to have received a gift of lands in the villages of Paidipādu, Jatukupādu, Vempādu, and Ilavara which were given to Gōparāju Rāmanna by a chief of Golkonda It is also stated that the author composed a Śataka in the Sīsa metre dedicated to God Kṛṣṇa and a Śataka in the Vṛtta metre dedicated to God Rāma.

**Beginning**

శా. శ్రీకంఠాక్షి వివాహవేది మణు లర్థిం దోయిటం బూని సు
శ్లోకుం దన్నుఁ జతుర్భుజుం డని మదిం జూడ న్వరాభీతిదా
స్తోక శ్రీకరము ల్గన న్నిలుపుచుం దుల్యాకృతారోపణం
బై కూర్మిం దగుమాల్యశైలనరసింహస్వామి నర్చించెదన్.

*   *   *   *

సీ. వాగ్వరగాసనత్వంబు వాగ్వరశాస
నత్వంబు వాల్మీకినన్నపలకు
ధర్మకళాస్తుతిత్వంబు ధర్మకళాస్తు
తిత్వంబు శుకతాతతికవినలకు
వరకవితావిభుత్వము వరకుకవితావి
భుత్వము భోజరాట్పోతనలకు
గోత్రాత్మజానుతి గోత్రాత్మజానుతి
ప్రబలకాళీదాసభాస్కరులకుఁ
గృతుల నిక్షిత రేతరహితము గల్గి
మృదుపదోక్తప్రబంధార్థమిహిరకిరణ
గణవిధూతజనౌఘాంధకారు లైన
సంస్కృతాంధ్రకవీంద్రుల సన్నుతింతు.

*   *   *   *

వ. ఇట్లు . శ్రీనివాసదేవునియనంతావతారంబులం
దవతారత్రయంబు చిరకాలాభ్యుదయంబు గావున రామకృష్ణదేవంబుల
కు వృత్తసీసశతకద్వయంబు చెప్పి యర్పించి నృసింహదేవునకు భవ్యం
బగుకావ్యంబుఁ జెప్పి యర్పింపందలంచి . . . మదీయవంశ
క్రమంబు వివరించెద.

సీ. క్షితితలంబున నొప్పు కృష్ణాపినాకినీ
దివ్యనదీమధ్యదేశభూమిఁ
గడుఁ బూర్వవార్థికిఁ బడుమట యోజన
దూర మై తగు కందుకూరు మఱియు
నదియ సీమానామ మై యొప్పు నాకందు
కూరికిఁ దనరు వాయువ్యదిశను
బాలేరు దానికిఁ బౌలస్త్యదిశఁ బైడి
పా డొప్పు దానికిఁ బశ్చిమమున
నెగడుఁ జతుకుపాడు నిరృతిని వెంపాడు
చెలఁగు గాడ్పుమూల నిలవరయున
నమరుపురచతుష్టయం బిది తృణకాష్ఠ
జలసమృద్ధిసిరుల నలరుచుండు.

గీ. గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండప్రభువుచేతఁ గొనినదాన
మహిమ దుష్టమతుల మడియించి స్థావర
జీవనంబు ద్విజులఁ జేర్చె మున్ను.

వ. తదీయానుగ్రహలబ్ధంబైన యేతద్గ్రామచతుష్టయ స్థావరజీవన
జీవితు లైనమదీయవంశజుల జననక్రమంబువర్ణించెద.

*  *  *  *

క. ఘన మైనయజుర్వేదం
బున కాపస్తంబసూత్రము ఘటించె మహా
జనసన్మతి నామాని
శునిశాసనమునఁ దదీయసూత్రమునందున్.

ఉ. ప్రవిమలపుణ్యకీర్తి హరిభక్తిఁ గవిత్వతరోక్తిఁ గల్గి యీ
భువిఁ దగి పైడిపాటికులభూషణు లొప్పుదు రట్టివంశసం
భవు లగువారి కెల్ల శఠమర్షణభద్రిణబాదరాయణ
ప్రవరసమేత మై యవనిపై శఠమర్షణగోత్ర మొప్పెడిన్.

క. ఆగోత్రంబున విద్యా
వాగీశుఁడు పైడిపాటివంశంబున నా

త్మాగమవేది నిరంతర
భోగి యనంగ శోభిళప్పుపుట్టె ఘనుండై.

ఆ. ఘనుఁ డతండు ప్రేమఁ గాంచె లక్ష్మీదేవి
వలనఁ గేశవాఖ్యు నలఘుకీర్తి
కలితుఁ జెంచులక్ష్మివలన గోపాలాఖ్యు
విష్ణుభక్తు సుగుణవినుతచరితు.

క. ఆకేశవాఖ్యుఁ డమల
శ్లోకుఁడు తిమ్మాంబ నధిక శుభలగ్నమునన్
జైకొని యాసతివలనన్
నాకధునీయశుల సుతుల నలువురఁ గాంచెన్

క. అనఘు జగన్నాథు మహా
జనసన్నుతుఁ బర్ణశాల సద్గుణకలితుం
డనఁ దగుబుచ్చనను బుధా
వనచేతోవిమలు నయ్యవారిఁ గ్రమగతిన్

క. గోపాలాఖ్యుఁడు పరమకృ
పాపార్వతి యనఁగఁ బరగుపార్వతి నతులో
ద్దీపితలక్షణ రేఖా
శ్రీపాణిగ్రహణ మాచరించె ముదమునన్.

* * * *

మ. మృగభృత్కీర్తి వహించినట్టిగురుమూర్తిన్ నామపారాయణుం
డగునారాయణుఁ బ్రేమఁ బెద్దనగసింహాఖ్యు న్సుధీసఖ్యు న్బా
ద్విగతాంహుం జీననారసింహు విలసద్విద్యాఢ్యుఁ డౌనోబళున్
సుగుణౌఘుణు లక్ష్మణుం గని తి తేజోమూర్తు లాదంపతుల్.

క. ఆరుగురిలోనఁ గడగొ
ట్టైరంజిలు లక్ష్మణాఖ్యుఁ డసమానగుణో
దార యగునట్టిమంగమ
నారూఢగతిం గరగ్రహణ మొనరించెన్.

మ. ఉరువిద్యాప్రఁటీకృతాంహు నరసింహు న్సత్యవాక్యజ్ఞనో
ద్ధరణస్ఫూర్తిని గృష్ణమూర్తి నతిభోగాఖండలుం గొండలున్
నగసమ్యక్కరివితాచమత్కృతమతిన్ లక్ష్మీపతిఁ గాంచె ని
ద్ధర మంగాంబికయందు లక్ష్మణసుధీధౌరేయుఁ డింపొందుచున్.

తే. అందు లక్ష్మీపతికవీంద్రుఁ డమలసుగుణ
సహిత శ్రీవత్సగోత్రసంజాతశుభచ
రిత్ర వెంకాంబఁ గౌశికగోత్రజనిత
ఘనపతివ్రత లక్ష్మాంబికను వరించె.

* * * *

శా. ఆ వెంకాంబికయందు వేంకటన్నసింహాఖ్యున్ననున్ గీతలీ
లావిద్యానిధి బుచ్చనాఖ్యుఁ బిదపన్ లక్ష్మాంబయందుం గళా
శ్రీవర్ధిష్ణు విభూతిజిష్ణుఁ బరదేశిం గాంచె లక్ష్మీపతి
ప్రావీణ్యాఖ్యకవీంద్రుఁ డుత్తమకళాప్రత్యక్షచంద్రుం డిలన్.

* * * *

సీ. అవనిసురలమునకవిమర్షణాఖ్యగోత్ర
సంజ్ఞ గల్గి డిపాటివంశజుల మాలు
వేలకృతిని యజుశ్శాఖ వెలసి వాక్య
సిద్ధిగలిగినమాన్యత్తి శిష్టహితము.

వ మదీయజనకాద్య నేక దేశికోపదేశలబ్ధ కవిత్వోపయోగవి ()
సంవేద్యమానమానసుండనై.

క. శ్రీజతురాగాత్మద్విజ
రాజచ్ఛదచుం బితాంబురాంశితనూజాం
భోజ కుల్గోపమావ
క్ష్మోజయుగోపరికి మాల్యాకధరనృహరికిన్

* * * *

వ. సమర్పణంబుగా నా యొనర్పం బూనినలక్ష్మీనృసింహవిలాసంబు
నకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End :**

క. అని శుకయోగి పరీక్షి
జ్జనపతి కెఱిగించె ననుచు సమ్మతి సూతుం

డును శౌనకాదిమునులకు
మనమున నరహరి నుతించి మఱి యిట్లనియెన్.

*    *    *    *

మా. ఇహపరఫలదాఖ్యా యిందుసంపత్సమాఖ్యా
ద్రుహిణమదనతాతా శ్రీధరిత్రీసమేతా
యహికులపతితల్పా హవ్యవాహానకల్పా
మహితజగదధీశా మాల్యభూభృన్నివేశా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదుభయవ్యాకరణ త్రికరణాచరణాభరణ వాగర్థజ్ఞానసమర్థ విద్వజ్జనవిశిష్ట సముత్కృష్టపీతభయభూతదయాలబ్ధసమారబ్ధక వితామితచమత్కారకారణ చణాష్టభాషా సంస్కార పరిష్కారమనీషా విశేష మహాతాపసాప స్తంబ సూత్రశతమర్షణ గోత్రపవిత్ర రత్నగర్భకర్బుర పేటీపరిపాటిధాటి పైడిపాటివంశక్షీర వారాశిరాకాసుధాకరోదయాభ్యుదయ లక్ష్మీపతికవీంద్రనందన వేంకటనృసింహకవిప్రణీతం బైన శ్రీలక్ష్మీనృసింహ విలాసంబునందు సర్వంబును దృతీయాశ్వాసము

(వి-వి.)—

సమగ్రము మూఁడాశ్వాసములు. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యగ్రంథ పాతములు లేవు.

అహోబల నృసింహస్వామి వేఁటపోయి యచ్చట వసుంధరయను నొక చెంచుకన్నెంగని మోహించి దానిని బెండ్లాడి దానితో మాల్యపర్వతమునకుం బోయి యచ్చటనుండ లక్ష్మీదేవి స్వామిపైఁ గోపించి యచ్చటికిఁ బోవ స్వామి యామెకోపముఁ బోఁగొట్టి యిరువురు భార్యలతో సుఖంబుగ నుండుగాథ యిట్లు ప్రబంధరూపమునఁ బైఁడిపాటి వేంకటనృసింహకవిచే రచియింపఁబడినది. ఈ కవి వేంకమాంబకును లక్ష్మీపతి కవికిని బుత్త్రుడు. ఇతనికిఁ గందుకూరు సీమలోని పైఁడిపాడు జతుకుపాడు, వెంపాడు, ఇలవర యనునీ నాలుగు గ్రామములలోను భూమి గలదట. తొలుత గోలకొండ ప్రభువువలన గోపరాజురామన యీ గ్రామములను దానపూర్వకముగఁ బడసి వాని యందీతని పూర్వులకు భూమి నొసఁగెనట ఈ కవి యింతకుఁ బూర్వము కృష్ణాంకితముగా నొక సీసశతకమును, రామాంకితముగ నొక వృత్తశతకమును రచియించెను.

## No 734 లక్ష్మీవిలాసము.

## LAKSMĪVILĀSAMU

Substance, paper  Size, $11\frac{7}{8} \times 8$ inches  Pages, 125  Lines, 19 on a page  Mode of writing, fair but faulty  Condition, fair  Appearance, old

Begins on fol. 100*a*  The other work herein is Bhartrhari Subhāsitaratnāvali 1*a*

Complete in five Āśvāsas.

A poem describing the incidents leading to the churning of the milk ocean, the birth of Goddess Laksmī and Her marriage with God Nārāyana  The author is Rāyasamu Vēnkatapati, son of Akkavāmatya of Vasisthagōtra and belongs to Āruvēla Niyōgi sect  He received many presents, such as villages, ornaments, etc, from the King Śrīrangarāya under whom he served as a clerk  This work was dedicated to God Venkatēsa

**Beginning:**

శా. శ్రీల న్మించురమావిలాస మతిమైత్రిం జిత్తకంజంబునం
దాలేఖ్యస్థితిం గాంచి చొక్కురుచి బాహ్యంబందెనాం బేరెదన్
లాలిత్యంబును జూపిసింధుజ నవేలప్రేమలం దన్పునా
లీలాకారుండు శేషశైలపతి బాళిం బ్రోచు మమ్మెప్పుడున్.

వ. అని . . . యొకర్ మహాప్రబంధంబు రచియింపం
బూని కృతినాయకు నన్వేషించునెడ.

శా. శ్రీమద్దైవ్యభవభవ్య పంకజభవ శ్రీకంధరేంద్రామరుల్
గోమాంచాన్వితగాత్రులై యెదుట బారు ల్గ్రి సేవింపం డ
త్రీమానుగ్రహాయుక్తి లెమ్మనుగతిన్ శ్రీహస్తముం జాపుశ్రీ
భామాస్వాండు వేంకటేశ్వరుండు స్వప్నస్థాయి నై యిట్లనెన్.

క. వరమతినుదయించితి మ
ద్వరమున నటుగాన నీవు వర్ణించుకృతీ
శ్వరుండ నయి వరము లొసంగెద
గరిమన్ లక్ష్మీవిలాసకథ చెప్పందగున్.

క. మేలుకని స్వప్నలబ్ధపు
మేలు సుధీజనులతో నమృతసారరుచుల్

జాలుకొనం జెల్ప నెన్నంగం
జాలుం గృతార్థుండ వనుచు సంభ్రమవరులై.

* * * *

మ. చతురోక్తి న్ననుం జూచి యిట్లనిరి వత్సా నీవు గావించు న
త్కృతి శ్రీవేంకటభర్త కింగనుట యెంతేం బూర్వజన్మాంతరా
ర్జితపుణ్యంబునం గాక కల్గునె యశశ్శ్రీ నైహికాముష్మిక
స్థితికర్తం గృతికర్తం జేసి కను సుస్థేమాయురారోగ్యముల్.

క. సకలాధిపత్యనిరవ
హాకుం డని జను లెన్న వెలసితొ ధరం గర్ణా
టకరాయసభల నిపుణం
టకమతి రాయసము వేంకటపతీ సుకృతీ.

మ. అలఘుప్రాభవ గర్వభా కురుతుపశాహామేయసైన్యంబు న
గ్గలికం బంపుల చేత గల్చి బిరుదు ల్గైకొన్న శ్రీరంగరా
యలచిత్తం బిగురింప రాయసము వ్రాయం జాలి తొనా సుధీ
తిలకా యకరయమంత్రి వేంకటపతీ దివ్యతరశ్లాఘావాక్కృతీ.

* * * *

వ. అని . . . . పెద్దలాదేశించిన . . . . పతత్ప్ర
బంధనిబంధనప్రారంభధురంధరుండ నై తనరు నస్మదీయవర్తనం బెట్టి
దనిన.

శా. శ్రీల న్మించి సమస్తధీకలనచేం జెన్నందునార్వేలవం
శాలంకారకరు ల్వసిష్ఠమునిగోత్రాంకుల్ బుధుల్ దీనర
క్షాలీలం బొగడొంది రందు వెలసెం సన్నాయి భానప్ప ది
గ్జాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందార మై.

చ. అతనికి నుద్భవించె సుగుణాంబుధి తిమ్మయమంత్రిపుంగవుం
డతండతివైభవు న్నరసయప్రభుం గాంచె నతం డుదారతా
యుతమతి విట్టలార్యుం గనె నాఘునుం డకరయామంత్రిశేఖరున్
సుతునింగం గాంచె నావరయశోనిధికిన్ మహి నేను గల్గితిన్.

క. మఱి శ్రీనివాసమంత్రియు
సిరులన్ రామప్రధానశేఖరుం డుదయిం

చిరి వారి కగ్రజుఁడ నై
ధరఁ దనరుచు నత్యుదారతాధీగరిమన్.

ఉ. వ్రాయుదు రాజ్యవైభవధురంధరభూతి దలిర్పఁ గీర్తిఁ డా
రేయసిరంగరాయ మహిభృన్మణిరాయప మగ్రహార హై
మాయతరత్నభూషలు నృపాధ్యులు వర్తన లియ్య నుబ్బుచున్
వే యననేమి రాయసమువేంకటమంత్రి యనన్యశక్తి నై.

* * * *

క. శ్రీవనితాజీవనతా
భావనతారుణ్యనిధికిఁ బదఘాటీసం
జీవితదృషదాకృతికిన్
శ్రీవేంకటపతికి ఫలితసేవకకృతికిన్.

వ. అంకితంబుగాఁ బొంకింపంబూనిన రమావిలాసంబనురసవత్ప్ర
బంధంబునకుఁగథానిబంధనంబెట్టిదనిన

సీ. అనఘభారతమునం దాదిపర్వంబున
దివిజు లంభోధి మధించుటయును
సరసిజాలయయందు జనియించుటయుఁ జక్రి
వరియించుటయును మీవలనవింటి
మన్నది సంకోచముగఁ బల్కితిరి మీరు
గావునఁ దత్కథాక్రమము వినఁగ
వేడుకయ్యెడి నాకు విబుధు లేరీతి నం
బుధి ద్రచ్చి రందు శ్రీమధురవాణి
జనన మేరీతి నడచె నాశౌరి యెటులఁ
బరిణయం బయ్యె నది సవిస్తరముగాఁగ
నానతీవలె నన్న హర్షాదరమతి
జనపతికిఁ దెల్పఁ దొణఁగె నామునివరుండు.

**End:**

సీ. . . . . . . . .
ప్రౌఢి నందాఁక నమృతసారరుచి నెసఁగి
మిగులతేజస్వి యై తావిమించఁ గీర్తిఁ
దనరి యాచంద్రరవిమరుత్తారకముగ
వసుధ లక్ష్మీవిలాస మింపెసఁగుఁ గాత.

వనమయూరము. అధ్వగతదుర్భరశిలాకృతివధూటీ
సాధ్వసభిదోద్యమవిసారిపదధాటీ
యధ్వరవిదూషకఖలాద్రి శతకోటీ
మధ్వముని హృత్కమలమధ్యనిజవాటీ

**Colophon;**

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష సంప్రాప్త సారస్వతవైభవ యకలయామాత్యతనూభవరసికజనహృదయంగమసంగీతసాహిత్యకళా ధౌరంధర్యరాయసవేంకటపతిమంత్రి వర్యప్రణీతంబైన లక్ష్మీవిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి)—

సమగ్రము. ఐదాశ్వాసములు. వ్రాంత చిన్నది. తప్పులున్నవి. శైథిల్యగ్రంధపాతములు లేవు.

ఇందు సముద్రమథనమును, లక్ష్మీదేవిజననము, లక్ష్మీనారాయణుల వివాహమును వర్ణింపబడినవి. కర్తరాయసము వేంకటపతి. తండ్రి అకలయామాత్యుడు. ఆఱువేలనియోగి. వసిష్టగోత్రము. శ్రీరంగరాయల వ్రాయసకుడుగనుండి యాతనిచేత నగ్రహారాదికములను బహుమానముగానీకవిపడసెనట. విశేషములకు దాహృతభాగము గాంచునది. ఇది వేంకటేశాంకితము.

## No 735 లక్ష్మీవిలాసము.

## LAKSMĪVILĀSAMU.

Substance, palm-leaf. Size, 18¼ × 1¼ inches Pages, 105. Lines, 7 on a page Mode of writing, not good but fairly correct Condition, injured Appearance, old.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదికాదు. తప్పులంతగా లేవు. శైథిల్యమించుకకలదు గ్రంథపాతము లేదు.

ఇది పూర్వవర్ణితమైనగ్రంథమే.

## No 736. వల్లభాంబాపరిణయము.

## VALLABHĀMBĀPARINAYAMU.

Substance, paper. Size, $8\frac{7}{8} \times 6\frac{1}{4}$ inches Pages, 131 Lines, 21 on a page Mode of writing, good but not free from mistakes Condition, good Appearance, old

Begins on fol 97*a* The other works herein are Hariścandracaritra 1*a*, Paramabhāgavatavilāsamu 165*a*, Paramabhāgavatavilāsakathāsūci 181*a*, Naukācaritra 185*a*, Vallabhāmbāparinayasūci 211*a*, Rādhāmādhavavilāsamu 222*a*, Śrī-Kalahastiśatakamu 246*a*, Kāncipuspamañjari 267*a*, Arunācalamañjari 278*a*, Dāśarathiśatakamu 292*a*

Complete in three Āsvāsas

A poem by Akkenapalli Narasimhakavi, narrating the story leading to the marriage of Vallabhambā, daughter of Mainaka (the mountain chief), with Vighnēśvara The work was dedicated to Pulipaka Rāmayamantri, son of Sītayamantri No 388 of the Des Cat of Telugu MSS, may be referred to for particulars regarding the author.

**Beginning**.

శా. శ్రీరామామణి జానకీరమణి యై శ్రీమీఱ సేవింప భూ
భారంబంతయుఁ బూని సర్వజనులన్ బాలింపుచున్ సంతత
శ్రీ గంజిళ్లెడురామ మూర్తికరుణన్ జెన్నొందఁగాఁ బ్రోవుతన్
శ్రీరమ్యుం బులిపాకసీతమసుతున్ శ్రీరామమంత్రీశ్వరున్.

*　　*　　*　　*

సీ. నలువవిష్ణుమహేశ్వరులు నన్నపార్యతి
కాఁఖ్యపోతాఖ్యు లై ఖ్యాతి గాంచి
నీరజభాంధవేందీవరాప్తులు ధాత్రి
భాస్కరసోము లై పరిఢవిల్లి
గురుబుధులిరువురు గరిమ మీఱఁగ మల్లి
కార్జునశ్రీనాథు లై తనర్చి
పాకారిముఖ్యదిక్పాలకు లలసాని
పెద్దనాదికవు లై పెంపు మిగిలి
భారతాదిప్రబంధముల్ వరగఁ దెనుఁగు
[illegible]నరఁ గావించి రయ్యుత్తమోత్తములను

భక్తివిశ్వాసములఁ జిత్తపద్మమునను
నిలిపి కొలిచెదఁ గబ్బంబు నెగడుటకును

*

వ. అని యిష్టదేవతలకు నమస్కరించి సుకవుల సేవించి కుకవులం దృణీకరించి యెద్దియైన నేనొక శృంగారబంధుర ప్రబంధంబు రచియింపం దలంచియున్న యవసరంబున

సీ.

సుకవిపోషకుండు శోభిలుఁ బులిపాక
ఘనకులాంబుజాతదినకరుండు
రాజమాన్యకీర్తిగాజితుం డగురామ
సచివపుంగవుండు సంతసమున.

* *

మ. నను గోపీశ్వరపాదసంస్థితమనోనాళీకు మాధుర్యపా
కనిరూఢాశుకవిత్వశోభితు లసత్కారుణ్యు మేపార నిం
పున రావించి మృదూక్తి నిట్లనియె నీపుణ్యంబు పెంపై జగ
ద్వినుతిన్ భాసిలు నారసింహసుకవీ ధీరుండ వీ వారయన్

సీ.

గీ. వెలయు హేజీబుసత్కులకలశజలధి
పర్వచంద్రుండు సద్గుణభాసురుండు
వైభవేంద్రుండు శేషాచలాభిధేయ
మంత్రివర్యుండు మతి దేవమంత్రి యగుచు.

క. తనయునిఁ బెంచినయట్టుల
నను బెంచి వివాహ మొగి నొనర్చెను గరుణా
వననిధి గావున మీ రి
య్యనువునఁ గృతిఁ జలువ నేఁ గృతార్థుఁడ నగుదున్.

గీ. వితతముగ మిచుసప్తసంతతులయందుఁ
గృతియె సత్కీర్తి నిలను బ్రాకించుటకును
మూల మని తెల్పుదురు గాన ముఖ్యముగను
దంతిముఖు పెండ్లికథఁ బ్రబంధముగఁ గూర్చి.

క. జలజజభవమానులచే
నలరెడిగోత్రములలోన హరితసగోత్రం
బిలఁ దనరు దాన వెలయుఁ
బులిపాకకులంబు కల్పభూరుహ మగుచున్.

సీ. అంచెన్న జగ్గరా జావిర్భవించె నా
    సాధుమతికి రఘునాథుఁ డొదవె
నామహాత్ముండు సొంపమరఁ గృష్ణమ్మను
    వెంకును బోషితవిబుధుఁ డైన
రామయాఖ్యుని గంగరాజుఁ బాపన్న న
    చ్చన్నను గోనప్ప నలరఁ గాంచె
గోత్రసత్తర మట్టు కొడుకుల నాకోన
    యామాత్యుఁడు సరమ్మయందు నేమిఁ
బేరరాజును సుబ్బన్న బెంపుమీఱ
సుబ్బయాధిపు నతులయశోవిశాల
కల్పతరు లగు మువ్వురఁ గనియె సుతుల
వారు మూర్తిత్రయమ్ముభంగి వరలి రవని.

క. అందగ్రసంభవుం డిల
మందారవిభుండు పేరమంత్రి తనరెభూ
బృందారకబృందావన
తుందిలగుణవల్లికాప్రదోహలుఁ డగుచున్.

గీ. అయ్యనఘమూర్తినయవర్తి యమలగుణక
దంబ యైయొప్పు శ్రీవేరమాంబయందుఁ
గాంచె సీతయమంత్రిపుంగవునిఁ బ్రేమ
మించ సురనాథుఁడు జయంతుఁ గాంచినట్లు.

* * * *

సీ. వసుమతి నగ్నివైశ్వసగోత్రకలితుండు
    రేపుకులాబ్ధితారావరుండు
వేంకటనరుసు శ్రీవీరమాంబికయందు
    సుబ్బమ్మ ననుపమసుగుణవల్లి
యైనజోగమ్మ వెంకయ్య వియ్యమ్మను
    వెంకాంబ నమరేంద్రవిభవుఁ డైన

రామయ్యను నృసింహు రహిఁ గాంచె సుబ్బాంబ
  హారితసగోత్రజుం డైనయట్టి
మహితుఁ బాలూరికామయామాత్యునిఁగయి
కొనియె జోగాంబ కణ్వసగోత్రసంభ
వుండు గురిమెళ్లయచ్చనాఖ్యుండు సతిగ
నేలె నిందిర నబ్జాక్షుఁ డేలినట్లు.

క. ఇల హారితసగోత్రజుఁ డై
యలరినపులిపాకచలమయామాత్యవరుం
డెలమిన్ వియ్యాంబను దా
విలసిల్ల వరించె నింద్రవిభవం బెసఁగన్.

గీ పాలితబుధాళి సద్గుణపాలి రాజ
మాన్యనయకేళి రామయమంత్రిమౌళి
పరగునాచంబ చెలమయ్య వట్టియైన
సీతమాంబకవలన విఖ్యాతి మీఱ.

గీ. కనియె వేంకటసుబ్బరాయనిఁ గళాభి
వర్ధమానసుధాకరు వన్నెమీఱ
నతనిమేనత్త యైనవెంకాంబ నెలమిఁ
జేకొనియె సీతయామాత్యశేఖరుండు.

*       *       *       *

గీ. వేడ్క నాసీతయాఖ్యుఁ డావేంకమాంబ
యం దెసఁగఁ బేరరాజు సుబ్బాభిధేయుఁ
దతవిభాసూర్యుఁ రామప్రధానవర్యుఁ
గనియె ముప్పురుతనయుల ఘనవినయుల.

గీ. అందుఁ గన నగ్రజుండు బేరాభిధాన
శౌరి విలసిల్లు సద్గుణశాలి యగుచు
నుప్పలూరికనకమంత్రి మెప్పు లొనరఁ
గనిన శ్రీరామలక్ష్మి త న్నెనసికొలువ.

క. ఆమహితాత్మునితమ్ముఁడు
రామయమంత్రీంద్రుఁ డలరు రాజితకీర్తి

స్తోమజ్యోత్స్నావృతది
గ్భామాకుచతారహారపటలుం డగుచున్.

* * * *

గీ. ప్రబలు శ్రీవత్సగోత్రుండు భాసమాన
యశుఁడు నందూరినారసింహాఖ్యుఁ డెలమి
వెంకమాంబిక గనినట్టిబియ్యామాంబ
రాణి యై కొల్వ గురుతంత్రి రామమంత్రి.

* * * *

క. విలసితధర్మజ్ఞునకున్
సలలితలిపిఁజిత్రగుప్తసమునకు విభవో
జ్జ్వలునకుఁ బులిపాకాన్వయ
జలనిధిసచివునకురామసచివేంద్రునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనినవల్లభాంబా
పరిణయం బనుశృంగారప్రబంధంబునకుం గథావిధానం బెట్టి దనిన.

* * * *

గీ. అందు సూతునితో సనకాదిమునులు
గణపతివివాహకథ వినఁ గౌతుకంబుఁ
బొడమె మా కది ప్రేమఁ దెల్పు మన వారి
నెలమి నకథకుఁడు గని యిట్టు లనియె.

**End:**

దేవదేవేంద్రముఖ్యులు దేవమాని
వారములు వారివారినివాసములకుఁ
బోవ విన్నప మొనరింపఁ బూని కొంకు
భావముల నుండి రన వామదేవుఁ డెలమి.

* * * *

మాలిని. ప్రకటితనయవర్తీ భాసురానందపూర్తీ
సుకవివినుతశీలా సూరిలోకానుకూలా
వికటవిజయజన్యా విప్రరాజన్యమాన్యా
సకలశుభవిచారా చారుకీర్తిప్రచారా।

**Colophon:**

ఇది శ్రీవెల్లమందకోటీశ్వరమహాదార కృపాకలశపారావారల
బ్ధకవితామృతధారావిజృంభ ణాకొనపల్లికులార్ణవపూర్ణోత్పలమిత్ర కాం

డిన్యగోత్ర పవిత్ర వెంకటపతినారసింహపౌత్ర జోగయామాత్యపుత్ర సుక వివిధేయ నరసింహాభిధేయప్రణీతం బైనవల్లభాంబాపరిణయం బనుశృంగారమహాప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. మూఁడాశ్వాసములు. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేకపోలేదు శైథిల్యగ్రంథపాతములు లేవు

ఇందు మైనాకునిపూఁతు రగువల్లభాంబకును విఘ్నేశ్వరునకును నైన వివాహవృత్తాంతము ప్రతిపాదింపఁబడినది గ్రంథకర్త అకెనపల్లినరసింహకవి జోగయామాత్యునిపుత్రుఁడు దీనిని బలిపాకరామయమంత్రి కంకితముచేసెను విశేషముల కుదాహృతభాగముఁ గాంచునది. డి. క్యా. నె 383 రున నీకవినిగుఱించి వర్ణింపఁబడినవిషయముం గాంచునది.

## No 737. వల్లభాంబాపరిణయసూచి.

## VALLABHĀMBĀPARINAYASŪCI

Pages, 10 Lines, 19 on a page Mode of writing, good and correct

Begins on fol 211*a* of the MS described under the previous number

Complete

This is a table of contents of the Vallabhāmbāparinayamu, described under the previous number The figures denote the number of stanzas in the work

**Beginning:**

ఇష్టదేవతాప్రార్థన, ౬౧ కృతిపతివంశానువర్ణనకవివంశవర్ణన మొదలైన యవతారికపద్యములు

**End:**

వారక్రీడసల్పు ౫౮. ౨౧౬ పరమేశ్వరుడు సకల దేవతలకున్ను బహుమానములుయిచ్చి వారివారి యిండ్లకుపంపించడము.

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాఁతతిన్ననిది. వల్లభాంబాపరిణయకథాసూచి యిందుఁబద్యసంఖ్య యీఁబడినది.

## No. 738. వసుచరిత్ర.

## VASUCARITRA

Substance, paper Size, 8 × 6¼ inches Pages, 380 Lines, 14 on a page Mode of writing, good but not free from mistakes Written on only one side of the paper Condition, fair Appearance, old

Complete

Same work as that described under R. No 34 of the Tri Cat of MSS , Vol 1, Part 3

This well-known classical poem narrates the story of the birth of Girikā, daughter of Śuktimati (river), and Kōlāhala (mountain) and her marriage with Vasu, king of Cēdi country The author is Rāmarājabhūṣana The work was dedicated to Tirumaladēvarāya, brother of Rāmarāya, the son-in-law of Kṛṣṇadēvarāya. The author is said to have received gifts of villages and other presents from the patron and his brother, in appreciation of his works in Sanskrit and Telugu The patron's titles are given as Vīrapratāpa, Cālukyanārāyana, etc For particulars regarding the patron see the Telugu extracts below

**Beginning:**

శా. శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్థలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచుం మదిన్
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పుసీ
తాభామాపతి ప్రోవుతన్ దిరుమలేంద్రశ్రీమహారాయనిన్.

మ. మహిమ మున్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూల మైనిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూహించెదన్.

* * * *

వ. అని యిష్టదేవతావందనంబును సుకవికవితాభినందనంబును గుకవినిందనంబును గావించి సనాతనాధునాతనమహాకవిజనానుగ్రహంబునం బురాతనపుణ్యశ్లోకరాజర్షివర్ణనాకర్ణనోత్కంఠితసకలజనసేవ్యం బగు నొక్కమహాకావ్యంబు రసోచితచమత్క్రియాకల్పనాకల్పభవ్యంబుగా నొనరింపం బూనియున్నసమయంబున.

సీ. వసుమతీభారధూర్వహత నెవ్వనియుర్వ
రావరాహాంక మర్థము వహించుఁ
గరగతచక్రవిక్రమశక్తి నెవ్వాని
రామానుజత్వంబు రమణ కెక్కు
జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
వ్వానిలోకేశ్వరత్వము పొసంగుఁ
జటులశౌర్వరమగ్నసర్వవర్ణోద్ధార
పటిమ నెవ్వనిరాజభావ మెసఁగు

నతఁడు వీరప్రతాపరాజాధిరాజ
రాజపరమేశ్వరాష్టదిగ్రాజకులమ
నోభయంకరబిరుదసన్నుతజయాభి
రామగుణహారి తిరుమలరాయశౌరి.

---

వ. . . . . . . . . . . . . . త్రైలోక్య
వినుతచాళుక్యనారాయణాంకసంకల్పితాశేషపోషణప్రాభవుండును, కృ
పాణకృష్ణనిర్మథ్యమానరణార్ణపసముత్పన్నవిజయలక్ష్మీనిరీక్షణనర్మక
రమకరపతాకాలోకనమాత్రసంపాదితకంపస్వేదభీరూ భవన్నానావజీర
సేనామానభేదనుండును, శ్రీరామచంద్రచరణకమలయుగళాభివాదనుండు
ను, ఆత్రేయగోత్రపావనుండును శ్రీరంగరాజరత్నరత్నాకరపూర్ణచం
ద్రుండును, అగుశ్రీతిరుమలరాయదేవేంద్రుండు నిస్తంద్రవిభవనాంద్రుం
డై యొకనాఁడు . . . . . . . . . . . ఆదినారా
యణుకరణి సిరుల నిరవొందుచు.

సీ. కటకేంద్రుఁ డనిపినగంధసింధురము లా
త్మస్వామిమాటలు హస్తములు మొగుప
హయనాథుఁ డనిపినహరులు కైజా-మోర
లార్పుచుఁ బతికి జోహారు సేయ
నావాడపతి వంపినయమూల్యకటకముల్
కర్తపేరుగఁ బద్మాగ్రములఁ బెనఁగఁ
బాండ్యేశుఁ డనిపినభర్మంబు లధిపతి
ప్రతిగా నిజాంకముద్రలు వహింప

శౌర్యకీర్తులతో వచ్చుసకలదిక్న
రేంద్రరాజ్యేందిరలమాడ్కి నిగురుబోండ్లు

చటులమాణిక్యమయదండచారుచామ
రములు వీవంగఁ బేరోలగమున నుండి.

మ. నను శ్రీరామపదారవిందభజనానందుఁ జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెన్ గృపన్.

శా. శ్రీరామక్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులన్ బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాదిస
త్కారం బందితి రాజభూషణకవీ ధన్యుండ వీ వన్నిటన్.

తే. తరుతటాకాదిసంతతుల్ ధరణి నెచట
నిలిపి రచటనె యుండు వానికివి కృతిము
ఖంబునను విశ్వవిఖ్యాతి గాన కృతియె
సంతతివతంస మది మాకు సంఘటింపు.

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

వ. అని బహుమానంబుగాఁ దాంబూలజాంబూనదాగ్రహారాదిప్రదానంబుల నాదరించుటయు నేను నానందకందళితాంతరంగుండ నై కృతిపతివంశావతారం బభివర్ణించెద.

సీ. . . . .
అంబుజాసనుఁ డన విధుఁ డనఁగ సోముఁ
డన నెగడి హంససంగతిఁ దనర సురలఁ
బ్రోవ దాక్షాయణీప్రేమఁ బూననేర్చు
జాణ చంద్రుండు కాంతినిస్తంద్రుఁ డలరు

చ. అతనికిఁ గల్గె సౌమ్యుఁడు గుణార్ణవరమ్యుఁ డతం డవార్యదో
ర్యుతదివిజారిభైరవుఁ బురూరవుఁ గాంచెఁ జిరాయు వాయు వా
కృతికి జనించె నాసుకృతికిం గలిగె న్నహుషుం డకల్మషుం
డతనికిఁ బుట్టె శౌర్యదళితారి యయాతి తదన్వయంబునన్.

శా. ద్వీపప్రాధ్భవసూక్తపంచమమహావేదంబు దీపించె నే
భూపాలోత్తము పేర భారతియు నేపుణ్యాత్మువంశస్తవం
బాపాదించి కృతార్థ యయ్యె నతఁ డాశాంతనుమాపాలన
వ్యాపారాధిరతుండు పొల్చు భరతుం డాత్రేయగోత్రేయుఁ డై.

ఉ. ఆభరతాన్వయంబున రణాధ్వరయూపమహాభుజుల్ ధరి
త్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు
ర్వీభరణప్రవీణులు వివేకధురీణులు దాననీతిశా
స్త్రాభిహితుల్ సుధీయుతులు దారదయాహృదయుల్ శుభోదయుల్.

క. ఆసంతతి వైభవజిత
వాసవుఁ డగు తాతపన్నవసుధాధవుఁ డు
ద్భాసిల్లెఁ గీర్తిమయము
త్రాసాధసువర్ణకలశితవిభావసుఁ డై

ఉ. ఆసుగుణాఢ్యకిం బ్రశమితాఖిలదోషుఁడు చక్రపాలనా
భ్యాసుఁడు సోమదేవుఁ డనుసద్భుతశీలుఁడు గల్గె నాకళా
భ్యాసికి నుద్భవించె దురహ కృతిమత్పరవాహినీశసం
త్రాసదబాణలాఘవుఁడు రాఘవుఁ డాజికృతప్రమోదుఁ డై

క. ఆవిభునకు నర్జునపరి
భావకుఁ డై పిన్నశౌరి పగిదిఁ బొడమె వం
శావహుఁడు పిన్నశౌరి ర
మావల్లభుఁ డత డు బుక్కమహీధవుఁ గాంచెన్.

*    *    *    *

క. ఆబుక్కన్నపతి కతుల భు
జాబంధీకృతమదాంధశత్రుగమావే
ణీబంధవిలసదసిధా
రాబంధురుఁ డైనరామ ` జు జనించెన్.

సీ.

అతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ డాక్రాంతుఁ
డనుపమస్వాంతుఁ డాశ్రితవనవసంతుఁ
డనఘుతరకందనోలిమహాపురీని
శాంతుఁ డగు రామమేదినీకాంతుఁ డలరు.

శా. ఆరామక్షితిభర్తకుం బ్రథితసత్యాలాపధర్మోద్భవ
శ్రీగమ్యుం డగుతిమ్మరాజు బలలక్ష్మీధామభీమప్రభా
పారీణుం డగుకొండశౌరి విజయప్రఖ్యాతచారిత్రుఁ డా
శ్రీరంగేంద్రుఁడుఁ గల్గి రైందవకులక్షేమంకరాకారు లై.

శా. ఆరాజత్రితయంబులో నసమబాణారాతివిజ్ఞాతదో
స్సారుం డాప్తసుభద్రుఁ డర్జునగుణశ్లాఘ్యుండు నై పొల్చునా
శ్రీరంగేంద్రుఁ డశేషరాజ్యపదవీసింహాసనాక్షీణల
క్ష్మీరాజన్నిజసంతతిప్రథితుఁ డై మించెన్ ధరామండలిన్.

*　　*　　*　　*

క. ఆమనుజేంద్రునకుఁ బురం
ధ్రీమణి యై తిమ్మమాంబ శ్రీరామునకున్
భూమిజ సుత్రామునకుఁ బు
లోమజయును బోలె జగములో నుతికెక్కెన్.

*　　*　　*

శా. చేతోజాతసమానమూర్తి యగునాశ్రీరంగధాత్రీధవుం
డాతిమ్మాంబికయందుఁ గోనవిభుఁ దిమ్మాధీశు రామప్రభున్
ధూతాశేషవిపక్షు శ్రీతిరుమలేంద్రు న్వేంకటాఖ్యానవి
ఖ్యాతుం గాంచె సురద్రుపంచకము నయ్యంభోదిరాజుం బలెన్.

క. అం దగ్రజుండు రాజపు
రందరుఁ డన వెలసెఁ గోనరాజు నిజభుజా
సందీపితాసిభిదుర
స్పందనిపాతితమదవిపక్షోత్కరుఁ డై.

*　　*　　*　　*

క. ఆతనితమ్ముఁడు తిమ్మ
క్ష్మాతలపతి పొగడు గనియె ఘనుఁ డనఁ గీర్తి
వ్రాతవినూతనకైతక
జాతద్యోతనకృపాణచపలాన్వితుఁ డై.

సీ. . . . . . . . .
జగతి నీమేటి కని నృపు ల్పొగడ నెగడె
వేబిరుదరాయరాహుత్తాహితవధూభు

64-A

జంగబిరుదాంకపుంఖితసమరవిజయ
కాహళుఁడు దిమ్మవిభుఁ డాజిదోహళుండు.

సి. పట్టాభిషేకవిపర్యయంబునఁ బ్రోలు
వెడలి ప్రియానుజుల్వెంటఁగొలువఁ
చిత్రకూటాభిఖ్యఁ జెలఁగు పెన్గొండసాం
ద్రహరిద్విపేంద్రనాదవనిఁ జెంది
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి
మహిమసలకఖరస్మయ మడంచి
హరిహీరభటమహోద్ధతి నబ్ధి కంపింప
దుగమునఁ గదిపి తద్ద్రోహిఁ దునిమి

యనఘతరపార్థివేందిర నధిగమించి
సాధుకర్ణాటవిభవసంస్థాపనంబు
పూని శరణాగతుల నెల్లఁ బ్రోచె రాముఁ
డతఁడు నిజచరితంబు రామాయణముగ

మ. హరిశౌర్యుం డగు రామభూవిభునితీవ్రాటోపవద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలముల్ జాఱిన దళాడంబరం
బరుగం గొమ్మలు వోవ లావఱి నిజామాదు ల్వజీరుల్ భజిం
తురు నమ్రత్వము గానలో ముసలిమాను ల్గా వితరింపఁగన్.

సీ ఎదలపైఁ బొదలుపయ్యెదలు జారఁగఁ బాఱు
బిబ్బీలకు మసుంగు లబ్బఁ జేసె
ఘనభేరికాధ్వను ల్వని గుండియలు వ్రీల
వ్రాలుమలకలకు గోలీలు చేసె
నుడుగనివిభ్రాంతిఁ దడగాల్లు వడ నిల్చు
ఖానులు డాగఁ జీఁకటులు చేసెఁ
గడలేనికాందిశీకత నేఁగుతమ కుర్వి
జడధు లెల్లను గాలినడలు సేసె

ననుచు శిరములఁ దాల్తు రెవ్వనిసమగ్ర
సైన్యధుతధూళిచకితు లై చనుసపాద

కుతుపశాహినిజామాదికుతలపతు ల
తండు న్నపమాత్రుఁడే రామధరణివిభుఁడు.

* * * *

సీ. ప్రబలావలేపవిగ్రహజాయమానాగ్ర
హము డించి బహుధావనాప్తిఁ గాంచుఁ
బుర మెల్లఁ బ్రత్యగ్రభూతిపాలుగఁ జేసి
యచలాసనాభ్యాసి యైక్యశించు
రతినిభరామానుగతమైత్రిపై రోసి
కలనైనఁ గళ్యాణకాంతఁ యుడఁడు
సరిబిఁ బ్రాణాయామసంసిద్ధికై సారె
సారెకుఁ గుండలిస్థాన మంటు
మానక నిజాముఁ డపవర్గమార్గవృత్తిఁ
బెరయుపరబుద్ధి నెవ్వాని పేరు దలఁచి
యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికిఁ దగఁడె
సేతుకాశీతలాంతరఖ్యాతయశుఁడు.

చ. అరిజయకీర్తిసాంద్రుఁ డగునయ్యభిరామనరేంద్రసోదరుం
దిరుమలదేవరాయల నుతింపఁ దరంబె తదీయ హేతిశాం
కరి యతిలోహితావయవగాఁ దను నాత్మహృదంతరంబులన్
దరలక దాల్చువారలకుఁ దార్చు సురీవరణీయవైఖరుల్.

క. ఆరాయమణికి జగతీ
హారాయితకీర్తిఘృణికి ననుసంభవుఁ డై
నారాయణాంశభవుఁ డితఁ
డౌరా యన వేంకటక్షమాధిపుఁ డలరున్.

సీ. నిరతంబు దుర్మార్గనిగతు లౌతురకల
నతులసన్మార్గసంగతులఁ జేసె
ననియతమోహాంధు లౌపాంగసీకుల
స్వస్త్రీసుఖై కనిశ్చలులఁ జేసె
నతినిర్దయాత్ము లౌయవనుల భూతసం
తానతృప్తిప్రదాత్మకులఁ జేసె
ద్విజపతుపాతంబు దెగడుపాశ్చాత్యుల
ద్విజపక్షపాతభావితులఁ జేసె

ననుచుఁ గడు మెచ్చి జయలక్ష్మి యాజిరంగ
కాతరబరీద కేతనఘటితభద్ర
కలశ మెదురుగఁ బూని యేఘనునిఁ జెంచె
నతఁడు సామాన్యుఁడే వేంకటాద్రివిభుఁడు.

మ. కడిమి న్వేంకటరాయశౌరి కెదురంగా లేక యత్యాహతం
బడరన్ గౌతమి దాఁటువేళ నిజకాంతాశ్రుప్రవాహోక్తిఁ గా
ల్నడ దప్పన్ జడుఁడై నిజాయముఁ డుడుపాలంబంబునన్ దాఁటి యె
కరుడఁగన్నన్ భజియించు నయ్యుడుపరేఖ న్నామ మోహంబునన్.

ఉ. ఏకసపాదలక్షమిత మింద్రజనోచ్చరితప్రబంధ మ
స్తోకమె యంచుఁ జాపజితధూర్జటి వేంకటశౌరి శార్యదీ
ప్తాకృతికర్ణభీష్మజయశక్తి ననేకసపాదలక్షసం
ఖ్యాకమనీయభూరివిభవాప్తి వహించు నుదంచితోన్నతిన్.

ఉ. ఆయనుజుల్విశుద్ధహరిదంతమహాకరిదంత కాంతి రే
ఖాయతకీర్తులై కొలువ గౌతమినీటనరాతిఘాతికా
శ్రేయకరక్తము ల్గడిగి శ్రీగమణీవరమూర్తి రామభూ
నాయకుఁ డుర్వి యేలె భువనస్తవనీయ జయాభిరాముఁడై.

క. ఆరామ రి పిమ్మట
ధీరామరశాఖి వీరతిరుమలరాయం
డారామ పేతుహీమవ
త్క్షారమణీరమణుఁడై జగంబు భరించెన్.

సీ. ఖహామహీధరకూటపటలి పాలుగఁ జేసె
గంధాంధసింధురఘటల నెల్ల
శాఖిశాఖాశిఖాచయములఁ దగిలించె
నమితకోదండదండముల నెల్ల
శరధికుటుంబినీఝురుల వెంబడిఁ బంచె
రామాకుచాగ్రహారముల నెల్ల
మర్దమకర్దమస్తోమంబులో వైచె
విజయమంగళశంఖవితతి నెల్లఁ

దగవరి గదాని ఘాముఁ డుద్దండజయప
టిష్ఠతిరుమలరాయగూధాటిని జలించి
ప ఱచు నెడ శక్తిమెఱిచియు మఱువఁ డయ్యెఁ
దత్తదుచితప్రవేశసంధానయుక్తి

చ. తిరుమలరాయశేఖరునిధీరచమూభటరాజి యాజిభీ
కరయవనేశ్వరప్రహితఖానబలంబులఁ జక్కఁజేయ ని
ద్ధరఁ బెనుగొండకొండలు మదద్విపచర్మకపాలమాలికా
పరికరభూషితంబు లయిబల్విడిఁ గాంచె గిరీశభావముల్.

మ. ధర నెవ్వానికి వ్రాయఁ బ్రహ్మజుఁడు వ్రాఁత ల్వానితో నేగు న
స్థిరముల్ శాశ్వతకీర్తి యాతిరుమలశ్రీరాయనారాయణుం
డు రహిన్ వ్రాసినశాసనాక్షరము లుండుం బుత్రపౌత్రాన్వయ
స్థిరవృత్తిన్ బృథుకాక్షరంబులు గురుశ్రీవర్ణతుల్యంబు లే.

*   *   *

తే. ఆవిభునిదేవి శ్రీవేంగళాంబపుట్టి
నిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁ జేసెఁ
బుట్టినిటికి మథనంబు మెట్టినింటి
కమితదోషాహతియుఁ గూర్చుకమలఁ దెగడి.

ఉ. ఉంచినయగ్రహారముల నున్నతవైఖరి విద్యలెల్ల ర
ప్పించినవిప్రవక్త్రములఁ బెంచిననవ్యవనోత్కరంబులన్
నించినబల్తటాకముల నెమ్మిఁ గనందగు వేంగళాంబ య
భ్యంచితకీర్తిసౌధవిశదాక్షరసూనమరాళరాజమై.

*   *   *

శా. ఆరాజద్గుణశాలి తిర్మలమహారాయుండు శ్రీవేంగళాం
బారామామణియందుఁ గాంచె సుతులం బ్రఖ్యాతసత్కీర్తిల
క్ష్మీరాముల్ రఘునాథభూమిరమణున్, శ్రీరంగరాయాగ్రణిన్,
శ్రీరామావనినాథుఁ బ్రాభవనిధిన్ శ్రీవేంకటక్ష్మావరున్.

క. ఆజగదభినుతసుగుణస
మాజులలో నగ్రజుండు మహనీయయశో
రాజీవాసనుఁడు సుధీ
రాజీవాసనుఁడు వెలసె రఘునాథుఁ డిలన్.

సీ. . . . . . . .

అవనిన సహాయశూరత నధిగమించు
ననఘ తిరుమల రాయనందన సమిద్ధ
ధీరరఘునాథభుజపిరిఁ బీటపెట్టు
సాహసోదగ్రబిరుదవరాహమూర్తి.

శా. యాదోరాశిగభీరమూర్తి రఘునాథాధీశుఁ డుద్దండబా
హాదర్పాంధసపాదమల్లికనిజామానీకముం ద్రుంప జ
న్యాదూరక్షితిఁ బారుకృష్ణకును గృష్ణాంకంబు నాఁ డబ్బె బి
ల్పిదీవ్యన్నయనాబ్జకజ్జలజలాభీలప్రవాహంబునన్

* * * *

చ. వారిపదభక్తిశీలుఁ డగునారఘునాథనృపాలుకూర్మిసో
దరుఁడు సిరంగరాయవసుధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయశేఖరవితీర్ణమహాయువరాజపట్టబం
ధురుఁ డయి సర్వభూభువనధూర్వహశక్తి వహించు నెంతయున్.

* * * *

సీ. కుంతలస్థలికి నేగుణగరిష్ఠునిచీటి
కమనీయకేతకీగర్భదళము
మంజులలాటసీమకు నేమహాభాగు
తేజంబు కాశ్మీరతిలకరేఖ
పక్షభాగమున కేవైభవాధికునియ
పారకీర్తిమతల్లి హారవల్లి
కాంచిదేశమున కేఘనునినంతతదాన
వారినిర్ఝరధార హీరరశన
యంగమున కెవ్వనిచమూతురంగకోటి
ధాటికాధుతధూళి మాందాళి పట్టు
సమధికాకల్పరుచిపూను జగతి కతఁడు
రాజమాత్రుండె శ్రీరంగరాయశౌరి.

మ. జలధిన్ దానపయోధునీర్ఝురులచేఁ జంద్రున్ యశోలక్ష్మిచే
జలదవ్రాతము నాత్మకారితమహాసత్రాగ్నిధూమంబుచేఁ
జెలువొప్ప న్వెలయింపజాలు ఛళిరే శ్రీరంగరాయక్షమా
లలనావల్లభుఁ డెల్లదాతలకు నెల్లన్ దాత యూహింపఁగన్.

* * * *

మ. ఘనశౌర్యుండు సిరంగరాయ నరలోకస్వామితోఁబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధిపయోమధ్యోర్విశ్రీరంగప
ట్టణలంకానగరంబు పుణ్యజనపీడావార్త లేకుండఁ గై
కొనియె న్మిత్రభవోపకారనిరపేక్షుండై విచిత్రంబుగన్.

*　*　*　*

క. ఆరఘునాథప్రభృతిధ
రారమణేంద్రులకు మువ్వురకు సోదరుఁ డై
సారమతి వెంకటపతి
శ్శ్రీరమణీప్రియుఁడు వెలయు శత్రుఘ్నుఁ డనన్.

*　*　+　*

మ. హరుఁడా తారకశైలదుర్గమున నధ్యాసీనుఁ డై రాజశే
ఖరవిఖ్యాతి రహించుఁ జంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖరసదాసంసేవ్యుఁ డై యార యి
ద్దర బంటేలికవాసి తద్గిరులకుం దద్వల్లభశ్రీలకున్.

*　*　*　*

క. ఆతనయులు జగతీ వి
ఖ్యాతనయులు గొలువ శాశ్వతైశ్వర్యకళా
న్వీతుఁడు తిర్మలరాయో
ర్వీతలనాయకుఁడు వెలయు విభవోన్నతుఁ డై.

సీ. ఎంతకాలము మహాశాంతసంగతి దివ్య
　　దంతావళంబులు దరలకుండు
నెంతకాలము వరాహేంద్రుఁ డద్వంద్వుఁ డై
　　కల్పము ల్వనరాశి గడపుచుండు
నెంతకాలముభుజంగేశు డాదిమభిక్షు
　　పదనిషేవణనిష్ఠఁ బాయకుండు
నెంతకాలముగిరు లంతతాభ్యున్నతి
　　నలహంసపద్ధతి నంటియుండు
నంతకాలముఁ దనయందఁ యచలయై య
నంతయై రత్నగర్భయై యవని యలర
నలరుఁ గర్ణాటరాజ్యసింహాసనాధి
రాజ్యశుభశాలి తిరుమలరాయమౌళి.

క. ఉన్నతజయజన్యబిరుద
మన్నెవిభాళాదిబిరుదమాన్యునకు మహో
ద్యన్నిబిడజన్యపటహాజ
ఘాన్నినదతురదరిచ్ఛటాసైన్యునకున్.

* * * *

క. ధీరవివిధారిగిరిపవి
ధారికిఁ గర్ణాటకాంధ్రధరణీపునరు
ద్ధారికి దిరుమలదేవమ
హారాయాగ్రణికి వితరణామరమణికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనినవసుచరిత్రం బనుమహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

శా. శ్రీగమ్యంబగు నైమిశంబునఁ దపశ్శ్రీగాఢితావ్యాజతే
జోరాజుల్ శౌనకాదిమునిరాజుల్ సూతజుం జూచి ము
న్నారాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుఁడై యేలె న్మహీమండలం
బారాజేంద్రునిఁ జెప్పు మా కన నతం డత్యంతహర్షంబునన్.

* * * *

**End**

మ. ద్రుఢబాహాబలభీమ భీమసమరప్రేంఖజ్జయశ్రీపరి
వ్రఢిమాఢౌకితభూమ భూమహితతూర్యధ్వానదత్తేశధా
కరఘమత్కారగవినామ నామకధనక్లామ్యన్మహాఢిల్లికా
గధరాడాద్యరిధామ ధామగరిమగ్రస్తగ్రహాధీశ్వరా.

**Colophon**

గద్య. ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాద సమాసాదితసంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతం బైనవసుచరిత్రం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

సమగ్రము. ఆఱాశ్వాసములు వ్రాఁతలున్నవి. పత్రమున నొకవైపుననే వ్రాయఁబడినది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతము లంతగా లేవు.

(బి-బి.)—

ఇది చేదిదేశాధిపతి యగువసుమహారాజచరిత్రము. శుక్తిమతీనది కిని కోలాహలపర్వతమునకును గిరిక యనుకన్యక జన్మించుట వసురాజు

నకును గిరికకును నైనవివాహము మున్నగుగాథలను ప్రతిపాదించునొక రసవత్తరశృంగారప్రబంధము. కర్త రామరాజభూషణుఁడు కృతిపతి తిరుమలదేవరాయలు. ఈతఁడు కృష్ణదేవరాయల కల్లుఁడగు నళియరామరాయలకు సోదరుఁడు. చాళుక్యనారాయణ వీరప్రతాపేత్యాదిబిరుదములు గలవాఁడు ఈ కవి యీ కృతిభర్త వలన నగ్రహారాద్యనేకబహుమతులను బడసె నట. ఇతనియన్నయగుశ్రీరామదేవరాయలను సంస్కృతాంధ్రకవిత్వపటిమచే మెప్పించి యాతనివలనను నగ్రహారాదికములగు పెక్కు పారితోషికములఁ జెందెనట. విశేషములుదాహృతభాగమువలనఁ దెలియునది.

## No 739 వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 18¼ × 1½ inches Pages, 110 Lines, 9 on a page Mode of writing, good but quite incorrect Condition, good Appearance, old.

Complete.

Same work as the above

The name of the scribe and the date of transcription are given below as found at the end of the manuscript

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతయందమైయునది. తప్పులు పెక్కుగలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు

పూర్వము వోలె.

గ్రంథాంతమున " దుర్మతినామసంవత్సర భాద్రపద బ x శనివారంనాటికి సంపూర్ణమాయెను. వింజమూరి సుబ్బారాయుడి దస్తూరి " అనియున్నది.

---

## No 740. వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 16½ × 1⅜ inches Pages, 18 Lines, 7 on a page. Mode of writing, good but not free from mistakes. Condition, fair Appearance, old

Contains about 100 stanzas from the beginning of the second Āsvāsa. Same work as the above

(వి-వి)—

కొంచెముకొఱగా రెండవయాశ్వాసముతొలినుండికలదు వ్రాంతయందమయినది. తప్పులున్నవి శైథిల్యమించుకలదు. గ్రంథపాతములు లేవు

పూర్వము వోలె.

## No 741. వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, $16\frac{7}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 50 Lines, 8 on a page Mode of writing, not good and not correct Condition, injured Many leaves are broken and many missing Appearance, very old

Contains the first two Āsvāsas

Same work as the above

The date of transcription as found at the end of the manuscript is given below.

(వి-వి.)—

తొలిరెండాశ్వాసములుమాత్రముగలవు వ్రాంత యంతమంచిది కాదు. తప్పులుకలవు. శైథిల్యమువిశేషించికలదు. కొన్నిపత్రములు తునిఁగిపోయినవి. కొన్నికానరావు గ్రంథపాతములునుగలవు

పూర్వము వోలె.

గ్రంథాంతమున "వికారినిజ శ్రావణ ౩౦ లు వ్రాశినాము" అనియున్నది.

## No. 742 వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, $16\frac{1}{2} \times 1\frac{5}{8}$ inches. Pages, 343 Lines, 5 on a page Mode of writing, fair but quite erroneous Condition, much injured Appearance, very old

Complete, but some leaves are missing

Same work as the above

(వి-వి.)—

సంపూర్ణము. వ్రాంత యొకతరబడిగానున్నది. తప్పులు మెండు. శైథిల్యముచాలకలదు. గ్రంథపాతములు కలవు. పత్రములుకొన్ని లేవు

పూర్వము వోలె.

## No 743 వసుచరిత్రము
## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 16⅞ × 1¼ Pages, 271 Line, 1 on a page Mode of writing, fair but not correct Condition, good Appearance, old

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతయొకతరబడిగానున్నది. తప్పులుమెండు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పూర్వము వ్రాఁతె.

---

## No 744. వసుచరిత్రము.
## VASUCARITRAMU.

Substance, palm-leaf Size, 15⅜ × 1⅜ inches Pages, 10 Lines, 7 on a page Mode of writing, fair but incorrect Condition, injured Appearance, very old

A fragmentary portion in the second Āśvāsa

Same work as the above

(వి-వి.)—

రెండవ యాశ్వాసమునందలి కొన్ని పద్యములున్నవి. వ్రాఁత యొక తీరుగా నున్నది. తప్పులున్నవి. అతిశిథిలము.

పూర్వము వ్రాఁతె.

---

## No 745. వసుచరిత్రము
## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 13¼ × 1½ inches Pages, 163 Lines, 9 on a page. Mode of writing, good but not quite incorrect Condition, much injured Appearance, very old

Complete.

Same work as the above.

The name of the scribe and the date of transcription are given below as found at the end of the MS. in the form of a Sanskrit stanza

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యందమయినది. తప్పు లంతగా లేవు. శైథిల్యము మెండు గ్రంథ పాతము లేదు.

పూర్వము వ్రాఁతె.

గ్రంథాంతమున—

"ఆకీలకశరత్పుష్యద్వాదశ్యాంలిఖితంమయా । ఏతత్కల్యాణ చారిత్రం కల్యాణాచార్యశర్మణా" అని కలదు.

---

## No 746. వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 18¼ × 1½ inches Pages, 130 Lines, 8 on a page Mode of writing, fair and apparently correct. Condition, slightly injured Appearance, old

Complete

Same work as the above

The date of transcription is given below in Telugu as found at the end of the MS

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత యొక తరబడిగానున్నది తప్పు లంతగా లేవు శైథిల్యము స్వల్పముగాఁ గలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

గ్రంథాంతమున—

మన్మథనామ సంవత్సర పుష్యశుద్ధక ఆదివారం రోజు . . . . . . వసు చరిత్ర లిఖితం సంపూర్ణమయినది" అని యున్నది.

---

## No 747. వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 18½ × 1½ inches Pages, 214 Lines, 6 on a page Mode of writing, good but not quite correct Condition, much injured Appearance, old Many leaves are broken and many are not found

Complete, but contains many omissions.

Same work as the above

The name of the scribe and the date of transcription are given below in Telugu as found at the end of the MS

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులును గలవు. శైథిల్య మధికము పెక్కుపత్రములు కానరావు. గ్రంథపాతములు చాల గలవు.

పూర్వము వలె.

గ్రంథాంతమున—

"విక్రమనామ సంవత్సర భాద్రపద బహుళత్రయోదశీ బుధవారం నాడు . . . మద్దాలి నరసన వ్రాశియిచ్చిన వసుచరిత్ర . . ."

అని యున్నది.

## No 748. వసుచరిత్రము.

## VASUCARITRAMU

Substance, palm-leaf Size, 16 × $1\frac{1}{4}$ inches Pages, 8 Lines, 6 on a page Mode of writing, not good and not correct Condition, injured Appearance, very old Many leaves are broken

Contains the Āśvāsas one and two complete

Same work as the above

(వి-వి.)—

తొలి రెండా శ్వాసములు మాత్రము వ్రాత మంచిదికాదు. తప్పులు కలవు. శైథిల్య మధికము. గ్రంథపాతములు కలవు.

పూర్వము వలె.

## No. 749. వసుచరిత్రము, సవ్యాఖ్యానము.

## VASUCARITRAMU, SAVYĀKHYĀNAMU

Substance, paper Size, $12\frac{3}{8}$ × 8 inches Pages, 608 Lines, 26 on a page Mode of writing, good but not quite correct Condition, fair Appearance, old

Complete, but without a few stanzas in the end

This contains the same text as that described under the previous number and an exhaustive and also an elaborate commentary on it by Sōmamantri, son of Siddhamantri of Ātrēyagōtra This commentary is called Vidvajjanamanōrañjani and is the same as that described under R No. 245(*a*) of the Tri Cat of MSS, Vol II, Part 3 It was dedicated to God Rājēsvara worshipped in the shrine at Lēmulavāḍa The commentator also composed Caturbhujābhiṣēkamu, Dhruvacaritramu, Marutsandēśamu, Gangāgaurīsamvādamu and some other Telugu works as well as a few Sanskrit works The following note, apparently of Mr C P Brown, found on the fly-leaf of the MS., indicates the antiquity of the commentary —

*Commentary on the Vasucharitra*

This is the older commentary, composed about 1750 A D.

**Beginning :**

శ్లో. శ్రీమత్కాశీపతిశ్శంభు
శ్శ్రితసాగర చంద్రమాః
సర్వమంగళ యాయుక్త
స్సర్వదా పరిపాతు నః.

శ్లో. శ్రీమల్లేములవాడపుణ్యసరసీ శ్రీపార్వతీ సంతతా
శ్లేషానందరసానుభూతినిరతం సర్వార్థసంధాయినమ్
రాజశ్రీ రితి రాజపూజిత ఇతి స్తోత్రైకపాత్రం ప్రభుం
రారాజద్గుణశాలినం సురగురుం రాజేశ్వరం భావయే.

* * * *

ఉ. ఎవ్వనికన్నుల న్వొడము నిందునిచే జగమెల్లఁ జల్లనై
నివ్వటిలెన్ ద్రిమూర్తులను నిర్మలధాములలోకరక్షకై
య (యె)వ్వడు గాంచె నట్టిజగదిష్టఫలప్రదుఁ డత్రిమౌని తా
నెవ్వనివంశకర్త యతఁ డిమ్మహి రాజిలె సోమనాముఁడై.

ఉ. సద్గుణచంద్రికన్ జగము చల్లనఁజేయుట వీతకాముఁడై
సద్గు(గ్గ?)ణపాలనైకమతి సంధిలుటన్ భువి సోమనామకే
యోగ్గతి నుల్లసిల్లునతఁ డొయ్యన మాదనమంత్రివర్యును
ద్యద్గురు కీర్తిధుర్య తనయామణిఁ జేకొనెఁ బెంపు సొంపుగన్.

ఉ. ఆయువతీలలామకు సుమాతతకీర్తినిశాకరప్రకా
శాయతనీభవద్గగదహారివిహారచకోరహర్షబా
ష్పాయితతారకోత్కరుఁడు చారువిచారపరుండు శాశ్వత
శ్రీయుతుఁ డార్యసన్నుతుఁడు సిద్ధసమాఖ్యుఁడు పుట్టెనొప్పుగన్.

*

వ. క్షితిభరణైకదక్షుని కశేషవిశేషవిధాయికిన్ మహో
న్నతునకు దేవమాన్యన కనమ్రశిరస్కున కింపుమీఱఁగా
నతనికిఁ గల్గిరిద్ద ఱుదయాద్రికి భాస్కరచంద్రులో యనన్
వితతసమిద్ధతేజులు వినిర్మలచిత్ర చరిత్రపాత్రముల్.

క. అందగ్రజుండు వెలసె న
మందతరౌదార్యధైర్యమహితుఁడు భువనా
నందప్రతాపకీర్తిర
వీందుపరిష్కారమూర్తి హేమాద్రి యనన్

క. ఆతనికనుజన్ముఁడ నై
శీతాంశుకిరీటపాదసేవాలబ్ధ
శ్రీతో వెలయుచు నుండుదు
నాతతసోమాభిధాన మలరఁ జగతిన్.

*　　　*　　　*　　　*

ఉ. అంబులు ద్రావు మీశ్వరదయాకలితంబులు వేదమంత్రపూ
తంబు లటంచు నిద్ర కనుదమ్ములఁ బైకొను వేళఁ బుష్క
ల్లాంబుజనేత్రు బ్రాహ్మణకులాభరణం బొక విప్రపుత్రుఁ గా
లాంబుదనీలగాత్రు హృదయంబున నిల్పినమస్కరించెదన్.

మ. గురువాగ్గుంభనవార్థకల్పనల సంకోచస్థితిం జెందఁ ద
త్తరపద్మార్చితతోయపానమహిమం గల్పించితిం బ్రీతి ని
ర్జరభాషాంధ్రవచఃప్రబంధవితతుల్ సత్కోటిహృత్కోటరాం
తర మాహ్లాదవిశుద్ధరత్నరుచులన్ సంధిల్లఁగా నెంతయున్.

ఉ. సాంబశివాంఘ్రిపద్మములు సమ్మతి మ్రొక్కి చతుర్భుజాభిషే
కం బనుసత్ప్రబంధము జగద్విదితంబుగఁ జెప్పితిన్ మురా
రిం బసఁ గొల్చి యాంధ్రవచరిత్ర రచించితి నీప్రబంధముల్
సాంబ మురారి హృద్యబహుళార్థచమత్కృతి శబ్దచిత్రముల్.

క. పేశలగంభీరపదా
వేశమనోహరముగాఁగ వెలసె మరుత్సం
దేశము ముద్రాలాభం
బీశార్పణబుద్ధిచే మదీరిత మగుచున్.

ఉ. గంగయు గౌరి యిద్ద ఱనఘక్రమ మొప్పఁగ సేయువాదముల్
రంగులు మీఱఁ జెప్పితినిలాతలవాసికలాకలాపు లె
ల్లంగడు మెచ్చ నీశ్వరవరంబుననన్నుభజించునట్టివి
ద్యాంగనహావభావములు దారగతింగనుపట్టుచుండఁగన్.

శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశానమాళిస్థలో
దారోద్దేశుఁడ నైన నాకు వెస విద్యావంతు లెల్ల న్మనో
హారి ప్రక్రియ మూర్తిచేత రచితం బై విశ్రుతం బౌవసు
ష్మారాట్పుత్రచరిత్రటీకకయి యుత్సాహంబు పుట్టించినన్.

ఉ. కారణజన్ముడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁడయి పొల్పువహించెడు భట్టుమూర్తిచే
నీరిత మైఘనార్థపదహీనపదాస్పద మైనయావసు
ధ్మారమణప్రవృత్తము సుసాధ్యముగాదు తలంచి చూడఁగన్.

శా. నానానూనరసాళి నేగు(నాగ?)తలమై నానార్థసౌరభ్యవ
న్నానావ్లానపదప్రసూనములకు న్నాకేశ్వరావాసమై
నానాశాస్త్రరహస్యరత్నములకున్ రత్నాద్రియై యొప్పు నీ
నానాలంకృతి పేటి టీకకయి పూనన్ శక్యమే యేరికిన్.

* * * *

ఉ. శ్రీ మెఱయన్ సమస్తమునిసేవితమై విలసిల్లుచున్నయా
లేములవాడలో వివిధలీలలు చూపి జగంబుఁ బ్రోచునా
సామికి రాజలింగ మనుచక్రినినామము గల్గువానికిన్
గామితదాయి కర్పితముగా నొనగించెద నీనిబంధమున్.

**Text.**

శా. శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచున్ మదిన్
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పసీ
తాభామాపతిపోవుతన్ దిరుమలేంద్రశ్రీమహారాయనిన్.

**Comment**

టీ. ఓంకారనిలయం దేవం గజవక్త్రం చతుర్భుజం పిచండిలమహం వందే సర్వవిఘ్నోపశాంతయే। శ్రీభూపుత్రి శ్రీరూపాభూపుత్రీ శ్రీభూపుత్రీ రాఘవత్వే భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని అన్యేషు చావతారేషు విష్ణో రేషా నపాయినీ। శ్రీకారప్రభావము వేదములకెల్ల నోంకార మాది యైన కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది। గానఁ గవివరులెల్లను దానిఁ దక్క నితరవర్ణంబు లిడరు సత్కృతులమొదల, వివాహవేళయనగా వివాహవేళవరుడు తాను నొకచోట గూర్చున్నసమయమునం దనుట, నిజమంజీరాగ్రరత్న స్వలీలాభివ్యక్తి, మంజీర మనగా నందెకు పేరు “పాదాంగదం తులా కోటి ర్మంజీరో నూపురో స్త్రియామ్, హంసకః పాదకటక” ఇత్యమరః. అగ్రరత్న మనగా శ్రేష్ఠరత్నము “పరార్థ్యాగ్ర ప్రాగ్రహర ప్రాగ్ర్యాగ్ర్యాగ్రిమ మగ్రియ మిత్యమరః. తన మంజీరాగ్రరత్నము నందు ప్రతిబింబించిన తన స్వరూప మని యర్థము. ఇక్కడ లీలా

శబ్ద మాకారపరము, వరాంఘ్రిరేణు భవకన్యాలీల యంచున్, అనగా వరునిపాదరేణువువలన బుట్టిన కన్యక యంచు నని యర్థము. ఇక్కడ లీలాశబ్దము విలాసపరము "లీలావిలాసక్రియయో" రిత్యమరః. శ్రీరామపాదరేణువువలన నహల్యాదేవి పాషాణరూపము విడిచి స్వస్వరూపము వహించినది గనక దత్పాదస్పర్శచేత నుపలజాతిగనుక నంఘ్రినూపురరత్నమున్ను స్త్రీరూపము వహించె నని యాశయము. మదిందా భావింప శుభక్రమాకలనచే ననగా శుభలీలచేతననుట, తద్రత్నముం గప్పు సీతాభామాపతి బ్రోవుత న్తిరుమలేంద్ర శ్రీమహారాయనిన్ ఇక్కడ వివాహవేళ యనగా సన్నికల్లు ద్రొక్కించువేళ, క్రమ మనగా పాదవిక్షేపము "క్రముపాదవిక్షేప" ఇతిధాతుః, సన్నికల్లు ద్రొక్కించువేళ పాదవిక్షేపము సేయింపుచు రత్నము గప్పెనని ప్రకారాంతరముచేత నర్థము చెప్పుచున్నారు సన్నికల్లు ద్రొక్కించువేళ నిలిచియుండవలసినది. నిలిచియున్నప్పుడు నిజమంజీర రత్ననిజాకార ప్రతిఫలనము లెస్సగా సంభవింపదు, శుభక్రమాకలన యనగా శుభపాద విక్షేపణాకలన మని చెప్పితే క్లిష్టనామకదోషము ప్రాప్తమగుచున్నది. "శ్లో॥ క్లిష్టం తదర్థావగతిర్దూర దూరాయతోభవేత్ । శుభక్రమాకలన యనెడు పదమునకు పాదవిక్షేపణాకలన రూపార్థమే కవిహృదయమైతే పదక్రమాకలన యని రచించును, అటుగనక ప్రకారాంతర ముపేక్షణీయము. ఇక్కడ సీతాదేవికి స్వాధీనపతికాత్వమున్ను శ్రీరాములకు అనుకూలనాయకత్వమున్ను తెలియంబడుచున్నది. "శ్లో॥ ప్రియోపలాలితానిత్యం స్వాధీనపతికా మతా, ఏకాయత్తోనుకూలః స్యా" దితి తల్లక్షణం, ఈ పద్యము మొదటిచరణమందు మంజీరశబ్దమునకు "మంజురుచ్యమీర యతీతిమంజీరః" అని వ్యుత్పత్తి విచారించవలయును "మంజుఈరయతి" అన్నచోట "ఇకోయణచి" అనే పాణినీయ సూత్రముచేత మంజుశబ్దముకొన నున్న ఉకారమునకు వకారము ప్రాప్తముకాగా మంజీరశబ్దము శకంధ్వాదిపదములతోడిది గనుక "శకంధ్వాదిషుటేః పరరూపంవాచ్యం" అనెడు పరరుచివాక్యముచేత వకారము రాక పరమందు నున్న ఈకారము వచ్చినది. "విరమము స్వరప్రధానము ధరఁ బ్రాసము వ్యంజనప్రధానము అని లక్షణకారులు విశ్రమమంచు స్వరమె ప్రధాన మని చెప్పినారు గనుక మంజీరశబ్దమునందలి జకారముమీఁద నదికినస్వర మైన ఈకారమునకు విశ్రమముచెప్పక వ్యంజనమైన జకారమునకు విశ్రమముచెప్పుటచేత విశ్రమభంగ మాయె నని

శంక సేయంగూడదు. "శ్లో॥ శకంధురథ కర్కంధూః కుద్దాలో లక్తపగర్కటీ । లాంగలీషా హలీషాచ మనీషాచపతంజలిః, కుతీర్కలోష్టీష మంజీరమస్తిషగ్కులటాదయః తథాప్యకంధు సీమంతౌ శకంధ్వాదిగణ స్మృతః" ఇవి మొదలైనపదములందు హల్లునకున్ను హల్లుమీద నదికిన అచ్చునకున్ను విశ్రమము చెల్లు గనక మంజీరశబ్దమునందు హల్లైన జకార మునకు విశ్రమము జెప్పినాడు, ఇందుకు లక్షణము. "క. విరతికి వ్యాకరణమునన్ । వరరుచిచేఁ జెప్పబడినవాక్యమువలనం । బరరూపము నిత్యంబై । పరగు శకంధ్వాదులకు నుభయముం జెల్లున్" అటుగనక నిది పరరూపయతి యని యనిపించుకొనును.

**Text Colophon**

గద్య. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందనపవననందన ప్రసాదాసాదిత సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్యసర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతంబైన వసుచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

**Commentary Colophon:**

గద్య. శ్రీమదాత్రేయకుల కలశాంభోనిధి సంపూర్ణసోమ సోమాభిధాన మంత్రివరపౌత్రేణ సోమసిద్ధేశ్వరస్య పుత్రేణ శ్రీమత్పార్వతీ రాజేశ్వరప్రసాద సమాసాదిత హృద్యానవద్య నిఖిల విద్యావిశారదేన సోమనామ్నా విరచితాయాం వసుచరిత్ర వ్యాఖ్యాయాం విద్వజ్జనరంజనీ సమాఖ్యాయాం పంచమాశ్వాసః.

**End:**

సీ. వరపద్మమకరము లర్కరగతంబులు నీకు
సతినీవి యింత చేసడలరాదె
బహుళశతచ్ఛదరాశి భవదక్షియుగళంబు
నేత్రాంచలం బింత నెఱపరాదె
యనఘదివ్యాహారఖని నీదుకెమ్మోవి
లేమ ము ద్దింతపాలింపరాదె
తావిగంబూరంపుదీవి నీమొగ మొకర్క
పలు కింత న్నానేని జిలుకరాదె.

చక్రవిజయం బొనర్చె నీచన్నుదోయి
కంచుకంచెల యింకఁ జాలించరాదె
నిర్మలామూల్య గుణరత్ననిధికి నీకు
వనజముఖి త్రాస మిదియేల వదలరాదె.

**Comment**

టీ. వరపద్మ . . . రాదె = వరనిధి పద్మనిధి మకరనిధులు నీకు చేత గలదానవు మూలధన మింత చేవిడువరాదె యని యర్థము, శ్రేష్ఠము లైన పద్మమకర రేఖ లున్నవనిన్ని నీవియనంగా వస్త్రగ్రంధి యనిన్ని భావము, రెండవచరణమందు బహుశతచ్ఛదరాశి యనంగా అనేక శతవస్త్రరాసులు గలదని యర్థము, అనేకమైన శతపత్రరాసులు గలదని యర్థాంతరము, శతపత్రం కుశేశయం నేత్రాంచల మనంగా వస్త్రాంచలమున్ను నయనాంచలమున్ను దివ్యాహారఖని యనంగా "దివ్యానాం శ్లాఘ్యానాం ఆహారాణాం భోజ్యవస్తూనాంఖనిః" ఉత్పత్తి స్థానమిత్యర్థః, దివిభవాఃదివ్యాః అమరాః తేషామాహారోమృతం తస్య ఖనిరితిభావః, ముద్దింతపాలించరాదె అనంగా ముద్దయింత భాగించరాదే యని యర్థము, ముద్దుయింతే యివ్వరాదేయని భావము, ముద్దయనంగా కబళము, ముద్దనగా చుంబనము, నాలవచరణమందు కర్పూరగ్స్థాన మని యర్థము, కర్పూరసౌరభ స్థానమని భావము, పలుకనంగా పలుకున్ను వాక్యమున్ను ఎత్తుగీతియందు చక్రమనగా రాష్ట్రమున్ను చక్రవాకమున్ను కంచుక మనఁగా జోడున్ను రవికయున్ను, గుణములనంగా రత్నగుణమున్ను సద్గుణములున్ను, త్రాస మనఁగా రత్నదోషమున్ను లజ్జాకార్యమైన భయమున్ను. "త్రాసోభీషణదోషయోః".

(వి-వి.)—

తుదను కొంతకొఱగా గ్రంధమంతయుఁగలదు. వ్రాఁత బాగుగా నున్నది. తప్పులును గలవు. శైథిల్య మించుక గలదు. గ్రంధపాతము లేదు.

ఇందలిమూలము పూర్వవర్ణితమయినదే. ఇందు దామూలమునకు వ్యాఖ్యానము గలదు. వ్యాఖ్యానముపేరు విద్వజ్జనరంజని. మూలమునందలి కఠినతరమగు పట్టులకును, విశేషార్థములు గల పట్టులకును విపులమగు వ్యాఖ్యానము గలదు. వ్యాఖ్యాత సోమమంత్రి, సిద్ధ

మంత్రిపుత్త్రుఁడు, ఆత్రేయసగోత్రుడు, దీని నీతఁడు వేములవాడయందు నెలకొన్న రాజేశ్వరస్వామికిఁ గృతియిచ్చెను. ఈతఁడు చతుర్భుజాభిషేకము, ధ్రువచరిత్రము, మరుత్సందేశము, గంగా గౌరీసంవాదము మొదలగు పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములకుఁ గర్త. "ఇదియు క్రీ. శ. 1750 ప్రాంతమున రచియింపఁబడిన ప్రాచీనవ్యాఖ్యాన" మను విషయమును దెలుపగల యొక యాంగ్లవాక్యము ప్రబంధముఖపత్రమున మే॥ బ్రౌను దొరవారిచేఁ గాఁబోలు వ్రాయఁబడియున్నది.

No 750. వసుచరిత్ర, సవ్యాఖ్యానము.

VASUCARITRA, SAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 15⅜ × 1¼ inches Pages, 112 Lines, 8 on a page Mode of writing, not good and not correct Condition, much injured Appearance, very old

Many leaves are not found

Contains the first and the second Āsvasa incomplete

Same work as the above.

(వి-వి.)—

ప్రథమ ద్వితీయాశ్వాసములు సమగ్రములుగా గలవు. వ్రాఁత యందమయినది గాదు. తప్పులు గలవు. శైథిల్య మధికము. గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె. ఇందు మూల పద్యములు సైతము కలవు.

No 751. వసుచరిత్రవ్యాఖ్యానము.

VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 18 × 1½ inches Lines, 10 on a page Mode of writing, good but not quite correct Condition, fair. Appearance old.

Complete, but without a small portion in the end and the prefatory portion of the commentary

Same commentary as that described under the last number.

(వి-వి.)—

చివరఁ గొన్ని పద్యములును, వ్యాఖ్యానావతరణికయుఁ దప్ప తక్కిన దంతయుఁ గలదు. వ్రాఁత యందమైనది. తప్పులును గలవు. శైథిల్యమంత గా లేదు. గ్రంథపాతములు లేవు

ఇది పూర్వోక్తవ్యాఖ్యానమే. ఇందు మూలపద్యములు లేవు.

## No 752 వసుచరిత్రవ్యాఖ్యానము.

## VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 17¾ × 1⅜ inches Pages, 13 Lines, 6 on a page Mode of writing, good but not quite correct Condition, injured. Appearance, old

Contains commentary only for the first ten stanzas

Same work as the above

(వి-వి.)—

తొలి పదిపద్యములకు మాత్రము కలదు వ్రాఁత బాగుగానున్నది. తప్పులున్నవి. శైథిల్యమించుక కలదు. గ్రంథపాతము లేదు.

పూర్వమువలె. వ్యాఖ్యానము మాత్రమే కలదు.

## No 753. వసుచరిత్రవ్యాఖ్యానము.

## VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 17¾ × 1⅜ inches Pages, 101 Lines, 7 on a page Mode of writing, good but contains mistakes Condition, fair. Appearance, old

Contains the second Āsvāsa incomplete.

Same work as the above

(వి-వి.)—

చివరను గొంతకొఱఁగా ద్వితీయాశ్వాసమునకు మాత్రము కలదు. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె. వ్యాఖ్యానము మాత్రమే

## No 754. వసుచరిత్రవ్యాఖ్యానము
## VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, $18\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches Pages, 133 Lines, 9 on a page Mode of writing, fair but incorrect Condition, injured Appearance, very old

Contains the fourth and fifth Āśvāsas complete and the sixth Āśvāsa incomplete

Same work as the above

(వి-వి.)—

నాలుగైదా శ్వాసములు సమగ్రముగను ఆఱవయాశ్వాస సమగ్రముగను గలదు. వ్రాఁత యొకతరబడిగా నున్నది తప్పులు పెక్కులు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు

పూర్వము వోలె. మూలము లేదు.

## No 755. వసుచరిత్రవ్యాఖ్యానము.
## VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, $18\frac{?}{8} \times 1\frac{1}{2}$ inches Pages, 233 Lines, 9 on a page. Mode of writing, good but contains mistakes Condition, fair Appearance, old.

Contains only three Āśvāsas from the beginning

Same work as the above

(వి-వి.)—

తొలినుండి మూఁడాశ్వాసములున్నవి. వ్రాఁతచిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య మంతగా లేదు. గ్రంథపాతము లుండవచ్చును.

పూర్వమువోలె. వ్యాఖ్యామాత్రమే.

## No 756. వసుచరిత్రవ్యాఖ్యానము.
## VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf. Size, $18\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 359 Lines, 6 or 7 on a page Mode of writing, fair but not quite correct Condition, injured Appearance, old

Contains the first and the third Āsvāsas incomplete and the second complete

Same work as the above

(వి-వి.)—

ప్రథమ తృతీయాశ్వాసము లసమగ్రములుగను, ద్వితీయాశ్వాసము సమగ్రముగను గలదు. వ్రాఁతయొక తరబడిగానున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యముగలదు. గ్రంథపాతములున్నవి.

పూర్వమువలె. వ్యాఖ్యమాత్రమే

No 757. వసుచరిత్రవ్యాఖ్యానము

VASUCARITRAVYĀKHYĀNAMU

Substance, palm-leaf Size, $13\frac{1}{8} \times 8\frac{3}{8}$ inches Pages, 104 Lines, 25 on a page Mode of writing, good and apparently correct Condition fair Appearance, old

The first 32 pages of the MS are placed at the end in binding Contains the fifth and the sixth Āśvāsas complete

Same work as the above.

(వి.వి.)—

ఐదాఱాశ్వాసములు సమగ్రములుగా గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవనవచ్చును. శైథిల్య గ్రంథపాతము లంతగా లేవు. తొలి 32 పత్రములు కడపటనుంచి బైండు కట్టబడినవి

పూర్వమువలె. వ్యాఖ్యానము మాత్రమే.

No 758. వసుచరిత్రవ్యాఖ్యానము.

VASUCARITRAVYĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, $17\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches Pages, 228 Lines, 7 on a page. Mode of writing, good and apparently correct Condition, injured Appearance, old. Many leaves are broken

Contains the first three Āśvāsas only

Same work as the above.

(వి-వి.)—

తొలి మూఁడా శ్వాసములకు మాత్రమేకలదు. వ్రాఁత యంద మైనది. తప్పులంతగా లేవు. శైథిల్య మధికము. గ్రంథప్రాతము లును గలవు

పూర్వమువోలె. వ్యాఖ్యానము మాత్రమే.

## No 759. వసుచరిత్ర, సటీకము.

## VASUCARITRA, SATĪKAMU

Substance, palm-leaf. Size, 12⅜ × 7¾ inches Pages, 629 Lines, 32 on a page Mode of writing, fair and apparently correct Condition, good Appearance, old

Complete in two volumes

Contains the text with a commentary, which was written at the instance of Mr C P Brown, by Zuluri Appaya and which was printed in 1839, as may be learnt from the note extracted below.

Date of the completion of the commentary and the name of the commentator are given in a note (Telugu) at the end of the MS (2nd Vol )

A note, apparently of Mr C P Brown appearing on the fly-leaf of the 1st Vol, is as follows —

The Vasu Charitra<br>
a celebrated Telugu Poem<br>
with an ample verbal commentary<br>
composed by the very learned<br>
Zuluri Appaya<br>
at the suggestion of C P Brown<br>
who paid him for the work.

(వి-వి.)—

సమగ్రము (రెండు సంపుటములు). వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు వసుచరిత్రమును, దానికిఁ డీకయునుగలవు. ఈ టీక మే॥ బ్రౌన్ దొరవారి యనుమతిపైని జూలూరు అప్పయ్యగారిచే రచియింపఁబడినది. ప్రతి పదమునకు నర్థముగలదు. ఈ గ్రంథము 1839 వ సంవత్సరమున మే॥ బ్రౌన్ దొరవారిచే ముద్రింపఁబడినట్లు ఆంగ్లమున వారిచేతనే కాబోలు నీ గ్రంథాంతమున నీ క్రింది తీరున వ్రాయఁబడినది:

"అన ౧౮౩౮ సం॥ యేప్రల్ నెల x వ తేది వఱకు మ-రా-శ్రీ చా॥ పి॥ బ్రౌన్ దొరగారి సెలవు ప్రకారం యీ వసుచరిత్ర ఆరు ఆశ్వాసములకున్ను జూలూరి అప్పయ్య ప్రతిపద టీక చెయ్యడమయినది"

This book is in the handwriting of the learned critic himself, while the original text is in the handwriting of his son

Zuluri Appaya has for more than twenty years enjoyed the reputation of being the most learned of Telugu scholars His patience, humility and his good sense always commanded great respect

In 1839, I printed the work verbatim from this volume, but in a few places filled up an omission

At the end of the second volume, a copy of the letter, addressed to Mr C P Brown by the agent, American Mission Press, is found in regard to the estimation of charges for printing this MS (two Vols )

**Beginning.**

**Text.**

శా. శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచున్మదిన్
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పెసీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్.

**Comment:**

టీక. శ్రీ భూపుత్రి = శ్రీలక్ష్మీస్వరూపురాలైన, భూపుత్రి = భూమికి కౌమార్తెయైన సీతాదేవి, వివాహవేళ = పెండ్లికాలమందు, అనగా వరుడున్ను తానున్ను ఒకచోట గూర్చున్నసమయమందనుట, నిజ. వ్యక్తి = నిజతనయొక్క, మంజీర = కాలి అందెయొక్క, అగ్రరత్న = శ్రేష్టమైన నాయకరత్నమందలి, స్వలీలా = స్వకీయమైన విలాసాకృతియొక్క, అభివ్యక్తి = ప్రతిబింబమును, వరాంఘ్రి యంచున్ వర = పెనిమిటియైన రామస్వామియొక్క, అంఘ్రిరేణుభవ = పాదరేణువువలన బుట్టినటువంటి, కన్యాలీలయంచున్ = కన్యకయొక్క విలాసమని, మదిందాభావింప = మనస్సుయందు తాను ఊహించుచూనుండగాను, ఇక్కడ శ్రీరామపాదరేణువువలన నహల్యాదేవి పాషాణరూపమువిడిచి స్త్రీరూపమువహించినందున మంజీరాగ్రరత్నమున్ను పాషాణజాతే గనక తత్పాదరేణు స్ప

ర్యచేతను యీరత్నమున్ను స్త్రీరూపము వహించెనా యేమి అనేటట్టు గా నూహించెనని ఆశయము. శుభక్రమాకలనచే = శుభలీలచేతను, తద్రత్నమంగప్య = ఆరత్నమును కప్పిపెట్టునటువంటి, సీతాభామాప తి = సీతాంగనకు నాథుడైన శ్రీరామస్వామి, తిరుమలేంద్ర శ్రీమహారా యనిర్ = తిరుమలదేవరాయ శ్రేష్ఠునిని, ప్రోపుతర్ = రక్షించుగాక అని కృతిపతి కాశీర్వచనము. ఇందులో శుభక్రమాకలనచే అన్నచోట క్రమపాద విక్షేపే అనెడి ధాతువువలన సన్నికల్లు ద్రొక్కించడ మనే వ్యాజముచేతను రత్నము గప్పెనని ప్రకారాంతరముచేత నర్థము చెప్పు చున్నారుగాని, సన్నికల్లు ద్రొక్కించువేళ సీతాదేవి నిలిచియుండవలసి నది. ఆలాగున నిలిచియున్నప్పుడు నిజమంజీరాగ్రరత్నమందు నిజాకార ప్రతిఫలనము లెస్సగా సంభవించదు. ఇంతేకాకుండా శుభక్రమాకలన యనగా శుభపాదవిక్షేపణాకలనమని చెప్పితే క్లిష్టనామక దోషమున్ను ప్రాప్తమగుచున్నది. శుభక్రమాకలన యనెడు పదమునకు పాదవిక్షే పణాకలనరూపార్థమే కవి హృదయమైనట్టయితే పదక్రమాకలన యని రచించును. ఆలాగున లేదు గనక ప్రకారాంతర మంగీకరించదగినది కాదు. ఇక్కడ సీతాదేవికి స్వాధీనపతికాత్వమున్ను, శ్రీరాములకు అనుకూలనాయకత్వమున్ను తెలియబడుచున్నది. "ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికామతా, పరాయత్తోనుకూలస్స్యా దితితల్లక్షణమ్". అనగా వివాహసమయమందు సీతాదేవి సిగ్గుచేత తలవంచుకొని పాద ముల వంకనే చూచుచున్నయెడల కాలి అందెయొక్క నాయకమణి యందు ప్రతిఫలించిన తన రూపమును తానే చూచి అదివరకు పాషాణ మును స్త్రీనిగా జేసినటువంటి శ్రీరాములవారి పాదరేణువువలని యీరత్న మున్ను పాషాణమే గనక స్త్రీ అయినాదా యేమి అనేటట్టుగా భ్రాంతిని పొందుచూనుండగాను ఆ భావము తెలిసి విలాసగతిగాను ఆ రత్నముమీద చెయివేసి కప్పినవాడై ఆమెయొక్క భ్రాంతిని పోగొట్టెనని తాత్పర్యము.

**End:**

**Text.**

సుగంధి.—సారసాహితీసదధ్వచారిభూరిధీరసా
ధీరసాహసోరుదోరతిస్ఫురన్మహారసా
హారసానుమత్తటీసురాపగాసుధారసా
ధారసారకీర్తిహంసధారిసూరిసారసా.

**Comment**

టీక. సార ధీరసా-సార = శ్రేష్ఠమైనటువంటి, సాహితీ = సాహిత్యమనెడు, సదధ్వ = సన్మార్గమందు, చార = సంచరించుచున్నటువంటిన్ని, భూరి = అధికమైనటువంటి, ధీరసా = బుద్ధిగుణముగలవాఁడా, ధీర హారసా - ధీరసాహస = మహత్తరమైన సాహసముగలిగినటువంటిన్ని, ఉరు = అధికమైనటువంటి, దోః = బాహువుయందు, అతి = అత్యంతమానట్టుగాను, స్ఫురత్ = ప్రకాశించుచున్నటువంటి, మహాగసా = మహా భూమిగలవాఁడా, హారసాను సారసా-హార = హారసంబంధమైన, సానుమత్ = పర్వతముయొక్క, అనగా కైలాసపర్వతముయొక్క, తటీ = దరులకున్ను, సురాపగా = దేవనదికిన్ని, అనగా నాకాశగంగకున్ను, సుధారస = అమృతరసమునకున్ను, ఆధార = ఆధారమైనటువంటిన్ని, సాధు = లెస్సైనటువంటిన్ని, కీర్తి = కీర్తి యనెడు, హంస = హంసను, ధారి = ధరించుచున్నటువంటి, సూరి = విద్వాంసులనెడు, సారసా = కమలములుగలవాఁడా.

**Colophon of the text:**

గద్య. ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతంబైన వసుచరిత్రంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

**The commentator adds.**

"ఆన ౧ వ ౩౮ సం॥ ఏప్రిల్ నెల ౫ వ తేదివరకు మహారాజశ్రీ చా॥ పి॥ బ్రౌండోరగారి సెలవుప్రకారం యీ వసుచరిత్ర ఆరు ఆశ్వాసములకున్ను జూలూరి అప్పయ్య ప్రతిపదటీక చెయ్యడమైనది."

---

## No 760. వసుచరిత్ర, సటీకము.

## VASUCARITRA, SATĪKAMU

Substance, paper Size, $9\frac{7}{8} \times 6$ inches Pages, 725 Lines, 25 on a page. Mode of writing, fair, by different scribes and full of mistakes Condition, fair Appearance, old

Leaves are misplaced in binding The volume contains the first three Āśvāsas only The remaining portion of the work is found in the MS. described under the next number.

The commentary contained herein was written at the instance of Mr C P Brown, by Mulupāka Buccaya It is stated that this commentary was based on the commentary of Sōmanātha (described under No 749) and was intended to be in an easy style The name of the commentary is Pratipadārthaprakāśa and the commentator's other works are Māghamāhātamyamu, etc

**Beginning.**

(The Introduction of the commentator)

క. శ్రీరమ్య కంఠకంఠ
స్ఫారశ్రీ (వి) జితశరద శరదరగిరిభి
త్పారదవారనిభోజ్వల
గౌరాకారద్యుకేశ కాశిపురీశా.

సీ. శ్రీమించువైభవ శ్రీయుతశ్రీదులు
పరమభోగాప్తి సుపర్వవరులు
సత్యభాషాహరిశ్చంద్రులు సాహస
విక్రమార్కులు రణ విజయులఖిల
విద్యాభోజులు వితరణకర్ణులు
నీతికావ్యులుమతి నిర్జరేజ్యు
లవనిపాలనరాము లతిధైర్య హేమాద్రు
లతులప్రతాపాగ్ను లన్యకామి
నీధనైకపరాఙ్ముఖు లఖిలధర్మ
పరులునైకుంపిణీసార్వభౌములలఘు
భరతఖండంబునే కాతపత్రముగను
సరవిఁబాలింపుచుండునా సమయమందు.

తే. వారిలోనింగిలీషు సద్వంశవార్ధిఁ
బుట్టె డేవిడ్డు విద్యాభిభూతగీష్ప
తిప్రభావుఁడు సకలదిగ్దేశవిదిత
విమలచరితుఁడు సతతసద్వృత్తిపరుఁడు.

సీ. అతనికిబుట్టె సమ్నుతదివ్యశుభమూర్తి
సకలలక్షణశాస్త్రి చక్రవర్తి
పారిషీముఖమహాభాషాపరిష్కార
కరవాక్యవిస్ఫూర్తి సరసవృత్తి

సర్వతంత్రార్థ ప్రసంగసంగతబుద్ధి
శబ్దశాసనసూత్ర సహితవృత్తి
లక్ష్యలక్షణగురు లఘువర్ణగణవార్తి
కావృత్తివిద్వన్మతానువర్తి

తే. కల్పకాబ్దేందు దుగ్ధసాగరదధీచి
కర్ణబలికామధుక్కల్పఘనవితీర్ణి
కలితకరపంకరుహహృత ఘనజనార్తి
వృజినకర్మనివృత్తి సద్వినుతకీర్తి

క. నూర్లార్లు లెక్కసేయక
పేర్లందిన విబుధజనులఁ బిలిపించుచు వే
మార్లర్థమిచ్చువితరణి
చార్లీసు పిలుప్సు ప్రౌనుసాహెబుకరుణన్.

క. ననుఁబిలిచిపలికె విద్వ
జ్జనములునుతియింపనీవు సరళోక్తులచే
ఘనమైన వసుచరిత్రకు
మనమారఁగఁటీకఁజేయు మామహి వెలయన్.

సీ. అదిశారదామూర్తి యగుమూర్తి చెప్పిన
కావ్యరత్నముజగత్కల్మషఘ్న
మఖిలలక్షణలక్ష్య మతిభావగర్భిత
మలఘువాచ్యార్థలక్ష్యార్థమయము
శబ్దార్థచిత్ర తచ్ఛక్తిప్రశస్తమ
లంకారవృత్త్యనుప్రాసపాక
శయ్యాదికల్పనా శ్లాఘ్యమనేకకో
శజేయశబ్దార్థసంయుతంబు

తే. వ్యంగ్యమూలంబు నవరసవ్యంజకంబు
గానసులభంబు గాదట్టికావ్యమునకు
సులభమగుటీక చేసి భూతలమునందు
ఖ్యాతిగైకొమ్ము విబుధులందందమెచ్చ.

తే. కాశికావిశ్వపతి కృపాకలితసూక్తి
మాఘమాహాత్మ్య ముఖ్యసమ్యక్ప్రబంధ

కల్పనానల్పమతివియికొరు వ్యటీక
సరవిఁ జేయుము బుచ్చయశాస్త్రివర్య.

క. అని సెలవిచ్చిన విద్వ
జ్జనములనుతియించి జన్మసాఫల్యముగాఁ
గనినట్టుతోఁచినట్టును
ఘనకృతికొనరింపఁడీకఁ గడఁగితినాత్మన్.

తే. వసుచరిత్రపదార్థమివ్వసుధలోనఁ
గనిపరిగ్రహ మొనరింతుననుపమాన
పండితానుగ్రహాంజన ప్రతిభ చేత
దానఁగనరాని యర్థమెందేనిఁగలదె.

క. సోమామాత్యుడు చేసిన
శ్రీమద్వ్యాఖ్యానమిలన శేషకళావి
ద్ధీమంతుల కేకాకే
సామాన్యులకర్థమియ్యఁ జాలదు గానన్.

క. అందరికర్థంబైయా
నందంబొనఁగూర్పఁగా జనంబులు మెచ్చన్
మందారకుసుమమాధ్వీ
కందళితోక్తులనుడీక గావింతుఁదగన్.

వ. అని యిట్లు ప్రతిపదార్థప్రకాశిక యనుటీక నేకాయత్తచిత్తంబున నొనరింపనిశ్చయించి

టీక. . నిజబింబంబు-నిజ = స్వకీయమైన, బింబంబు = ప్రతిబింబంబు, వప్ప = వుండగా, అచ్ఛామృతత్వము = నిర్మలోదకభావము, బ్రహ్మస్వరూపమున్ను, ఆత్మప్రతిపాదకత్వము, బ్రహ్మప్రతిపాదకత్వము, బింబప్రతిపాదకత్వము, తద్వర్ణాళియః దెల్ల = ఆయక్షరపంక్తియందంతట, పూర్ణముగావించినవాణి-పూర్ణముగా వించిన = సంపూర్ణము జేసిన, వాణి = సరస్వతి, తిర్మలమహారాయోక్తి-తిర్మలమహారాయ = తిర్మలరాయల యొక్క, ఉక్తి = వాక్కుయందు, కృపన్ = దయచాతను, పొల్చు = నిల్పుగాక. స్ఫటికాక్షమాలికారూపమైన అక్షరపంక్తిని వీణారావంచాత నీరుజేసి ఆ నీటిలో తన నీడనున్ను బ్రహ్మస్వరూపమునున్ను, బ్రహ్మ ప్రతిపాదకత్వమునున్ను పరిపూర్ణము జేసిన సరస్వతీ అని భావము.

**Text:**

(మూ).—

శా. ఆమందాకిని మౌళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసితా
నాషేత్మే లని యార్య యల్ల ప్రణతుం డై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయుణ్ మొరయఁ జూడాభోగసమ్యక్స్థియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుత౯.

(వి-వి.)—

తొలి మూఁడాశ్వాసములు మాత్రము కలవు. పత్రములు తారుమారుగా బైండు కట్టబడినవి. వ్రాఁత యంతబాగైనదికాదు. పెకుగారు వ్రాసిరి. తప్పులు పెకుగ గలవు. శైథిల్య గ్రంథపాతములు కలవు.

ఇందు వసుచరిత్రమూలమును, ప్రతిపదార్థ టీకయుచు గలవు. టీకాకారులు ములుపాక బుచ్చయ శాస్త్రిగారు. సోమనాథకృతమగు విద్వజ్జన మనోరంజనీవ్యాఖ్యానము ననుసరించి వీరు దీనిని సుబోధముగ డేవిడు దొరవారి పుత్త్రుఁడగు మే॥ ఛారల్సు ఫిలిప్సు బ్రవునుదొరవారి యాజ్ఞను రచియించిరట మాఘమాహాత్మ్యమున్నగు ప్రబంధములీవ్యాఖ్యాత యితరకృతులు. ఈ వ్యాఖ్యానమునకు "ప్రతిపదార్థ ప్రకాశిక" యని పేరు

---

No **761**. వసుచరిత్ర సటీక.

VASUCARITRA SATĪKA

Substance, paper Size, 9 × 7 inches Pages, 514 Lines, 18 on a page Mode of writing, not good and not correct Condition, fair Appearance, old

Contains the last three Āsvāsas but wants a small portion at the end of the 6th Āśvāsa

This and the MS described under the above number seem to form one complete copy. This is the same work as the above

The date of transcription of the 5th Āsvāsa is given in Telugu.

**Beginning:**

**Text:**

క. నవలానవలావణ్యా
ర్ణవలాక్షిత కాంతిరమకు నయనద్యుతుల౯
నవనీరాజన మొసఁగుచు
నవనీరాజాగ్రగణ్యుఁ డనియెం బ్రేమ౯.

**Comment:**

టీక. నవలాగిరికాదేవియొక్క-నవ = నూతనమైన, లావణ్యార్ణవ = సౌందర్యార్ణవమందు, లాలిత = పుట్టినటువంటి, కాంతి = కాంతియనెడి, రమకు = లక్ష్మీదేవికి, సంపదకు, నయనద్యుతులన్ = నేత్రకాంతులచేతను, నవనీరాజనమొసగుచు = నూతనమంగళహారతియిచ్చుచున్న, అవనీరాజాగ్రగణ్యుడు = భూపాలశ్రేష్ఠుడైన వసురాజు, ప్రేమన్ = ప్రీతిచేతను, అనియెన్ = పలికెను.

**Text:**

సీ. వరరత్న (పద్మ) మకరములగు రగతంబులునీకు
సతినీవియింతి (త) చేసడలరాదె
బహుశతచ్ఛదరాశి భవదక్షివిభవంబు
నేత్రాంచలంబి తనెర (అ) పరాదె
అనఘదివ్యాహార ఖనీదు కెమ్మోవి
లెమముద్దింత సాలించరాదె

* * * *

ఇది శ్రీమద్రామచంద్ర వసుచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

**Colophon:**

గద్య ఇది శ్రీమన్నవఖండమండితధరామండలాఖండలకుంపినీసార్వభౌమసమర్పిత సామ్రాజ్యరాజాధిరాజపూజ్య ఇంగ్లీషువంశపయఃపయోధిరాకాసుధాకర వినయాదిసుగుణరత్నాకర దేవిడ్డువసుంధరారమణహృదయకమలదివాకర సకలభాషావిశేషాభిభాషణ విద్యావినయనయవితరణాభరణపోషణ సకలకళానాథ చార్లీసు పిలీపుబ్రౌన్ప్రభులాధినాథ కరుణాకటాక్షలబ్ధసమస్తవిభవాతిశయ విద్వజ్జనవిధేయ ములుపాకబుచ్చయనామధేయప్రణీతంబైన వసుచరిత్రప్రతిపదార్థప్రకాశిక యను టీకయందుఁ బంచమాశ్వాసము.

(వి-వి)—

తుది మూఁడాశ్వాసములున్నవి. కడపట కొన్నిపద్యములు వ్యాఖ్యానము లేదు. వ్రాఁత బాగుమనదికాదు శైథిల్య గ్రంథపాతములు కలవు. ఈ ప్రతియు, పూర్వవర్ణితప్రతియుఁగలసి యొకసంపూర్ణప్రతియగును

పూర్వోక్తమైనది

అవశ్వాసంతమున "విధినామసంవత్సర మార్గశీర్ష శుద్ధపంచమీ అంగారకవారము" అని యున్నది.

## No 762 వాణీవిలాసవనమాలిక.

## VĀNĪVILĀSAVANAMĀLIKA

Substance, paper Size, 12½ × 7⅞ inches Pages, 520 Lines, 19 or 20 on a page Mode of writing, good but not incorrect Condition, fair Appearance, old

Contains the first four Āśvāsas with omissions here and there

Pages 521 to 534 are blank and 535 to 580 contain a running summary of the work in English by Mr Brown

This is a work of a miscellaneous nature dealing with a variety of subjects and based on Śāstras, Purāṇas Itihāsas, etc The author Rangaśāyikavi of Tōkumalla family was the son of Timmāmbika and Kappyāmātya of Śrīvatsagōtra and was a disciple of Rāmabhadrārya. In composing the work, the author had the assistance of Mahankāli Vēnkatapati (Vengaya) This work has been dedicated to God Vēnkatēsvara Author's other works are—1 Tiruvallūru Vīrarāghavaśatakamu, 2 Krsnadandakamu, 3 Jānakipariṇayamu (Yaksagāna), 4 Dvipadabhāgavatamu

**Beginning:**

శా. శ్రీవిశ్వంభర లాత్మపాదసరసీస్సమోరుపీఠంబులన్
రీవు లిమ్మఁగ శంభుశక్రముని వాణీనాథముఖ్యు ల్నతుల్
గావింపన్ శుభ వాధికప్రభలచే గల్యాణవద్వేంకట
గ్రావాధ్యక్షుతఁ బొల్చు వేల్పుఁ గొలుతుం గైవల్యసంసిద్ధికిన్.

* * * *

చ. గురుకులవర్యుఁ గణ్యమునిగోత్రుని వామనదేవుపుత్రుని(న)
ష్ఠిరశుభచర్యు ధర్మపురిశ్రీనరసింహావరప్రసాది ని
ద్ధరఁ దగునారదప్రకటితస్థితభాగవతక్రమాఢ్యునిన్
జిరమతి రామభద్రగురుశేఖరునిన్ భజియింతు నిత్యమున్.

సీ.

భీము సూరయఁ దిక్క ప్రెగడ నన్నయఁ బోత
నార్యు నెఱ్ఱన సోము నమరు రంగ
నాథు శ్రీనాథు గౌరన నవ్యకావ్య
భాసురాంధ్రకవిత్వప్రబంధబంధు

రార్థసార్వజ్ఞ్యనిధుల మహాకవీంద్ర
వరుల నభినుతి గావింతు గరిమ నెఱయ

* * * *

ఆ. అనుచు నిష్టదేవతాభివందనమును
వరకవీంద్రనతియు నెఱయఁ గుకవి
నిరసనంబుఁ జేసి నెమ్మితో నొకకృతి
యమరఁ బూనియున్న యవసరమున.

వ. ఉరగాద్రిపతి యుషఃకాలంబున మదీయదృగ్గోచరుండై ప్రణామప్రణతులు గయికొని నీతలంచినకృతి వాణీవిలాసమాలికయన మధ్వసమాలికభాతి మెఱయుచు మామకాలంకారంబగు, నగణితసుగుణుండును ప్రబంధకల్పనాధురంధరుఁడును, నగు మద్దాసుం డొకరుండు సహాయుండుగా నేతత్కృతి మత్సమర్పణంబు సేయు మని మన్మానసనివాసుం డయ్యె నంత నివ్విధంబు మద్గురుబాంధవజనంబుల కెఱింగించిన రోమాంచకంచుకితగాత్రులై మత్పుణ్యపరిపాకం బభివర్ణించి యిటనిరి.

సీ.
మహిమఁ జెన్నగు శ్రీవత్సమానిగోత్రుఁ
డనఘుతర తేకుమళ్ళాన్వయైకధర్మ
పురనృసింహాంఘ్రిభజనాత్తనిరతరామ
భద్రగురుభక్తియుతుఁడు తిప్పప్రభుండు.

క. ఆ మంత్రి రామమాంబా
సీమంతినియందుఁ గనియె శ్రితసుకవిజన
స్తోమక్షేమంకరవి
ద్యామహిమాన్నత్యు నప్పయామాత్యుఁ దగన్.

ఉ. ఆయతకీర్తిశాలి యగు నప్పన యొప్పుగ కృష్ణరీతి రు
క్మాయి శుభప్రదాయిని బుధాభ్యవిధేయిని భార్యగాఁగఁ దాఁ
గాయజువంటి సద్గుణనికాయుఁ దనూభవుఁ గాంచె వైభవ
శ్రీయుతు రామనార్యు మతిశిక్షితదేవగణార్యు నయ్యెడన్

సీ ఆ రామమంత్రి సీతారమణీనిభ
సద్గుణనికురుంబ జనకదంబ

నుత కచరోలంబ సతి లక్ష్మమాంబ స
తుర్లకాంతగా సముజ్జ్వలనిగూఢి
నరసింహవరజాతు నిరుపమవిఖ్యాతు
మతినిత్యు కప్పరామాత్యు సత్యుఁ
బ్రాకటసద్గుణస్తోకవిఖ్యాతాహ్వ
స్థిరకార్యరంహు నృసింహు నాన
నాబ్జరిపుబింబ యగునరసాంబఁ గనియె
నందు ననవరతాన్నదానాతిశయమ
హాప్రభావసదాచారవిప్రభజన
కప్పరామాత్యుఁ డమరు లోకప్రసిద్ధి.

* * * *

సీ. ఆ కప్పరార్యతిమ్మాంబల కవనిజ
నావనకల్పవృక్షాళిఁ బోలి
యింగితకీర్తుల హెచ్చినయచ్చన
ధర్మతత్పరుఁడైనధర్మనయును
రాజితసుకవిసమాజరామాజయు
ధీయుక్తు లొప్ప నారాయణప్ప
రమ్యవిద్యావిశారదబుధజనగేయు
రంగద్గుణస్థాయి రంగశాయి
యనఁగ నీవును జనియించి తంచితమతి
హారికరాంబుజదీప్తపంచాయుధముల
కరణి గౌరీశపంచవక్త్రములరీతి
నమితకీర్తిప్రభల్ ధర నతిశయిల్ల.

సీ అన్వర్థనామపుణ్యాస్పద మైనభా
గీరథికృష్ణమ్మ ధీరకొండ
మాంబయు సైదోడు లై వెలయ జనించి
యధికసత్కీర్తుల ననుపమధృతి
గజవెల్లిజనపదగతి నైదిపురిబాంధ
వాధారవిద్యానిబోధసింధు
సన్నుతసుకృతైకసత్తసంతానసం
పన్నప్రసన్నత వన్నె కెక్కి

చెలఁగితివి రామభద్రార్య శిష్యవర్య
వేంకటాధిపపాదారవిందమక
రందసుమలిట్ప్రధానందకందహృదయ
కృతి యొనర్చుము నీదుకోర్కెలు ఘటిల్లు.

చ. ఉరుశుభసన్మతిన్ దిరువలూరిపురాధిపవీరరాఘవ
స్థిరశతకంబు కృష్ణగుణదీపితదండక మొప్పుజానకీ
పరిణయయక్షగానమును భాగవతద్విపదప్రబంధమున్
విరచన చేసినట్లు యిది వేడ్కఁ నొనర్చుము రంగధీనిధీ.

సీ. ధర ఘోలురన్వయాంబరతరుఫలలీల
మంతుకెక్కెఁననంతమంత్రిపతికి
యగులక్ష్మమాంబయం దనువొందఁగలశాబ్ధి
ఘనవీచి శ్రీకాంతకరణిఁ బొడమి
యన్వర్థనామ్ని యానట్టిలక్ష్మాంబ శ్రీ
రంగశాయి ప్రభ రంగుమీఱు
వరునిన్ను వరియించి నిరుపమశుభగుణో
దారసద్బాంధవాధారగరిమ
నమరి వేంకటపతి నచ్చనాఖ్యు నయ్య
నంతు వేంకటపతి జగన్నాథుఁ బద్మ
నాభు బాహులునాఁగ నందనులఁ గాంచి
ధరణివర్ధిలునీకు నీధర్మమమరె.

తే. వరకవిబహుశ్రుతుఁడు శేషగిరినివాస
భక్తుఁడు వివేకియు బహుప్రబంధకర్త
విశదమతి శ్రీమహాంకాళి వేంకటపతి
చెలిమికాఁ డౌటఁ దగుఁ గార్యసిద్ధి నీకు.

సీ. అతఁడలకుత్సగోత్రాన్వయక్షీరపా
రావారతుహినాంశుఁ డై వెలుంగు
నన్నపార్యాన్నమాంబాత్మజుం డగుకోన
యాఖ్యుఁడు లింగమయందుఁ గనిన
గుణనిధ ఘనుఁ డప్పకొండాఖ్యుఁ డచ్చమాం
బికయందుఁ గనినసంప్రీతమతులు

లింగాఖ్యుఁ డలమేలుమంగాకృపాప్తుండు
విశ్రుతసుకృతి యావేంకటపతి
ప్రచురలీలఁ జతుర్విధరచన లెఱుఁగు
నెమ్మి నాతఁడు నీకృతి నిర్వహించు
నింపుదళుకొత్త శ్రీవేంకటేశు పేర
నంకితమొనర్పు మనుఁడు నే హర్షమొంది

ఉ. ఏకకథాప్రసంగతి రహిన్ గవు లాద్యులు సత్ప్రబంధముల్
ప్రాకటమాధురీరసశుభస్థితిఁ జేసిరి వారి సత్కృపన్
శ్రీకరసత్పురాణము లశేషతరంగముసంహితైకబో
ధాకలితార్థము ల్విలినయంతయుఁ గూర్తుఁ బ్రబంధసంగతిన్.

* * * *

క. చేతోభవకోటివిలా
సాతతసౌందర్యదీపితాకృతికిం గం
జాతభవభవనుతప్ర
ఖ్యాతికిఁ గళ్యాణవేంకటాచలపతికిన్

వ. సమర్పితంబుగా నేరచయింపంబూనిన వాణీవిలాసవనమాలిక యనుమహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

**End:**

క. ఓడల బండ్లున్ దీవెల
జాడలు నవియూర్వములఁ బ్రశస్తము సస్య
క్రీడారామగృహక్రియ
లోడక యిమ్మాడిఁ జేయ నురుశుభము లగున్.

* * * *

పం. మురామరారివీర ఘోరమూర్ధపంక్తిఖండనా
హారాజరాజమాని శేఖరార్చనప్రతోషణా
చిరంతనప్రసిద్ధశుద్ధసేవకౌఘపోషణా
సరోజరోపకోటిరూపసారరమ్యభాషణా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వరవరప్రసాదాసుకవివిచిత్ర మహాంకాళ్యప్పకొండార్యపుత్రపవిత్రగాత్రవినయగుణానునయ వెంగయక

విసహాయ తెకుమళ్లాన్వయపయఃపాథోధిపూర్ణసుధాకర తిమ్మమాంబికా ప్రపంగామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్రపవిత్ర యాప స్తంబసూత్రసత్కవిప్రమోదానుసంధాయి రంగశాయిప్రణీతంబైన శ్రీవాణీవిలాసవనమాలికయను మహాప్రబంధంబునందు . . చతుర్థాశ్వాసము.

(వి-వి.)—

నాలుగాశ్వాసములు గలవు వ్రాఁతమంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము కించించుకగలవు

ఇందు శాస్త్రపురాణాగమేతిహాసోక్తములగు వివిధవిషయముల స్వరూపమును సూక్ష్మముగవర్ణింపఁబడినది. కర్త తెకుమళ్ల రంగశాయికవి తిమ్మాంబిక కప్పరామాత్యులకుఁబుత్రుడు శ్రీవత్సగోత్రుఁడు. రామభద్రార్యునిశిష్యుఁడు. మహాంకాళివేంకటపతి(వేంగయ)కవి యనునాతఁడీగ్రంధకరణమున నీరంగశాయికవికిఁదోడ్పడెనట. ఇది శ్రీవేంకటేశ్వరునకుఁగృతి యీయఁబడినది. గ్రంథకర్త యితరకృతులు—(1) తిరువళ్లూరు వీరరాఘవశతకము, (2) కృష్ణదండకము, (3) జానకీపరిణయము, (4) ద్విపదభాగవతము.

గ్రంథము తుదను 45 పత్రములమేర బ్రౌనుదొరవారిచే నింగ్లీషున నీగ్రంథవిషయవివరణము వ్రాయఁబడియున్నది.

## No 763. వాణీవిలాసవనమాలిక.

## VĀNĪVILĀSAVANAMĀLIKA

Substance, paper Size, 12½ × 9¾ inches Pages, 72 Lines, 16 on a page. Mode of writing, good but contains mistakes Condition, fair. Appearance, old

Breaks off in the second Āsvāsa

Same work as the above

(వి-వి.)—

ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసాదినిగొంతవఱకునున్నది. వ్రాఁతయందమైనది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లేదు.

పూర్వమునోలె.

## No 764. వాణీవిలాసవనమాలిక.

### VĀNĪVILĀSAVANAMĀLIKA

Substance, paper Size, $13\frac{5}{8} \times 8\frac{1}{4}$ inches Pages, 133. Lines, 20 or 21 on a page. Mode of writing, good but faulty Condition, fair Appearance, old

Breaks off in the latter portion of the second Āśvāsa.

Same work as the above

(వి-వి.)—

మొదటినుండి రెండవ యాశ్వాసమునఁజాలవఱకునుగలదు. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

## No 765 వాణీవిలాసవనమాలిక.

### VĀNĪVILĀSAVANAMĀLIKA

Substance, paper Size, $9\frac{7}{8} \times 1\frac{1}{2}$ inches Pages, 41 Lines, 23 on a page Mode of writing, good but not correct Condition, fair. Appearance, old

Begins on fol. 112*a* of the MS. described under No 402 *ante*

Contains a portion of the first Āsvāsa

Same work as the above

(వి-వి.)—

తొలియాశ్వాసమునఁగొంతవఱకున్నది. వ్రాఁతబాగయినది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

## No. 766. వాణీవిలాసవనమాలిక.

### VĀNĪVILĀSAVANAMĀLIKA.

Substance, palm-leaf Size, $20\frac{1}{2} \times 1\frac{7}{8}$ inches Pages, 346 Lines, 8 or 9 on a page Mode of writing, fair but incorrect Condition, injured. Appearance, very old.

Contains Āśvāsas one to four only.

Same work as the above.

(వి-వి)—

నాల్గాశ్వాసములు. వ్రాఁత యొకతరబడిగానున్నది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. మిక్కిలి ప్రాచీనము.

పూర్వమువోలె.

---

## No 767 వికచోత్పలమాల.

## VIKACŌTPALAMĀLA

Substance, palm leaf Size, 17⅜ × 1¼ inches Pages, 249 Lines, 5 on a page Mode of writing, illegible and not correct Condition, injured Appearance, old Omissions are found here and there on account of the injured condition of the MS

Complete

This is the same work as the one described under R No 43 of Vol I, Part 3, Triennial Catalogue, which is only a copy made from this one

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతజిలుగు తప్పులున్నవి. గ్రంథము శిథిలమగుటచే నక్కడక్కడ గ్రంథపాతములు గలవు

ఇది ఆర్ నెం 43 రున వర్ణింపఁబడినదియే. ఆ ప్రతి కిది మాతృక యగును.

## No 768. విక్రమార్కచరిత్ర.

## VIKRAMĀRKACARITRA

Substance, paper Size, 11⅝ × 7½ inches Pages, 459 Lines, 16 on a page Mode of writing, good, written on 2/3 of each page and not correct Condition, good Appearance, old

Contains eight Āsvāsas

By Jakkana This is the same work as that described under R No. 153 of Triennial Catalogue of MSS., Vol II, Part 3, but contains also the beginning. Janna the father of Siddhana to whom the work is dedicated, and Mantribhāskara, the uncle of Siddhana, were brought up by Dēvarāja Mahārāja and were rewarded by him often Sūranna of Vennalaganti family, the uncle of Siddhanamantri, was one of the ancestors of another Sūranna who is said to be the author of Visnupurāna in Telugu and who was rewarded by Reddi Vēmādhīśwara

A few line in Englis on the fly-leaf of the MS by Mr C P Brown deal with the composition of this work. Contents are noted on the margin throughout the MS

The following notes apparently of Mr Brown appear —

*I —On the fly-leaf of the MS*

కవి జక్కయ్య చెప్పిన విక్రమార్క చరిత్ర.

This book, being of late date, and written at a period when Telugu literature was fallen into great neglect,—is rarely to be met with I have procured only two manuscripts, which are in fact the same, as they have correspondent defects and probably were transcribed from the same original Since writing this, I have procured two more copies, and in these also the defects and omissions correspond Hence it is to be concluded that in these parts the work was left incomplete by the author I have caused a summary of the story to be written in the margin throughout

*II —Just at the beginning of the work*

*N B* —This manuscript being in some places imperfect I have cited it in the Dictionary by the numbers of the pages If therefore it is again transcribed, those numbers must be noted on the margin

*III —At the close of the MS*

*N B* —This word, సర్వం finis, is not in the other copy, and was, I imagine, inserted by the transcriber The book not being complete .

The other copy terminates thus

మహాకావ్యంబునందు అష్టమాశ్వాసం మంగళ మహా శ్రీశ్రీశ్రీ జయనమః.

క. వ్రాలాశభ్రిలు తప్పులు
చాలంగా గలవుశబ్ద సంగతులెరుగ
గేలింబెట్టక నవ్వక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా.

అ. వ్రాతతప్పువలన వాచకులలుగక
తప్పుగలిగినేని తగినయెడల
వలయునక్షరములు వర్ణించిదిద్దుడీ
సుకవులైనవారు సురుచిరముగ.

It is very possible that this poem was left only so far finished by the author. Being similar in structure to the Arabian Nights it is quite complete as far as it goes

**Beginning:**

శా. శ్రీగౌరీకుచలీనమౌక్తికమణిశ్రేణీవిభూషామణి
ప్రాగల్భ్యంబులు కృష్ణపాండురతనుప్రౌఢిం బ్రతిష్ఠింపఁ దే
జోగణ్యుం డయి యొప్పు శ్రీహరిహరేశుం డెప్డు రక్షించు వి
ద్యాగంభీరుని జన్నమంత్రిసుతు సిద్ధామాత్యచూడామణిన్

ఈ ఘుత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁ డై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరామచా
చిత్రములున్ బుధవ్రజగరిష్ఠత నెట్టియ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్.

*   *   *   *

సీ. . . . . . . .

మహిమఁ గొలువంగ నాస్థానమంటపమున
జనితసాహిత్యసౌహిత్యసరసగోష్ఠిఁ
జిత్త మిగురొత్త జన్నయసిద్ధమంత్రి
కొలువుగూర్చుండి నను వేడ్కఁ బిలువఁబంచి

సీ. సంస్కృతప్రాకృతశౌరసేన్యాదుల
గడియలో నొకశతకంబుఁ జెప్పఁ
బ్రహసనప్రకరణభాణాదిబహువిధ
రూపకంబులయందు రూఢి మెఱయఁ
జక్రచతుర్భద్రచతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు
మేలుగాఁ దజ్జ్ఞులు మెచ్చఁ జెప్ప

నిమ్ముల నేరిణి నేధాతువున నేమి
నవసరములను వర్ణనలు సేయ
సర నేకసంధాద్విసంధాత్రిసంధలఁ
దొడరినఁ బొరిఁబొరిఁ గడవఁ జదువ
నెవ్వఁ డేయవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లు నూప
వృత్తకందము కందవృత్తంబులునుజతు
షకందంబు మొదలుగాఁ గలుగుగర్భ
కావ్యవర్గము చెప్పఁగ్రమప్రబంధముల్
క్రొత్తలుపుట్టించుకొని లిఖింపఁ
గా నచ్యుతకంబు బంధచ్యుత
కంబు నామ . . .
గోప్యంబులును క్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప గోష్ఠియందుఁ

బద్యంబు గీతి నార్భటమునఁ జదువంగ
నెల్లవిద్యలనించు కెఱుఁగ నేర్తు
వనుచు నెల్లూరితిరుకాళమనుజవిభుని
సమ్ముఖంబున సాహిత్యసరణి మెఱసి
మహిమ గాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమఁడవు నీవు నీవంశమహిమ యొప్పు.

క. ఆడఁడు మయూరు రేఖను
కాడఁడుఁబాఱుండు బాణగతి మన మెఱియన్
బ్రోఁ. గుపెద్దయయన్నయ
మాడకు మాడెత్తు వా నిమాటలు జగతిన్.

క. అని మీతండ్రిమహత్త్వము
జనన తసత్ప్రసంగసంగతకవితా
ఘనతేజులు కవిరాజులు
గొనియాడుదు రఖిలరాజకుంజరసభలన్.

* * * *

క. చక్కన నీవైదుష్యము
చక్కన నీకావ్యరచనచాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీయాశుమహిమ జక్కనసుకవీ.

తే. వనము నిధియును నగ్గిల్లు వరుస సుతులు
చెరువు గుడియును ధరఁ బ్రతిష్ఠితము లయ్యెఁ
గృతియుఁ గైకొన్న సప్తసంతతులవలనఁ
గీర్తి సుకృతంబులకు నేను గర్తనగుదు

* * * *

చ. తలఁపఁ దదీయనాయకవితానముకంటెను సాహసక్రియా
కలితవదాన్యతా ద్విగుణగౌరవరేఖల విక్రమార్కభూ
తలపతి యెక్కుడై నెగడెఁ దచ్చరితంబు ప్రబంధశయ్యగాఁ
దెలుఁగునఁ జెప్పి యాకృతి పతిత్వము మా కొడఁగూర్పు నేర్పునన్.

వ. అని సవినయంబుగాఁ గనకమణిభూషణాంబరతాంబూలంబు లొసంగి గారవించిన బ్రమోదించి తత్ప్రబంధబంధనాముఖాకల్పంబుగా నాప్రధానోత్తమువంశంబు ప్రశంసించెద.

* * * *

సీ. వేదశాస్త్రపురాణవిజ్ఞానసరణిమై
నధిగతపరమార్థుఁడై తనర్చె
నెద్దనఘాఁడిరాజేంద్రచోడక్షమా
రమణుచే నగ్రహారములు వడసెఁ
గనకదండాందోళికాచ్ఛత్రచామర
ప్రముఖసామ్రాజ్యచిహ్నముల నొప్పె
సర్వతోముఖముఖ్యసవనక్రియాప్రౌఢి
నుభయవంశంబుఁ నుద్ధరించె
నన్నదానాదిదానవిద్యాఘనుండు
పరమశైవసదాచారపారగుండు
హరితవంశాంబునిధిచంద్రుఁ డార్యనుతుఁడు
సుగుణవిభ్రాజి సూరనసోమయాజి.

క. అమ్మహితాత్మునిమనుమఁడు
సమ్మానదయాభిధానసౌజన్యరమా
సమ్మోదితబాంధవుఁడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యెన్నిక కెక్కెన్.

చ. వనరుహనాభు కుద్ధవుఁడు వజ్రికి జీవుఁడు వత్సనారుణీ
శునకు యుగంధరుండు దితిసూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టిరీతి నధికుం డగునన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నతులఁబొందెను సిద్ధనమంత్రియిద్ధగన్.

వ. అమ్మహాప్రధానోత్తముండు

చ. పరిణతనవ్యసాఖ్యరసభావవిజృంభణభూతివిక్రియా
స్ఫురితచరిత్రతత్త్వసరసుం డగు పేరయయన్ననార్యుసో
దరి యగుసూరమాంబిక ముదం బలరంగఁ బరిగ్రహించె భా
స్వరకమలాజనార్దనవివాహమహోత్సవలీల మీఱఁగన్.

క. ఆదంపతులకు సుకృత
ప్రాదుర్భావ మన మంత్రిభాస్కరుఁడు దయా
పాదితబాంధవనికరమ
హోదయుఁ డగుజన్నమంత్రి యుం గలిగె రొగిన్.

సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నె వెట్టి
పరమహృద్యం బైనపద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసి
రసికత్వమున దేవరాయమహారాయ
కరుణాకటాక్షవీక్షణము గాంచి
కర్ణాటకటకము ల్గలయంగ మెచ్చంగ
గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
గురులఁ బోషించె సత్కవీశ్వరుల మంచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హారీతమునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁ డైయొప్పు సిద్ధయజన్నమంత్రి.

* * * *

వ. అమ్మహామంత్రీశ్వరునకుఁ గులపాలికారత్నంబు.

సీ. . . . . . . . .
రూపమున నీవధూమణిఁ జూపి చెప్ప
జోడు లేరు సురాధిపుసుదతి దక్క
ననఁగఁ బుణ్యపుమడి మోచి యక్కమాంబ
బంధువులపాలిసురభి నాఁ బరగెఁ ధరణి.

క. ఆరమణీరమణులకును
శ్రీరంజిల్లంగ నవతరించిరి విభవా
దారుఁడు సిద్ధనమంత్రియు
నారూఢయశుండు భైరవామాత్యుండున్.

* * * *

సీ. చిత్రగుప్తులకైనఁ జింతింప నరుదైన
గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁగాఁ నొనర్చె
నాణిముత్తెముల సోయగము మించినవ్రాల
వరుసతో నిరుగేల వ్రాయఁ నేర్చె
నాత్మీయలిపిరియట్ల యన్యదేశంబుల

లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె
దేవరాయమహారాయధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పె జన్నయసిద్ధమంత్రి.

* * * *

క. చందురుఁ గన్నపయోనిధి
చందంబున సిద్ధమంత్రి జనతానయనా
నందుండు తిప్పధీమణి
నందనుఁ డగునిత్యసేవనస్థితి మించెన్.

వ. తదీయానుజుండు.

సీ . . . . . . . .
నీతిచేత వినీతిచే నేర్పు మెఱసి
గరిమదనరాజు ధనరాజుగా నొనర్చె
సుగుణచంద్రికానందితసుజనహృదయ
కైరవుం డగుజన్నయభైరవుండు

* * * *

వ. ఈ దృగ్వంశవర్ణనాసముదీర్ణకీర్తి నిధానంబైన యమ్మంత్రి నిధా
నంబునకు

ఉ. వెన్నెలకంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డి వేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతిగన్న సిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన కావ్యకథా
లక్ష్మికి సుధాసాగరంబైన మధురానగరం బెట్టిదనిన.

(రెండవయాశ్వాసాంతమున)

శా. శ్రీమద్బెల్లముకొండ_రవకృపాశ్రీలబ్ధసామ్రాజ్య . .

**End**

ఉ. పాడిసమస్తముం బొగడుఁ బాయక యాశ్రమవర్ణధర్మముల్
జాడలు దప్పకుండ మతి సజ్జనరక్షణదుష్టశిక్షణ
క్రీడల భూషణంబులుగఁ గీర్తి వహించె ధరిత్రి నవ్విభుం
డేడవచక్రవర్తి పదియేడవరాజును నై మహోన్నతిన్.

* * * *

మ. శ్రీమదుభయాన్వయవిశేషతరకీర్తిబుధశేఖరవిరాజితవివేకా
కామితఫలప్రకరకల్పితవితీర్ణి జితకల్పకసమాజ సురరత్నా
స్వామిహితకార్యగతిసంఘటననైపుణవిచారనయమార్గమహనీయా
సామజహయాదిబహుసంపదభిరామగృహసన్నిహితమంగళమహాశ్రీ.

**Colophon**

గద్య. ఇది శ్రీమదఖిలకవిమిత్ర పెద్దయయన్నయామాత్యపుత్ర శారదాదయావిధేయ జక్కయనామధేయప్రణీతం బైన విక్రమార్కచరిత్రం బనుమహాకావ్యంబునందు సర్వంబు నష్టమాశ్వాసము

ఎనిమిదాశ్వాసములుగలవు. వ్రాఁత బాగుగా నున్నది. ప్రతి పత్రమున రెండుపంక్తులుమాత్రమే వ్రాయఁబడినది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు చాలఁగలవు.

ఈ ప్రబంధమున విక్రమార్కుని సాహసౌదార్యాది గుణములను వెల్లడించు గాథలు వర్ణింపఁబడినవి. గ్రంథకర్త జక్కనకవి. ఈతఁడన్నయామాత్యునిపుత్త్రుఁడు ఇతని తాత పెద్దయామాత్యకవి నెల్లూరు తిరుకాళరాజును దనపాండిత్య ప్రకర్షచే మెప్పించినాఁడట. ఈగ్రంథము సిద్ధనమంత్రికిఁ గృతియీయఁబడినది. ఇతని తండ్రి జన్నమంత్రి. ఇతఁడు దేవకీతనయశతక కర్తయట! పెదతండ్రి మంత్రిభాస్కరుఁడు. జన్నమంత్రి సిద్ధనమంత్రి వీరిరువురును దేవరాయ మహారాయలచేతఁబోషింపఁబడి యాయనవలన ననేక పారితోషికములంబడసిరట. వెన్నెలకంటి సూరన్న యాసిద్ధమంత్రికిఁ బెదతండ్రియఁట. ఈ సూరన్న విష్ణుపురాణ కర్తయగు సూరన్నవంశమున పూర్వుఁడగును. ఈతఁడు రెడ్డి వేమాధీశ్వరుచే నగ్రహారములంబడసిన కవిశ్రేష్ఠుఁడట. విశేషములకుదాహృతభాగములంగాంచునది.

ఇది ఆర్. నె 153 రున వర్ణింపఁబడియున్నది.

ఈ గ్రంథకరణమును గుఱించినవిషయము కొంత బ్రౌనుదొరగారిచే నింగ్లీషున ముఖపత్రాదులపై వ్రాయఁబడియున్నది.

## No 769. విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Substance, paper Size, $7\frac{7}{8} \times 6$ inches Pages, 232. Lines, 15 on a page Mode of writing, good but faulty, written on only one side of the paper Condition, injured Appearance, old

Complete but imperfect owing to omissions here and there

This is the same work as the one described under R. No 68, Vol I, Part III

The different readings are noted in the MS On the fly leaf of the MS, there is a pencil note probably of Mr. Brown which runs as follows .—

Chemacura Vencut Raz, author of this poem, wrote also the Sāranga-padya

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు మెండు. గ్రంథపాత ములుగలవు. శైథిల్యము గలదు.

ఇది ఆర్. నె 68 రున వర్ణింపఁబడిన గ్రంథమే. ఇందు పాఠభేద ము లధికముగఁ జూపట్టుచున్నవి.

## No 770. విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU

Substance, palm-leaf Size, $16 \times 1\frac{5}{8}$ inches Pages, 86. Lines, 5 on a page Mode of writing, fair but incorrect. Condition, injured. Appearance, old.

Contains the second and the third Āśvāsas only

Same work as that described under the previous number

The name of the scribe and the date of transcription are given at the end of each of the Āśvāsas

(వి-వి.)—

ద్వితీయ తృతీయాశ్వాసములు మాత్రము గలవు. వ్రాఁత యొక తరబడిగా నున్నది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథ పాతము కాన్పింపదు

ఇది పూర్వ వర్ణిత గ్రంథమే.

ద్వితీయాశ్వాసాంతమున :—

“ సాధారణ సం॥ వైశాఖ బ ౨ శే॥ నాడువరుకు కోటింశేషాచలం గుమ్మిడి కంగులు కొమారుడు శివనాగులు అనువాడికి వ్రాసి యిచ్చెను ” అనియు

తృతీయాశ్వాసాంతమున :—

“ సాధారణ సంవత్సర శ్రావణ బ. ౯ సోంవార్వరం నూంఉడు॥ ముఃవరుకు గుమ్మడి కంగులు (కంగులు) బాహధరుగారికి త్త కొమార్లు శివంనాగులు స్వహస్థ లిఖితంగా వ్రాసి సమర్పించెను ” అనియు నున్నది.

---

## No. 771 విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU

Substance, palm-leaf. Size, 12½ × 1¼ inches. Pages, 61. Lines, 5 on a page. Mode of writing, fair but not correct. Condition, injured. Appearance, old.

Contains the first Āsvàsa without the introductory portion.

Same work as the above.

(వి-వి.)—

కృత్యవతరణికవినా ప్రథమాశ్వాసము మాత్రము గలదు. వ్రాంత యొక తరబడిగా నున్నది. తప్పులు మెండు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No 772 విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 84. Lines, 8 on a page. Mode of writing, fair but faulty. Condition, injured. Appearance, old.

Complete, but without the prefatory portion. The seventh leaf in the MS is *missing*.

Same work as the above.

(వి-వి.)—

కృత్యవతరణికదక్క తక్కినదంతయు సమగ్రముగా నున్నది వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు కలవు 7 వ పత్రము లేదు.

పూర్వమువలె.

## No 773. విజయవిలాసము
## VIJAYAVILĀSAMU

Substance, palm-leaf Size, 17½ × 1⅝ inches Pages, 63 Lines, 5 or on a page Mode of writing, not good and not much faulty Condition, injured Appearance, old

Contains the first Āśvāsa complete without the prefatory portion an the second Āśvāsa incomplete

Same work as the above.

(వి-వి.)—

కృత్యాది భాగము తక్కందక్కిన ప్రథమాశ్వాసభాగమును, ద్వి యాశ్వాసమున గొంత దనుకను గలదు. వ్రాంత మంచిది కాకపో నను తప్పులు మిక్కిలి లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతము నుండవచ్చును.

పూర్వమువలె.

గ్రంథముఖపత్రమున

"ప్లవంగ నామ సం॥ జ్యేష్ఠ శు ౧ శె తారికున కాలీవాస వచ్చి వుప్పి నీరు పొంగిన తారీకు.

యీ విజయ విలాసమూ యీ శు 3 సోమవారాన మాజే సర్వేశలింగంకు దొరికినది."

అని యున్నది.

## No. 774 విజయవిలాసము.
## VIJAYAVILĀSAMU

Substance, palm-leaf Size, 16¾ × 1⅝ inches. Pages, 74 Lines, 6 on page. Mode of writing, not good and not correct. Condition, injure Appearance, old.

Contains the second Āsvāsa complete and the third Āśvāsa incomplete.

Same work as the above.

(వి-వి.)—

ద్వితీయాశ్వాసము సమగ్రముగను తృతీయాశ్వాసమునఁ గొంత దనుకను గలదు, వ్రాఁత మంచిది కాదు. తప్పులును గలవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

## No 775 విజయవిలాసము

## VIJAYAVILĀSAMU.

Substance, palm-leaf Size, 15¾ × 1½ inches Pages, 126 Lines, 7 on a page Mode of writing good, but full of mistakes. Condition, injured. Appearance, old

Complete, but wants the prefatory portion.

Same work as the above.

(వి-వి.)—

గ్రంథావతరణికతప్ప తక్కినదంతయుఁ గలదు వ్రాఁతయందమైనది. తప్పు లధికము. శైథిల్యము గలదు. గ్రంథపాతము కాన్పింపదు. పూర్వమువలె.

## No. 776. విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Pages, 43. Lines, 5 on a page Mode of writing, scribbled and resembles Kanarese and full of mistakes Condition, fair Appearance, old.

Begins on fol 1*a* of the MS described under No 468.

Pages 1—22 contain a portion of the first Āśvāsa from the beginning and the remaining pages contain certain select stanzas from the work The foll 12 and onwards are not numbered.

Same work as the above

(వి-వి.)—

తొలినుండి కథారంభమునఁ గొంతవఱకు మొదలిపదొకొండు పత్రములయందును గలదు. తర్వాత పత్రములయందు సంఖ్య కానరాదు. వానియందు గ్రంథమున నక్కడక్కడ కొన్నికొన్ని పద్యము లెత్తి వ్రాయఁబడియున్నవి. వ్రాత కన్నడముఁ బోలిజిలుఁగుగా నున్నది. తప్పులు మెండు. శైథిల్య మంతగా లేదు. గ్రంథపాతము కలదు.

పూర్వమువోలె

---

## No. 777 విజయవిలాసము

## VIJAYAVILĀSAMU

Pages, 14. Lines, 6 on a page Mode of writing, fair but incorrect.

Begins on fol 3*a* of the MS described under No. 659.

Contains a fragmentary portion in the middle of the first Āsvāsa.

Same work as the above

(వి-వి.)—

ప్రథమాశ్వాసమందలి నడిమి భాగము కొంతగలదు. వ్రాఁత యొక తరబడిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

---

## No 778 విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Substance, palm-leaf Size, 15½ × 1⅜ inches Pages, 96 Lines, 8 on a page. Mode of writing, good and apparently correct Condition, much injured and wants one leaf at the end. Appearance, very old

Complete but very imperfect

Same work as the above

(వి-వి.)—

సమగ్రమే కాని యతి శిథిల మగుటచే గ్రంథపాతము లధికముగాఁ గలవు. వ్రాఁత మంచిదే. తప్పు లంతగా లేవు. కడపట నొక పత్రము గూడ లేదు.

పూర్వమువోలె.

గ్రంథాంతమున ఎద్నపూండి గ్రామ కరణములు కాపులు కనగ వరపు వెంకటాచలంగారి కుమారుడికా గ్రామమున నేపాతికెకుం (చెడు) వి స్తీర్ణం భూమిని దానముచేసినట్లు వ్రాసియిచ్చిన దానపత్రము శిథిల మొకటి కలదు.

## No 779. విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Pages, 58 Lines, 5 on a page Mode of writing, fair but not correct Condition, much injured, and many leaves are missing and many of the existing leaves are broken and without numbers

Begins on fol 1 *a* of the MS described under No. 535

Incomplete. Contains only fragments here and there owing to the injured condition of the MS.

Same work as the above

(వి-వి.)—

గ్రంథ మింతయున్నదన నలవికానంత శిథిలముగా నున్నది. పెక్కు పత్రములు కాన్పించవు ఉండెడు వానిలోఁ జాల విఱిగిపోయినవి. గ్రంథపాతము లధికము. వ్రాఁత యొక తరబడిగా నున్నది. తప్పు లధికము.

పూర్వము వోలె.

## No 780. విజయవిలాసము.

## VIJAYAVILĀSAMU.

Substance, palm-leaf Size, $15\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 112. Lines, 6 on a page Mode of writing, not good and not correct. Condition, much injured. Appearance, very old. Many leaves are broken

Complete but without the prefatory portion

Same work as the above

Name of the scribe and the date of transcription are extracted below as found at the end of the MS

(వి-వి.)—

కృత్యవతరణిక మాత్రము లేదు. వ్రాత మంచిది కాదు. తప్పు లున్నవి. శైథిల్యమువలననైన గ్రంథపాత మధికము.

పూర్వము వోలె.

## No 781 విజయవిలాసము
## VIJAYAVILĀSAMU

Substance, palm-leaf Size, $15\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 112 Lines, 7 on a page Mode of writing, fair but incorrect Condition, injured Appearance, old

Wants the prefatory portion

Same work as the above

The name of the scribe and the date of transcription are given below as found at the end of the MS

(వి-వి.)—

కృత్యవతరణికభాగముతక్కఁదక్కిన దంతయు గలదు. వ్రాఁత యంత మంచిదికాదు. తప్పులు కలవు. శైథిల్యముకలదు. గ్రంథ పాతములు కలవు.

పూర్వమువలె.

## No. 782. విజయవిలాసము (సవ్యాఖ్యానము).
## VIJAYAVILĀSAMU (WITH COMMENTARY)

Substance, paper Size, $12 \times 7\frac{3}{4}$ inches Pages, 376 Lines, 22 on a page Mode of writing, good but not correct Condition, fair Appearance, old

Complete but without the prefatory portion

The text is the same as the above The commentary is by Jūlūri Appayapandita who seems not to have commented upon the prefatory portion.

**Beginning :**

**Text.**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యీ విజ యవిలాసంబను శుభోదర్కప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన నైమి శారణ్యమహామునులకు రోమహర్షణి యిట్లనిచెప్పం దొడంగె.

**Comment.**

టీ. అభ్యుదయ . . . . వృద్ధిగా = అభ్యుదయ శ్రేయ స్సులయొక్క పరంపరా పంక్తులకు అభివృద్ధిగా మిక్కిలివృద్ధియగునట్టు

గాను నాయొనర్పంబూనిన నేనురచించుటకుయత్నముచేసినటువంటి యీ
విజయవిలాసమనేపేరుగలిగిన శుభోదరః శుభరూపమైన ఉత్తరకాల
ఫలముగల ప్రబంధంబునకు కావ్యమునకు కథా కథయొక్క క్రమంబు
సరళి యెట్టిదనిన యేలాగంటిదంటెను నైమిశారణ్యమహామునులకు నై
మిశ నైమిశమనేపేరుగల అరణ్యా వనమందలి మహామునులకు మునిశ్రేష్ఠు
లకు రౌమహర్షిణి రోమహర్షణునియొక్క కుమారుడైన సూతుడు యిట్ల
నియె యీలాగనిచెప్పెను.

**End :**

**Text :**

ఖ. అరాతిక్ష్మాభృద్భిదాంచత్కృపాణా ।
నరాధీశ్వరాకారనాళీకబాణా ।
స్థిరానందనారామసేవాధురీణా ।
విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా. ।

**Comment :**

టీ. అరాతిక్ష్మాభృద్భిదాంచత్కృపాణా అరాతి శత్రువులైనటు
వంటి క్ష్మాభృత్ రాజులయొక్క భిదా భేదనమందు అంచత్ ప్రకా
శిస్తున్నటువంటి కృపాణా ఖడ్గముగలవాడా, నరాధీశ్వరాకారనాళీకబాణా
నరాధీశ్వర నరులకుప్రభువైనరాజుయొక్క ఆకార రూపమువహించినటు
వంటి నాళీకబాణా కమలమయ్యేవేబాణముగలిగినటువంటిమన్మథుడా అ
నగా మన్మథునితోసమానమైన చక్కదనముగలవాడా అని అర్థము, స్థిరా
నందనారామసేవాధురీణా స్థిరా భూమియందలి నందనారామసేవా
నందనవనమునుసేవించడమందు ధురీణా ధురంధరుడైనయింద్రుడవైన
వాడా అనగాభూమియందుయింద్రునివలెప్రకాశిస్తున్నవాడా అని అర్థ
ము, విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా విరాజత్ మిక్కిలిప్రకాశిస్తున్నటు
వంటి చతుష్షష్టి అరువదినాలుగైనటువంటి విద్యా విద్యలయందు ప్రవీణా
సమర్థుడవైనవాడా

**Colophon :**

**Text :**

గద్య—ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధసారసారస్వతనయ
వినయధురీణసకలకళాప్రవీణ అచ్యుతేంద్రరఘునాథభూపాలదత్తహస్త
ముక్తాకటకవిరాజమానవేంకటరాజకవిప్రణీతంబైన విజయవిలాసంబను
మహాప్రబంధంబునందుసర్వంబును దృతీయాశ్వాసము.

**Comment:**

టీ యిందుకు ప్రథమాశ్వాసప్రకారమే.

(వి-వి.)—

అవతారికతకర్ణదశిర్ణసగ్రంథమెల్లఁగలదు. వ్రాఁతమంచిది. తప్పు లు లేవు శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

ఇది చేమకూరవేంకటపతికృతవిజయవిలాసమునకు, జూలూరి-అప్ప యపండితుఁడు రచియించిన టీక. గ్రంథావతారిక కాయన టీక వ్రాయ లేదు కాఁబోలును ; ఇందుమూలముకూడఁగలదు

### No 783. విజయవిలాసము (సవ్యాఖ్యానము)

### VIJAYAVILĀSAMU (WITH COMMENTARY)

Substance, paper Size, 13¼ × 8¼ inches Pages, 23 Lines, 25 on a page Mode of writing, good but not quite correct Condition, good Appearance, old

Begins on fol 141*a* The other works herein are:--Krṣnakatha 1*a*, Āndhradīpika 12*a*, Dēsiyapadanighaṇṭu 23*a*, Vaidyanighantu 48*a*, Sivayōgasāramu 108*a*, Caudappa Śatakamu 120*a*, Vēmana-padyamulu 129*a*

Contains 32 stanzas in the first Āsvāsa from the beginning of the story

Same work as the above

(వి-వి.)—

కథారంభమునుండి ౩౨ పద్యములు మాత్రముకలవు వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

### No. 784. విజయవిలాసము (సవ్యాఖ్యానము).

### VIJAYAVILĀSAMU (WITH COMMENTARY)

Pages, 63 Lines, 33 on a page Mode of writing, good but n t quite free from mistakes Condition, good Appearance old

Begins on fol 226*a* of the MS. described under No 436

Contains 129 stanzas in the first Āśvāsa from the beginning of the story

Same work as the above

(తె-తె.)-

కథారంభము నుండి ౧౨౯ పద్యములు కలవు వ్రాత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వవర్ణిత గ్రంథమే.

## No 785. విజయవిలాసము (సవ్యాఖ్యానము).

## VIJAYAVILĀSAMU (WITH COMMENTARY)

Substance, paper Size, 11⅜ × 7¼ inches Pages, 286 Lines, 29 on a page Mode of writing, good and not quite correct Condition, injured Appearance, old

Complete but without the prefatory portion

Same work as the above This is the original from which the work described under No 781 ante was copied.

A note, apparently of Mr C P. Brown, which appears on the fly-leaf of the MS f runs as follows —

" This commentary on the Vijayavilasam, a very celebrated Telugu poem, was written by the learned Zuluri Appaya, on a comparison of six manuscripts under the directions of C P Brown at Masulipatam in 1831

*N B*—The preface is wanting in this copy and must be supplied from my first manuscript when the book is copied fair."

The name of the commentator and the date of the completion of commentary are extracted as given at the end of the MS

(తె-తె)—

కృత్యవతరణికతక ౧౦ దికిపదంతయు గలదు. పత్రమున కొక వైపున వ్రాయఁబడినది వ్రాత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు

పూర్వవర్ణిత గ్రంథమే. ఇది నె 781 రున వర్ణింపఁబడిన గ్రంథము నకుమాతృక.

గ్రంథాంతమున.

"యీవిజయవిలాసప్రబంధమునకు టీకరచించేలాగున చార్లీసు పిలిప్ బ్రౌణుదొరగారు సెలవిచ్చినందున మచిలీపట్టణమందు జూలూరి అప్పయ్య పంతులు రచించడమైనది. ఇంగిలీషు సంవత్సరము ౧౮౩౦ డిశంబరు ది ౧౧ వికృతినామసంవత్సర మార్గశిర బ॥ ౧౨ లవరకు సంపూర్ణమైనది"

అనియున్నది.

## No 786. (అల్లాడ) విజయభూపతి సింహవిలాసము.

## (ALLĀDA) VIJAYABHŪPATI SIṀHAVILĀSAMU.

Substance, palm-leaf Size, $9\frac{7}{8} \times 2\frac{1}{4}$ inches Pages, 80 Lines, 13 on a page Mode of writing, good and incorrect Condition, fair Appearance, old

Begins on fol 2*a*. The other works herein are Rājamahēndrapuramōhana dandakamu, 41*a*, Rājayōgasāramu; 48*a*

Complete but without the first canto

A prabandha purporting to describe the amours of Allāḍa Vijaya Bhūpatisimha who is stated to have ruled at Rajahmundry after Rājarāja Narēndra The work is stated to have been written by his wife Saundaryadēvi, daughter of Rāravītī Narapati and Mauktikāmba This is made out from the work itself, which appears to be a literary larceny; and it is evidently the same as Mannārudāsavilāsamu of Rangāji who has described the amours of her paramour Vijayarāghava Naik of Tanjore

**Beginning:**

క. శ్రీవిజయభూపతిన్నృప
భూవలయప్రాజ్యరాజ్యపోషణదక్షా
శ్రీవత్సకలితవక్షా
శ్రీవరమహేంద్రపురీశశ్రీలక్ష్మీశా

---

వ అవధరింపుము.

ఉ ఎంతటివేడ్కగాంచెనవనీశుమహోత్సవముంగనుంగొనన్
కాంతలుదాములోకమునఁగల్గుబుధోత్తములెఁగుదేరన

త్యంతమనోహరాకృతిని దానునువచ్చెవసంతమంత నే
కాంతసుగంధవాసితదిశాంతలతాంతముసంతసంబున౯.

**Colophon**

ఇది శ్రీమన్నారాయణకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమానసారసారస్వతధురీణయు, విచిత్రతరపత్రికాశతలిఖితవాచికార్థావగాహన ప్రవీణయు, అతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారదయు, రాజనీతివిద్యావిశారదయు విజయభూపతిసింహనరేంద్రవిభునిత్యసంభావితయు విద్వత్కవిస్తుతగుణసేవితయు రాచవీటినరపతిబహుజన్మతపఃఫలంబును మార్తికాంబాగర్భశుక్తిముక్తాఫలంబును, సరససద్గుణకదంబయునగు-సౌందరివచనరచనాచమత్కృతిం జెన్నుమీర అల్లాడ భూపతిసింహవిలాసంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

**End:**

సీ. శ్రీరామచంద్రనిర్మితమైనయంసేతు
వెన్నివేలేండ్లు తా నెసఁగుచుండు
నలవిభీషణుఁడు నత్యకలంకమతి లంక
నెన్నివేలేఁడ్లుతా నేలుచుండు
. . . ఇల నెన్నివేలేండ్లు
సొంపుమీఱఁగ భరియింపుచుండు
మహేంద్రనాధుచరిత్రమహి నెన్నివేలేండ్లు
విబుధులుగొనియాడ వెలసియుండు
నన్నివేలేఁడ్లుపుత్త్రపౌత్రాభివృద్ధి
రాజ్యలక్ష్మీసమృద్ధినిరంతరముగ
విజయము౯ జాలఁగైకొని వెలయఁగలఁడు
విజయభూపతిసింహనరేంద్రవిభుఁడు

(వి-వి.)—

ప్రథమాశ్వాసముతక్కఁదక్కినగ్రంథమెల్లఁగలదు. వ్రాఁతచక్కనిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు లేవు.

రాజరాజనరేంద్రునసంతరము రాజమహేంద్రపురాధీశ్వరుఁడయిన యల్లాడవిజయభూపతిసింహుని శృంగారచరిత్రమునాతనిభార్యయు, రాచవీటినరపతికినిమార్తికాంబకునుగూఁతురుననగు సౌందరీదేవి, అల్లాడ విజయభూపతిసింహవిలాసమను పేరఁ బ్రబంధముగారచియించినట్లిందుఁగలదు

ఇది వట్టిబూటకముగాఁ దెలియవచ్చుచున్నది. తంజావూరి తెలుఁగు రాజై సుప్రఖ్యాతుఁడైన విజయరాఘవనాయకుని ప్రేమపాత్రమగు రంగాజియను స్త్రీ రచియించిన విజయరాఘవనాయకచరిత్రమే యగు మన్నారుదాసవిలాసమను ప్రబంధమే యిది యగును. కర్తపేరు, కృతినాయకునిపేరు, మొదలగునవి యిం దన్యథాకరింపఁబడినవి. ఇం దిప్పుడున్నవిధమునఁ గృతినాయకాదులు చరిత్రాంశపరిశీలకులకు గోచరింపకున్నారు.

## No 787. విష్ణుమాయానాటకము.
## VISNUMĀYĀNĀTAKAMU

Substance, paper Size, 12¼ × 8 inches Pages, 319 Lines, 25 on a page Mode of writing, good but not free from mistakes Condition, good Appearance, old.

Complete except without the prefatory portion.

A classical Prabandha in five Āśvasas by Cintalapūdi Ellakavi dealing with the different wonderful actions of God Visnu A reference may be made to R. Nos 346 and 347 for more particulars regarding the author His other works are Rādhāmādhava and Tārakabrahmarājīyamu.

**Beginning**.

తే. భాగవతముఖ్యుఁడగు శుకబ్రహ్మచేత
భాగవత సత్కథా పరబ్రహ్మవిద్య
యెలమి వినుచుఁ బరీక్షిన్నరేంద్రచంద్రుఁ
డచ్యుత క్రీడ లాత్మ కింపారఁబలికె.

చ. కనుఁగొన నింద్రనీల మణికాంతినొకప్పుడు పూర్ణచంద్ర చం
దనరుచి నొక్కవేళ నరుణద్యుతి కుంకుమదీప్తి నొకచోఁ
దనరి గుణత్రయాత్ముఁడయి తానె సమస్తమునైనదేవునిఁ
వనరుహనాభుఁ బల్మరు మనంబున భావనచేసి వేఁడియుఁ.

* * * *

శా ఈమార్గంబున శాస్త్రివాక్యములు ప్రత్యేకార్థయుక్తంబులై
భూమిం బెక్కుమతంబుల న్నడవఁగా బుద్ధిప్రకాశోన్నమ
త్సామర్థ్యంబున నెల్లవారు బహువాదప్రౌఢి నాయామతం
బే మేలంచు భ్రమింపుచుంద్రు తమకేదిష్టంబు తన్ముద్రతోఁ

చ. కమలదళాక్షుఁ డింతటికిఁ గారణ మావెడగాని యింద్రజా
లము భువనత్రయంబు సకలక్రియలుం దదభీష్టకేళితం
త్రములరయంగ నాతనిమనంబున కెట్టులుదోఁచెనట్ల వి
శ్వముఁజరియించు నెవ్వరికిశక్యము స్వేచ్ఛఁ బరంబు పొందగన్.

వ. మహామాయానాటక సూత్రధారుండగు నప్పరమ పురుషుండును
జూపు దివ్య కేళీకృత్యంబులు బహువిధ విచిత్ర ప్రహ్లాదకారణంబులు విన
వలతువేని సావధానుండవై యాకర్ణింపుము.

* * * *

**End :**

వ. అని సన్నుతించిన నమ్మహామునిమండల మధ్యంబుననున్న యప్పుం
డరీకాక్షుం డక్షిగోచరంబైన యట్లుండటు జయజయధ్వానంబు లొన
ర్చిరి దివిజపుష్పవర్షంబులు గురిసె నతనియందుల భక్తికభినందించి
గోవిందశర్మ వీడ్కొలిపిన ద్వారకానగరంబునకుంబోయి శార్ఙ్గపాణి యా
లింగనాది సంభావనలు గైకొనియుండె; నారదాదియోగీంద్రులును
నమ్మహామునీంద్రులును ధర్మనందను దీవించి యాతనికి గోవిందశర్మ
యుపదేశించిన బ్రహ్మోపదేశంబు తమకతమక యుపదేశించుటగాఁ
దలంచి హరిని స్మరించుచుఁ దమతమ నెలవులకుం బోయిరి. ధర్మపుత్త్రుం
డును సహోదర బంధుమిత్రవ్రాతంబుతో, హరినారాధింపుచు సమస్త
సామ్రాజ్య లక్ష్మీవిభవంబు లనుభవింపుచు సుఖంబుననుండెనని పరీక్షిన్న
రేంద్రునకు శుకబ్రహ్మ చెప్పుటయును.

క. వేదాంత తత్త్వనిశ్చయ
వేదమనోవేద్య మదనవిద్యాకేలా
మోదితరాధా ముఖకమ
లోదర తాంబూలరస సముత్సుకహృదయా.

స్రగ్విణి. సామజప్రస్తుతా సన్మునీంద్రార్చితా
హైమపీతాంబరా స్వాంఘ్రిభూతాంబరా
కామలీలాకృతీ కౌస్తుభాలంకృతీ
కోమలాంఘ్ర్యంబుజా కుందదంతప్రభా.

**Colophon :**

ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ సకలకళాపారీణ
<u>కృష్ణభట్టారక పౌత్త్ర</u> <u>చింతలపూఁడి రామయ</u> ప్రభుసుపుత్త్ర సుకవివర్య

రాధామాధవ యెల్లనార్యప్రణీతంబైన శ్రీవిష్ణు మాయానాటకంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

గ్రంథావతరణిక కొంచెం. కడముగ్రంథమెల్లఁ గలదు. వ్రాఁత బాగైనది. శైథిల్యము లేదు. గ్రంథపాఠము లల్పముగాఁ గలవు తప్పులు లేకపోలేదు.

విష్ణుమాయావిలాసమను పేరుగల యీ యయిదాశ్వాసముల రసవత్ప్రబంధమున విష్ణుదేవుని మాయామాహాత్మ్యము దెలుపు కథలు వింతవింతలవి వర్ణింపఁబడినవి. గ్రంథకర్త చింతలపూఁడి యెల్లకవి. ఆర్. నెం ౩౮౬ రు రాధామాధవము, ఆర్. నెం ౩౮౭ రు తారకబ్రహ్మరాజీయము, నీతని యితరకృతులు. ఈ కవినిగూర్చి మీఁది గ్రంథముల విషయ వివరణములందుఁ జూచునది.

## No 788. విష్ణుమాయానాటకము.

## VISNUMĀYĀNĀTAKAMU.

Substance, paper Size, $11\frac{3}{8} \times 7\frac{1}{4}$ inches Pages, 354 Lines, 22 on a page. Mode of writing, good but not without mistakes Condition, injured Appearance, old

Complete but without the prefatory portion

Same work as the above

The MS described under No 786 is copied from this MS.

(వి-వి.)—

అవతారిక కొంచెగాఁ గడముగ్రంథమెల్లఁగలదు. వ్రాఁత మంచిది. శైథిల్యమున్నది. తప్పులు లేకపోలేదు.

ఇది నెం 786 రు వర్ణితమగు దానికి మాతృకయే.

## No 789. విష్ణుమాయావిలాసము.

## VISNUMĀYĀVILĀSAMU.

Substance, paper Size, $12\frac{1}{8} \times 8$ inches Pages, 297. Lines, 22 on a page. Mode of writing, good but incorrect Condition, good. Appearance, old.

Complete in five Āśvāsas.

A classical poem dealing with the part played by God Viṣṇu when he appeared in the form of Mōhini a lovely and captivating damsel. Similar to the work described under R Nos. 786 and 787 The author of the work is Vēnkatakavi, son of Narasamātya, of Bhāradvājagōtra Eragudipāti Śrīgirimantri is the remote ancestor Historical information regarding the author's genealogy, and the place Bitragunta are given in the work which is dedicated to God Venkatēśvara

**Beginning :**

ఉ. శ్రీయలమేలుమంగ నెదఁ జెన్నుగఁ దాల్చి మహానురక్తిచేఁ
బాయక భక్తలోకముఁ గృపారసవీక్షణ సంప్లుతాత్ములం
జేయుచు బిట్రగుంట నివసించిన వేంకటభక్త నవ్యకా
వ్యాయతవాగ్విలాస మహిమాతిశయంబులఁ బ్రోచుఁగావుతన్.

ఉ. ఎవ్వరికిత్తు నీకృతిని నెవ్వరు దీనికి దక్షులంచు నే
నువ్విళులూరుచు న్వెదక నుజ్జ్వల రత్నవిభూషణాంగుఁడై
మవ్వముతోడ నాకలను మన్మథకోటి విలాసమూర్తితో
మువ్వలు నందెలు న్మొఱయ మ్రోలను నిల్చిన కృష్ణుఁగొల్చెదన్.

* * * *

సీ. . . . . . .

మోహనసత్కవి ముఖ్యబాణాఖ్యుని
నాంధ్రభాషాచార్యు నన్నపార్యు
శ్రీకరకృతివిరాజిని సోమయాజిని
నీశ్వరార్చనధుర్యు నెఱ్ఱపార్యు
మొదలు పూర్వకవీశ్వర ముఖ్యులకును
వర్తమానోత్తమ కవీంద్ర వర్యులకును
బ్రణుతిగావించి తత్కృపా భరితమతిని
గావ్యమొక్కటి రచియింపఁ గడఁగినాఁడ.

* * * *

వ. అని నిశ్చయించి మదీయ వంశావతారంబు వర్ణించెద.

సీ. . . . . . . . .

ఘనుఁడు భారద్వాజ మునివరేణ్యునిగోత్ర
సంభవుఁ డార్య ప్రసన్నముఖుఁడు
సకలకళానిధి యకలంకమతిశాలి
సద్బుద్ధి దేవతాచార్యసముఁడు

సర్వసద్గుణమణిఖని సత్యధనుఁడు
భాగ్యసదనుఁడు యెఱగుడిపాటిఘనుఁడు
అతులితాచారి సర్వసమ్మతవిహారి
మానితోదారి శ్రీగిరి మంత్రిశౌరి.

ఆ. అట్టి నరసమంత్రి కా వెంగమాంబకుఁ
బుత్రకుండ శుభచరిత్రకుండ
విష్ణుభక్తిరతుఁడ వేంకటాఖ్యాతుండ
సుకవిజనహితుండ సుమహితుండ.

* * * *

ఉ. ఇట్టి మదీయవంశమున కెంతయు నభ్యుదయాభివృద్ధిగా
గట్టిగ వేంకటేశపదకంజయుగార్పితమైన కావ్యమే
నిట్టురచింపఁబూనితి మహీస్థలిఁ జంద్రదివాకరంబునా
నట్టుగ సత్కవీశ్వరుల కాత్మముదంబుగఁ బెద్దలౌననన్.

వ. అని . . . కృతీశ్వరుండగు బిట్రగుంట వేంకటేశ్వరుల చరిత్రంబుగొంత నే నెఱింగినంత వివరించెద.

క. పతగ కులేశ్వరగతికిఁ
హతదితిజపతికిని గాంచనాచలధృతికిన్
శ్రుతిసంస్తుతికిని సన్ముని
వితతిపతికి బిట్రగుంట వేంకటపతికిన్.

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన విష్ణుమాయా విలాసంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబు.

**End.**

మ. అనుచున్ శౌనకముఖ్యమానవులకు నెయ్యంబొప్ప సూతుండు చె
ప్పిన యీపుణ్యచరిత్ర సర్వజగతిం బొంపొందుసత్యంబునై
యినచంద్రస్థితిలోకపావనమునై యిష్టార్థ సంధాయియై
వనజాతాక్షు కృపాకటాక్షవశతన్ వర్ధిల్లు నెల్లప్పుడున్.

చతుష్కందము. శారివనరుహాలోచన
భూరతవినిహత దితిసుత బుధనుత విష్ణో
ధీరాఘన వర్ణహారీ
శ్రీరతకనకవసనధర చిరతరకరుణా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర వరలబ్ధ కవిత్వ రచనాచమత్కార సుజనభజనాచార భారద్వాజ గోత్రపవిత్ర నరసనామాత్య పుత్ర సకల సుకవిజనసఖ్య వేంకటాఖ్య ప్రణీతంబైన విష్ణు మాయావిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లక్కడక్కడ నున్నవి.

అయిదాశ్వాసముల యీ రసవత్ప్రబంధమున విష్ణుమూర్తి మాయా విలాసములు వర్ణింపఁబడినవి. నె 786, 787 రుల వర్ణితములగు గ్రంథములవంటిదే. కృతికర్త వేంకటకవి, నర్సనకొడుకు, భారద్వాజగోత్రుఁడు, ఎఱగుడిపాటి శ్రీగిరిమంత్రి యీతనివంశమున మూలపురుషుఁడు. కవివంశవృత్తాంత మతిదీర్ఘముగా వర్ణింపఁబడియుండుటచే నిం దుదాహరింప లేదు. ఈకృతి చిట్రగుంట వేంకటేశ్వరస్వామికి సమర్పింపఁబడినది. చిట్రగుంటను గూర్చియు, వేంకటేశ్వర స్వామిని గూర్చియుఁ గొంతచరిత్రము గ్రంథమునఁ గలదు. కాని అదికూడ నతిదీర్ఘముగా నుండుటచే నిందుదాహరింప లేదు.

## No 790. విష్ణుమాయావిలాసము

## VISNUMÂYÂVILÂSAMU.

Substance, paper Size, 9⅛ × 6¼ inches Pages, 159 Lines, 16 on a page Mode of writing, good and written only on one side of the paper, but not correct Condition, good Appearance, old.

Complete in three Âsvâsas but two stanzas at the end of the third Âśvâsa are wanting.

Begins on fol 1a The other work herein is Kāvyālankāra Sangrahamu

A Prabandha dealing with the same story as that described under R. Nos 786—789 The author, Rōsanūri Vēnkatapati, son of Ganganamantri, bears the title "Tikkayajva" which was awarded by Kumāra Ecabhūpāla, the father of Bangarēcanrpāla, Zamindar of Venkatagiri, to whom the work was dedicated

**Beginning :**

శా. శ్రీవక్షోజతటీపటీరమెదపైఁ జెన్నొందఁగా నంజన
గ్రావేంద్రార్జునకూటకల్పిత శుభాగారంబునం దుజ్జ్వల
త్ప్రావీణ్యుండగు వేంకటేశ్వరుఁడు శుంభత్పుత్త్రపౌత్త్రాదిక
శ్రీవర్ధిష్ణుఁడు బంగరేచవిభునిన్ శ్రీమత్కృపం బ్రోవుతన్.

* * * *

మ. స్వవశంబైతగు కాళికావరకృపాసంపూర్ణతన్ శబ్దసా
ష్ఠవచిత్రార్థసలక్షణక్రమనిరూఢప్రక్రియాన్వీతమా
కవితాతత్త్వమహత్త్వము న్పృథలవకర్ణించె నేమేటి భ
వ్యవచోమాధురి నాపెదూరికవిఁ బెద్దామాత్యుఁ గీర్తించెదన్.

* * * *

క. వింతగ నొకకృతి సేయఁగఁ
చింతించుచు సకలరీతి శృంగారకళా
క్రాంతమగునట్లు గాఁగను
సంతసమున నుండునట్టి సమయమునందున్.

చ. పటుభట హేమమందిర శుభక్రమరత్నకవాటకూట వి
స్ఫుటతరసాలఖేయ నవసుందరపద్మవిలాస సంభృతో
త్కట మదనాగవేగజిత గౌరవవాయుతురంగమైన వేం
కటగిరిరాజధాని నతికౌతుకకీర్తికళాభిరాముఁడై.

సీ. . . . . . .

తనకటాక్షంబు శ్రితజనోద్యానవనవ
సంతనైరంతరీవిలాసంబు గాఁగ
వెలసినకుమార యేచభూవిభుకుమారుఁ
డెలమి నెలుగోటి బంగారు యేచవిభుఁడు

* * * *

పనరేంద్రుఁడు వైరిసైనికాసీశ్వర
కోటకారాగారపేటినుంచె.

* * * *

మ నను శ్రీభూపతి లింగపాదభజనానందున్ గుమారేచభూ
జనపాలాగ్రణి తిక్కయజ్వయనుచుం జాలంగఁ బేరిచ్చి ప్రో

చినఁ బెంపొందిన రోసనూరికులునిన్ శ్రీవేంకటాఖ్యుఁ గృపా
ఘనగంభీరశుభైకదృష్టి వెలయంగాఁ జూచి పల్కెం దగన్

క. నీవొనర్చు కృతి ఘటింపఁగ
భావంబునఁ దలఁచియున్న బహువిధశృంగా
రావిర్భవమగు తత్కృతి
శ్రీవెలయఁగ నంకితంబు సేయుము మాకున్.

శా. శ్రీనారాయణచర్యయై యిహపరశ్రేయస్కరంబై శివా
జ్ఞానిస్స్వాంత మహానురాగయుతమై సర్వక్రియాసంపదన్
మాన్యై సుందర బంధురస్థితులఁ బ్రేమన్విష్ణుమాయావిలా
సానూనంబగు సత్కృతి న్విరచితంబై యొప్పఁ గాఁ జేయుమీ

చ. అని బహుమానపూర్వ వినయాదరతోషణ మంజుభాషణా
ద్యనుపమకర్ణభూషణ నవాంబర సంభృతుఁ గాఁగ వేడ్కని
చ్చిన కపురంపుఁదమ్ములము చేకొని మంచిదటంచు నెమ్మనం
బున ననురాగవల్లి కలుపాల్పుదలిర్పఁగ సమ్మతంబునన్.

సీ. ఏవర్ణనీయుఁడియ్యె లను శ్రీహరిపాద
జలజజాతుఁడు పద్మకులుఁడనంగ
నేబంగరేచ భూమీశ్వరుఁడతిపిర
మాతసుపాత్రుఁడీ మహినుతింప
నేకుమారేచ భూమీంద్రుఁడుపట్టంపు
కోమలికమ్మకరకును సుపుత్రుఁ
డేబంగరేచ మహీమండలాధ్యక్షుఁ
డభినవ విష్ణుమాయావిలాస

గీ. సత్కృతికినాథుఁ డాతనిసన్నుతింపఁ
దగిన నాదైనభాగ్య మెంతగావచింప
ననుచు మదిలోన సంతోషముగ్గలింప
నెరసిమతియును దృఢబుద్ధి నివ్వటిలఁగ

సితకేతనునకుఁ దద్వల
సితకాంతికరోర శత్రుచేతోభీతి

స్థితిహేతునకును భూనుత
సతతపరాక్రమవిశాల సంజాతునకున్.

* * * *

క. శ్రీయుతముగ నంకితముం
జేయంగాఁ బూనినట్టి శృంగారకళా
శ్రేయోదాయక హరిహర
మాయావిలసత్ కథాక్రమం బెట్లనినన్.

**Colophon**

ఇది శ్రీమద్దత్తాత్రేయ గురుచరణారవింద మకరంద బిందుసందోహ నందమానసేందిందిర భద్రకాళీవరప్రసాదాసాదిత కవితాచమత్కార కుమారేచ నృపదత్త "తిక్కయజ్వ" నామాంతరభాసుర రోసనూరిలింగనామాత్య పాత్రగంగన మంత్రిపుత్త్రి కాశ్యపగోత్రపవిత్ర వజ్రకంకట విశంకటమతి వెంకటపతి కవిప్రణీతంబైన విష్ణుమాయావిలాసంబను శృంగార ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

**End:**

క. శ్రీరోసనూరుభూపతి
గౌరీశదయానులబ్ధ కామితఫలశృం
గార వెలుగోటికుల బం
గారేచ నృపాలచంద్రకవనమ్ము గేంద్రా.

* * * *

క. అని వైశంపాయనముని
జనమేజయునకును విమలచారిత్రునకున్
వినవిన వేడుకపరిగొన
వినిపించిన పుణ్యకథ వివేకస్ఫూర్తి

క. రేయుఁబగలు విష్ణుమాయావిలాస మీ
కథపఠించి వ్రాయఁ గన్నవిన్న
జనుల కెల్లఁబుత్ర సంపద లాయురా
రోగ్యభాగ్యములు నిరూఢమగును.

శా. నానారత్నవిచిత్రభూషణ కళానైపుణ్యమూర్ధన్య గౌ
రీనారీరమణాంఘ్రి పద్మవిలస ద్భృంగాంతరంగాడియ

శ్రీనిత్యోత్సవ మందిరాంతర బహుశ్రేయస్కరా బంధు సం
తానా వెల్గోటి బంగరేచనృపతీ ధర్మజ్ఞ విద్వన్నిధీ.

(వి-వి.)—

సమగ్రముకాని తృతీయాశ్వాసాంత మించుక లేదు. వ్రాఁతతిన్ననిది. పత్రమున కొకవైపున మాత్రము వ్రాయఁబడినది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఈ మూఁడాశ్వాసముల యపూర్వకావ్యమున విష్ణువు మాయామోహినీరూపమున నీశ్వరుని మోసపుచ్చినకథ వర్ణింపఁబడినది. కర్త రోసనూరి వేంకటపతి. గంగనమంత్రి పుత్త్రుఁడు కృతిభర్త వెలుగోటి బంగరేచనృపాలుఁడు. వేంకటగిరి ప్రభువు. ఈతని తండ్రియగు కుమారేచభూపాలుఁ డీకవికిఁ "దికటయజ్వ" యను బిరుదము నొసంగెనట. విశేషము లుదాహృతపద్యములం గాంచునది

---

## No. 791. వీరభద్రవిజయము.

## VĪRABHADRAVIJAYAMU.

Substance, paper Size, 11¾ × 7⅛ inches Pages, 229 Lines, 23 on a page Mode of writing, fair but not correct Variations in reading are interlined Condition, injured Appearance, old.

Begins on fol 1*b* The other works herein are Sūryatanayāparinayamu 123*a*, Dvipada Bhallānacaritra 229*a*, Dvipada Sārangadhara-caritraṭika

Complete.

Same work as that described under R No 292 of the Triennial Catalogue of MSS, Volume 2, part III

A note, apparently in Mr. C. P Brown's hand, on the fly-leaf of the MS, is as follows.—

"This poem is grounded on a story in the Śiva Vāyupurāna. The style is classical and elegant. The present copy is grounded on two manuscripts."

(వి-వి.)—

సంపూర్ణము వ్రాఁత యొకతీరుగానున్నది. తప్పులు మెండు. శైథిల్య మధికము. గ్రంథపాతములు కలవు. పాఠాంతరములు బంతులనడుమ నెక్కింపఁబడినవి. ఇది ఆర్ నెం 292 రున వర్ణింపఁబడిన గ్రంథమే.

## No. 792 వీరభద్రవిజయము.

## VĪRABHADRAVIJAYAMU

Substance, palm-leaf Size, 16¾ × 1¼ inches Pages, 162 Lines, 6 or 7 on a page Mode of writing, fair, but full of mistakes Condition, fair Appearance, old

Complete

Same work as the above.

The name of the scribe and the date of transcription are extracted below as given at the end of the third Āśvāsa

(వి-వి.)—

సమగ్రము. వ్రాత యంతమంచిదికాదు. తప్పులు మెండు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కాన్పింపవు.

పూర్వమువలె.

తృతీయాశ్వాసాంతమున: "శ్రీహాలసూరసోమేశ్వరార్పణమస్తు . . . క్రోధనామసంవత్సర ఫాల్గుణశుద్ధ ౧౨ అంగారకవారంనాడు . . . . హాలసూరు సుబ్బయ్య కుమారుఁడు చాయప్పవ్రాశిన వీరభద్రవిజయం . . . . " అని యున్నది.

---

## No 793 వీరభద్రవిజయము.

## VĪRABHADRAVIJAYAMU

Substance, palm-leaf Size, 16⅜ × 1¼ inches Pages, 152 Lines, 7 or 8 on a page Mode of writing, not good and not quite correct Condition, injured Appearance, old.

Complete

Same work as the above.

The name of the scribe and the date of transcription are given below as found at the end of the MS

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులు లేకపోలేదు. శైథిల్య గ్రంథపాతములు గలవు

పూర్వమువలె

గ్రంథాంతమున: "ప్రమోదూతనామసంవత్సర జ్యేష్ఠశుద్ధ 3 లు *కి౮—తాళ్ల మామిడికి అవిరిసుందరి వ్రాసియిచ్చిన ప్రతిప్రకారాన మాదేటి రాముఁడు వ్రాసిన వీరభద్రవిజయం . . . " అని కలదు.

## No 794. వీరభద్రవిజయము.

## VĪRABHADRAVIJAYAMU

Substance, palm-leaf Size, $15\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches Pages, 216 Lines, 6 or 7 on a page Mode of writing fair but not correct Condition, injured Appearance, old.

Complete, but a few leaves here and there are wanting

Same work as the above

The name of the scribe and the date of transcription are extracted below as found at the end of the MS

(వి-వి)—

సమగ్రము. వ్రాంతి యొకతరబడిగా నున్నది తప్పులు కలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు. అకటాడకటాడ కొన్ని పత్రములు కాన్పింపవు

పూర్వమువలె.

గ్రంథాంతమున: "ఖావనామసంహ్వత్సర కార్తిగ బ॥ ౧౧ సో వరకు . . . అల్లెగోపుల్రవ్రాశిన పొస్తుకం" అనియున్నది.

## No. 795 వీరభద్రవిజయము.

## VIRABHADRAVIJAYAMU.

Substance, palm leaf Size, $13\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 160 Lines, 5 or 6 on a page Mode of writing, not good and not correct Condition, injured Appearance, old

Many leaves are wanting Contains the third and fourth Aśvāsas imperfectly.

Same work as the above

(వి.వి.)—

అసమగ్రము. తృతీయ చతుర్థాశ్వాసములు అరకొరలుగా గలవు వ్రాత తిన్ననిది కాదు. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

## No 796 వైజయంతీవిలాసము.

## VAIJAYANTĪVILĀSAMU

Substance, paper Size, $11\frac{5}{8} \times 7\frac{1}{4}$ inches Pages, 123 Lines, 22 on a page Mode of writing, good and not quite free from mistakes Condition, fair Appearance, old.

English notes apparently by Mr Brown appear here and there throughout the MS

Complete in four Āsvāsas

Begins on fol 170*a* The other works herein are Śrngāradāmamu, 1*b*, Śrngāra Sudhāsamudrapūrnacandrōdayamu 49*b*

An amorous poem describing the story of Vipranārayana also called "Tondaradippodiy ālvār", one of the twelve well-known Ālvārs. The author Sāranga Tammaya, son of Nisimhamantri of Bhāradvājagōtra was holding the post of kainam at Gōlkonda during the reign of Muhammad Shaw This work was dedicated to God Śrīrāma For other particulars refer to the Telugu extracts below This work is also called "Vipranārāyanacaritramu"

**Beginning:**

ఉ. శ్రీవసుధాసుతాంఘ్రి వివరింప శిరీషసుమోపమాన మీ
త్ప్రావరుకే ల్విసర్గగుణకర్కశ మశ్మము పెట్టఁ బలెర నె
ట్లీవసుధామరుం డనుచు నింతులు వలరఁగ నంటఁ గాంచులో
కావనుఁ డైనపెండ్లికొడు కష్టదభీప్సితముల్ ఘటింపుతన్.

* * * *

క వందారుదాసజనతా
మందారు న్వేదశాస్త్ర మహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురుఁ
గందాళప్పలగురుఁ జగద్ధితుఁ గొల్తున్.

* * * *

క. సారంగధరుఁడు వెలయఁగ
సారంగునివాఁటంచు సవివాగ్రణు లై
పేరుం బెంపును గాంచి రు
దారత నయ్యుభవు లనఁగఁ దద్వంశభవుల్.

శా. ఆసారంగధరుండు గ(ర?)ంగ మనుభార్యారత్నముఁ బెండ్లియై
వాసి న్వన్నెయు రా మెలంగి కనియె న్వంశావనుం బావను

భూసత్ప్రమాద్గణకావతంసు నిరతాభ్యుద్ధితనానాకళా
ధీసంధానసురేంద్రమంత్రి గిరిమంత్రి న్మంత్రిమందారునిన్.

క. గిరిమంత్రిమౌళి చంద్రమ
తరుణీమణియందుఁ గనియె దానకళాభా
సురతనయుఁ దనయుఁ దమ్మన
ధరధైర్యు ననూనశౌర్యుఁ దతిగాంభీర్యున్

* * * *

ఆ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు నం
దనుల శౌర్యసింహు నారసింహుఁ
జతురబుద్ధ్యుపేంద్రు సతతకళాగుణచంద్రు
గిరిచమూవరేంద్రుఁ గీర్తిసాంద్రు

* * * *

చ అనఘుఁడు తన్నృసింహవిభుఁ డాసతి యక్క మయందుఁ గాంచె న
న్ననుపమవర్తనుం డగు ననంతనమంత్రిశిఖావతంసముఁ
ఘనుఁడగు వేంకటాద్రి గణకప్రభుసన్నుతు నాసహోదరుల్
చనువున వామదక్షిణభుజంబులు వోలె సహాయులై తగన్.

చ ఇనసమతేజు లౌనృపుల నెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యొనుబదినాల్గుదుర్గముల నేలినయేలిక గోలకొండత
ద్ఘననగరీస్థలిం గరణికంబొనరింపుడుఁ దమ్మమంత్రి నా
జనపతి 'రమ్ముపా' న్మనఁ బ్రజ ల్జయపెట్ట గృహాఖ్యు నౌననన్

వ ఇట్టి వంశంబున మహోన్నతుండనై వివిధభోగంబు లను
భవింపుచున్నంత నొకరాత్రియందు

సీ . .

నగుమొగంబున నెలవంకనలికమైన
తిరుమణి ధరించువాఁ డొకదివ్యమూర్తి
యెదుట నిలుచుండి "నాపేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు (భ?) నవ్యభణితి"

క అని పలుకనంతలో మే
ల్కని నల్దికులను గలయఁ గనుగొని స్వప్నం
బున గులదైవము రఘుపతి
నను ధన్యునిఁ జేయవచ్చినాఁ డని తెలిసిన్.

* * * *

క. శ్రీమహిళామూర్త్యంతర
భూమిసుతాయోగయోగ్య భువనదఘన (నాద్భుత?) రే
ఖామంగళాంగజితసు
త్రామమణిదాముసకును రఘురాముసకున్

వ సమగ్రణంబుగా నారచియింపం బూనిన వైజయంతీవిలాసం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End.**

మ. వసుధ న్నామక గోపికాజనరతివ్యాపార మేలీల వే
దసమం బై వెలసెఁ దదీయసరణిం ద్వత్పుణ్యచారిత్రమున్
దెసలం బ్రస్తుతి కెక్కు దీని వినిన న్వ్రాసించినన్ వ్రాసినన్
రసనం బేర్కొనుచున్నవారలకు మద్రాద్ధానియేనిచ్చెదన్

* * * *

ఉత్సాహ పాదపాంసుపాలితాత్మపాదదార వేదసం (నా?)
వేదనాదితాదిరూప వేద్యభూత్యనాదితా
నాదితాంగజారిచాప నాదిదుష్టవేదిజా
వేదిజాలకాంక్షితాభివృద్ధికల్పపాదపా.

**Colophon.**

గద్య ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర శ్రీరామచంద్రకరుణాతరంగితకవిత్వవైభవ సారంగ(గు)నృసింహామంత్రితనూభవ పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాన తమ్మయాభిధానప్రణీతంబైన వైజయంతీవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ బ్రబంధపరిపూర్ణభాసురంబైన చతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సంపూర్ణము వ్రాఁత తిన్ననైనది తప్పులు బొత్తిగా లేకపోలేదు. శైథిల్య గ్రంథపాతము లంతగా లేవు

ఈ నాల్గాశ్వాసముల శృంగారప్రబంధమునఁ బన్నిద్దఱాళ్వారుల లోని "తొండరడిపొడియాళ్వా" రనఁబడు విప్రనారాయణుని చరిత్రము వర్ణింపఁబడినది కవి సారంగుతమ్మయ; నృసింహామంత్రి పుత్త్రుఁడు; భారద్వాజ గోత్త్రుఁడు ఇతఁడు మహమ్మదుషా ప్రభువుగానున్నపుడు గోలకొండకుఁ గరణముగానుండెనట విశేషము లుదాహృతభాగమునం గాంచునది ఈ గ్రంథము నీకవి శ్రీరామాంకితమొనర్చెను.

దీనవిప్రనారాయణు కథ వర్ణితమగుటచే "విప్రనారాయణ చరిత్రము" అను నామాంతరమును దీనికి గలదు.

## No 797 వైజయంతీ విలాసము.

## VAIJAYANTĪVILĀSAMU

Pages, 28 Lines, 20 on a page Mode of writing, good, but not quite correct

Begins on fol 185*a* of the MS described under No 436 of the Descriptive Catalogue of Telugu MSS, Vol II

Breaks off in the first Āsvāsa

Same work as the above

(వి-వి.)—

కొంచెము కొఱగా ప్రథమాశ్వాసము మాత్రముగలదు వ్రాత తిన్ననిది. తప్పులు లేకపోలేదు శైథిల్యగ్రంథపాతములు లేవు

పూర్వమువలె.

---

## No 798 వైజయంతీ విలాసము.

## VAIJAYANTĪVILĀSAMU

Substance, palm-leaf Size, 12½ × 1¾ inches Pages, 90 Lines, 8 on a page Mode of writing, fair but not quite correct Condition, fair Appearance, old.

Complete.

Same work as the above

The date of transcription and the name of the scribe are given below as found at the end of the work

(వి-వి)——

సమగ్రము వ్రాత యొకతరబడిగానున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్య మించుకకలదు. గ్రంథపాతములు లేవు

పూర్వమువలె.

గ్రంథాంతమున :

"జయనామసంవత్సర పుష్య శు ౫ శుక్రవారంనాడు మంచినీళ్ల వెంకటాచలం వ్రాసుకున్నాడు, స్వహస్తంగాను" అని యున్నది.

## No 799. వైజయంతీవిలాసము.

## VAIJAYANTĪVILĀSAMU.

Substance, paper Size, 12 × 7⅝ inches Pages, 91 Lines, 20 on a page Mode of writing, good but not correct Condition, good. Appearance, old

Begins on fol. 1 The other works herein are Sōmavāramāhātmyamu 49*a*, Sārangadharacaritra (Dvipada) 109*a*

Complete

Same work as the above. Variations in the readings are interlined.

A note apparently in Mr Brown's hand appearing on the fly-leaf of the MS is as follows —

"This poem is the Vaijayanti Vilāsamu, written by poet Tammaiya Edited by Venkatnarsu who at C P. Brown's desire added a commentary Anno 1833

In that edition the preface was omitted as superfluous, and is here added from another manuscript Hence originate the various readings now inserted

This poem is a very entertaining one, and deserves publication The poet evidently held neither the gods nor the brahmins in any respect

The name Vaijayanti is borrowed from Vijayam, victory meaning that one of the girls herein described gained her bet; or obtained the victory The hero's name being Vipranārāyana, the book is also called Vipranārāyanacharitra."

Immediately before the beginning of the work there is written the name of the work styled in the following manner :—

"The Vaijayanti Vilasām"

or "Ladies Wager," also called "Vipranārāyanacharitra"

(వి-వి)—

సమగ్రము వ్రాత తిన్ననిది. తప్పులు లేకపోలేదు శైథిల్య గ్రంథ పాతము లంతగా లేవు పాఠాంతరములు పంక్తులనడుమ నెక్కింపఁ బడినవి.

పూర్వమువోలె

---

## No 800 వైజయంతీవిలాసము.

## VAIJAYANTĪVILĀSAMU

Substance, palm-leaf Size, 15¾ × 1½ inches Pages, 118. Lines, 5 or 6 on a page Mode of writing, good but not correct Condition, good. Appearance, old

Complete but without the prefatory portion.

Same work as the above

A note of the scribe, showing his name and date of transcription, is found at the end of the MS and is extracted below

(వి-వి.)—

కృత్యవతరణిక తర్వాత భాగమువరకు గ్రంథము సంపూర్ణముగాఁగలదు. వ్రాత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము అంతగా లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున:

"పార్థివనామసంవత్సర కార్తిక శు ౧౫ గురువారం సరికి విన్నకోట నరిశింహయ్యలు దస్తూర్తివ్రాశి మాజేటి సర్వేశలింగముకు ఇచ్చెను" అని యున్నది.

---

## No 801 వైజయంతీవిలాసము. VAIJAYANTĪVILĀSAMU

Substance, palm-leaf Size, 16⅝ × 1¼ inches Pages, 84 Lines, 5 or 6 on a page Mode of writing, good and apparently correct Condition, fair Appearance, old

Contains the last three Āsvāsas only

Same work as the above.

(వి-వి.)—

కడపటి మూఁడాశ్వాసములు మాత్రము గలవు వ్రాఁత యందమైనది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No 802 వైజయంతీవిలాసము (సటీకము.) VAIJAYANTĪVILASAMU SATĪKAMU

Substance, paper Size, 12⅝ × 9⅜ inches Pages, 210 Lines, 24 on a page Mode of writing, good but apparently correct Appearance, old

Complete but without the prefatory stanzas

Same work as the above, and also contains a commentary which is attributed to one Āranimatham Vīrabhadrayya as noted in Telugu in pencil at the end of the work. The commentary is written in colloquial style.

(వి-వి.)—

అవతారిక తప్ప తక్కినభాగముగలదు వ్రాంత యందమయినది. తప్పులు లేకపోలేదు. శైథిల్య గ్రంథపాతములు లేవు

పూర్వమువలె. ఇందుఁ డీకయుఁగలదు. వాడుకభాష. గ్రంథాంతమున

"ఆరణిమఠం వీరభద్రయగారు చేసిన సటీకగ్రంథము" అని వ్రాయఁబడియుండుటచే నాతఁడేటీకాకారుడని తెలుచున్నది ఆశ్వాసాంతపద్యములకు సైతముటీక లేదు.

**Beginning:**

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనినవైజయంతీవిలాసం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

టీ. సమర్పణంబుగా - వినియోగమయ్యేటట్టుగా, నాయొనర్పంబూనిన - నేనుచెప్పేటందుకుపూనుకున్నటువంటి, వైజయంతీవిలాసంబను వైజయంతీవిలాసమనే, మహాప్రబంధంబునకు - గొప్పగ్రంథమునకు కథాక్రమంబు - కథయొక్కవరుస, ఎట్టిదనిన ఎటువంటిదంటేను

**End:**

క. పెరుమాళ్లుల కాగిన్నెయు
నిరుబర్వులపసిఁడికానుకయిడి తనకదియే
తిరువారాధనగాఁ గొని
సిరివరు రంగేశ్వరున్ భజింపుచు నుండెన్.

టీ. పెరుమాళ్లకు - శ్రీరంగస్వామివారికి, ఆగిన్నెయు - ఆబంగారు గిన్నెనున్నూ ఇరు బరువులపసిడి - ఇద్దరిమోతబంగారమునున్నూ, కానుకయిడి - కానుక యిచ్చి తనకదియే తనకు అదిసమర్పించడమే తిరువారాధనగా గొని - దేవపూజగా విచారించుకొని సిరివరుఁలక్ష్మీదేవికి పెనిమిటి అయినటువంటిఁ రంగేశ్వరున్ - శ్రీరంగస్వామివారిని గూర్చి భజింపుచు నుండెన్ - సేవించుతూనుండెను.

* * * *

ఉత్సాహ పాదపాంసుపాలితాతపాదదారవేదనా
వేదనాధితాదిరూపవేద్యభూత్సనాదితా
నాదితాంగజారిచాపనాదదుష్టవేది జా
వేదజాలకాంక్షితాభివృద్ధికల్పపాదపా

**Colophon**

గద్య ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర శ్రీరామ చంద్రకరుణాకటాక్షకవిత్వవైభవసారంగ నృసింహామాత్యతనూభవపరివిత భగవద్భాగవతకైంకర్యవిధానపుణ్యయాభిధాన ప్రణీతంబైన వైజయంతీ విలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

No **803** వైజయంతీవిలాసము సటీకము

VAIJAYANTĪVILĀSAMU (WITH TELUGU MEANING.)

Pages, 30 Lines, 22 on a page Mode of writing, good but not quite correct

Begins on fol 202*a* of the MS described under No 436

Contains a portion of the first Āśvāsa, from the beginning of the story

Same work as the one described above

(వి-వి.)—

ప్రథమాశ్వాసములోని కొంతభాగము మాత్రము గలదు. వ్రాంత బాగుగానున్నది తప్పులు లేకపోలేదు.

పూర్వము వలె

No **804.** శకుంతలాపరిణయము.

ŚAKUNTALĀPARIṆAYAMU.

Pages, 214 Lines, 16 on a page Mode of writing, good but not correct Condition, good Appearance, old

Begins on fol 10b*a* of the MS described under No 559 of the Descriptive Catalogue of Telugu MSS, Vol II

Complete

Same work as that described under R No 76 of the Triennial Catalogue of MSS, Vol I, Part 3 By Krsnakavi, disciple of Singara Guru Cirumāmilla Pāpayaprabhu at whose instance the work was composed was a descendant of Cirumāmillapeddasūri, who received many elephants from Krsnadēvarāya, and who was a disciple of Ētūri Immadi Tirumalakumāra Singarārya

**Beginning**

శా. శ్రీవత్సాంకలసద్భుజాంతరయుతస్వీయోరుహారాగ్రరే
ఖావిశ్రాంతి నెసంగు తత్కటతటీ గైసేయు కాశ్మీరసం
భావంబు ల్తనమైఁ బొసంగ నలమేల్మంగాభిధానేందిరా
దేవిం గౌఁగిటఁ జేర్చు వేంకటపతిన్ ధీయుక్తిఁ బ్రార్థించెదన్.

*　　*　　*　　*

క. భాసురసూరిగ్రామణి
భూసురముఖపంకరుహానభోమణి వినమ
ద్దాసనిచయచింతామణి
నే సింగరిగురుశిఖామణిన్ గణుతింతున్.

వ. ఇవ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబును గురువందనంబును సుకవిభూషణంబును గుకవిదూషణంబును గావించి యుద్ధియేనియు నొకప్రబంధంబు రచియించి మదిష్టదేవతంబునకంకితంబు గావింపందలంచునవసరంబున.

*　　*　　*　　*

క. ఆపాదిభవులలోపల
నాపాదితధైర్యధుర్యు లార్యు లవార్యుల్
ప్రాపితఘనకనకాంబర
గోపాయితకవులు వైదికులగోత్రభవుల్.

*　　*　　*　　*

ఉ. సన్నుతకృష్ణరాయనృపసత్తముచిత్తము రాఁ జరించుచున్
మన్నన మీఱ భూరిబహుమానము గాఁ గజరాజరాజిఁగై
కొన్నఘనుండు వైదికకులగోత్రపవిత్రచరిత్రుఁ డౌర పె
ద్దన్నసుర ల్నరు ల్పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగున్.

సీ. మహిమ నేటూరిబుమ్మడితిర్మలకుమార
సింగరార్యులప్రియశిష్యుఁ డగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనరక్తి
గలిగి శౌర్యోదార్యకలితుఁ డగుచు

రాయలరాజకార్యమునందు నిరతుఁడై
ప్రాజ్యసామ్రాజ్యసంభరితుఁ డగుచు
ధనధాన్యకటక మై తనయిల్లు వర్ధిల్ల
ధాత్రీసురత్రాణదక్షుఁ డగుచు
నవని రచియించె రసనిష్ఠాద్యనవద్య
పద్యగద్యావళీస్తవ్యభవ్యనవ్య
కావ్యసంభావ్యభీమసంగ్రామవిజయ
బిరుదుఁ డగు చిరుమామిళ్ల పెద్దశౌరి

ఉ. మానితమూర్తియైన చిరుమామిళ్ల పెద్దన్న పాలమాళికిన్
సూనుఁడొరుండుగల్గెను ఘనసూదన పావనమస్త్రియాపరుం
డానతశత్రుజాలుఁడు నయాన్వయ శీలు డుదాత్తమ
జ్ఞానఘనుండు తిమ్మనప్రశస్తముఁడుత్తముఁ డిమ్మహీరహీ.

* * * *

**End:**

See R No 76 of the Triennial Catalogue of MSS, Vol 1, Part 3 (వి-వి.)—

సమగ్రమే కాని కృత్యవతరణికయందుఁ గొంత భాగము లేదు. వ్రాఁత యందమైనది. తప్పులు కలవు. శైథిల్యము లేదు.

ఇయ్యది ఆర్ నెం 76 రున వర్ణింపఁబడినగ్రంథమే. పరగ్రంథకర్త యగు కృష్ణకవి సింగరగురు శిష్యుఁడు. ప్రేరకుఁడగు చిరుమామిళ్ల పాపయప్రభుఁడు శ్రీకృష్ణదేవరాయులవలనఁ బత్కేనుఁగులను బహుమానముగాఁబడసిన పెద్దనవంశస్థుఁడు. ఈ పెద్దన పటూరి యిమ్మడి తిర్మలకుమార సింగరార్యుల శిష్యుఁడట. తక్కిన విషయముల నెం 76 రునఁగాంచునది.

---

## No 805 శకుంతలాపరిణయము.

## ŚAKUNTALĀPARIṆAYAMU

Pages, 21 Lines, 26 on a page Mode of writing, good but not correct. Condition, good Appearance, old

Begins on fol 121 (b) of the MS described under No 601 of the Descriptive Catalogue of MSS. (Telugu) Śṛṅgāra Prabandhas

Contains the first Āśvāsa only without the introductory portion

Same work as the above

(వి-వి.)—

కృత్యవతరణికకొంతగాదొలియాశ్వాసముమాత్రముకలదు. వ్రాంతయందమైనది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె

No 806 శకుంతలాపరిణయము.

ŚAKUNTALĀPARINAYAMU

Substance, palm leaf  Size, 15¾ × 1¼  Pages, 142  Lines, 6 or 7 on a page  Mode of writing, fair but not correct  Condition, good  Appearance, old

Complete

Same work as the above and also contains the preface or introductory portion

(వి-వి.)—

సమగ్రము. వ్రాత యొక తరబడిగానున్నది. తప్పులు మెండు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె. ఇందు నెం 803 దులో లేని కృత్యవతరణిక యందలిభాగము సైతముకలదు.

# GENERAL INDEX.

[ వ.రా — అడుగున గీఁత గీయఁబడిన పేర్లుగల గ్రంథము లీ క్యాటలాగునందు వర్ణింపఁబడినవి ]

పేజి